Issued— 22-5-1956










# ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

# OFFICIAL REPORT

## THURSDAY, 21st JULY 1955

## VOLUME IV—No. I

*CONTENTS*



PRINTED BY SREE PANDURANGA PRESS, ELURU
FOR THE SUPERINTENDENT
ANDHRA GOVERNMENT PRESS
KURNOOL
1956

PRICE, 4 annas

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

**Thursday, 21st July, 1955.**

The House met in the Assembly Hall at eleven of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS.

### SHORT NOTICE QUESTION

*Kothakota - Asanapuram Electricity Scheme.*

193-A.

*1155-A. Q:—Sri N. P. CHENGALARAYA NAIDU:—(Put by Sri R. Nathamuni Reddi) Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state:

[a] whether it is a fact that Kothakota - Asanapuram Electricity Extension scheme was entrusted to a contractor in 1954–55 and that the work was not started even by the end of the year;

[b] if so, the action taken by the Government against the Contractor;

[c] whether it is a fact that the electric posts and other materials intended for Kothakota - Asanapuram scheme were transported to Vizag; and

[d] if so, the reasons therefor?

The Hon. Sri G. LATCHANNA:—

[a] The answer is in the affirmative;

[b] Instructions have been issued to the contractor to expedite the work on the erection of line. The work has since been started, it is expected to be completed in August 1955;

[c] The answer is in the negative;

[d] Does not arise.

Sri R. NATHAMUNI REDDI:— ప్రస్తుతము పనులు జరగటములో కంట్రాక్టరుకు యిచ్చిన పనులు బాగా జరుగుచున్నవా? లేకపోతే డిపార్టుమెంటు ద్వారా జరిగే పనులు బాగా జరుగుచున్నవా?

The Hon. Sri G. LATCHANNA:— కంట్రాక్టరుకు యిచ్చిన పనులు సక్రమంగానే జరుగుచున్నవి. డిపార్టుమెంటు చేసే పనులు కూడా సక్రమంగానే జరుగుచున్నవి. కంట్రాక్టరు లేనిచోట డిపార్టుమెంటు take up చేస్తున్నది.

Sri R. B. RAMAKRISHNA RAJU :— ఎవరండీ, ఆ కంట్రాక్టరు ?

The Hon. Sri G. LATCHANNA:— వేరే ప్రశ్న వేస్తే చెప్పగలను.

Sri V. VISWESWARA RAO :— ఒక ప్రాంతంలో శాంక్షను అయిన కంట్రాక్టు వర్కు మరొక ప్రాంతానికి పంపించడము అలవాటు వున్నదా ?

The Hon. Sri G. LATCHANNA:—ఒక ప్రాంతంలో శాంక్షను అయిన స్కీము మరొక ప్రాంతంలో అమలే కాదు అని నా ఉద్దేశ్యము.

Sri PILLALAMARRI VENKATESWARLU :— కంట్రాక్టరుకిస్తే డబ్బు తక్కువవుతుందా ? లేకపోతే డిపార్టుమెంటుద్వారా చేయిస్తే డబ్బు తక్కువవుతుందా ?

The Hon. Sri G. LATCHANNA:—కంట్రాక్టరుకిస్తే పనులు గంటల మీద జరుగుతాయి. డిపార్టుమెంటుద్వారా జరిగేవి ఎంతగ్లుప్తంగా అవుతుందో ఎంత actual గా ఖర్చు అవుతుందో దానిమీద ఆధారపడి వుంటుంది.

Sri PILLALAMARRI VENKATESWARLU :— ఈ రెండింటిలో comparitive గా దేనికి డబ్బు తక్కువ అవుతుంది ?

The Hon. Sri G. LATCHANNA :— Comparitive గా చెప్పటానికి వీలులేదు. Estimate వేసిన స్కీములన్నీ ఒక మాదిరిగా ఉండవు.

Sri PILLALAMARRI VENKATESWARLU :— ఒకేపని కంట్రాక్టరుచేస్తే తక్కువవుతుందా ? లేక డిపార్టుమెంటుకిస్తే తక్కువవుతుందా ?

The Hon. Sri G. LATCHANNA :— జవాబు తప్పుఅని సభ్యుని ఉద్దేశము అయితే కావచ్చు. కాని నేను యిచ్చిన సమాధానము సరిఅయినదే.

Sri P. VENKATASUBBAYYA :— ఆ కంట్రాక్టరు పేరు ఏమి ? కంట్రాక్టు ఏ తేదీన యిచ్చారు ? ఇప్పటివరకు పని ఎంత జరిగింది ?

The Hon. Sri G. LATCHANNA :— కంట్రాక్టరు పేరు నావద్దలేదు. రాజుగారు అడిగితే వేరే ప్రశ్న వేయమని చెప్పాను. 1950 సం॥ మధ్య ఆ పని కంట్రాక్టుకు యివ్వడం అయింది.

Sri V. KODANDARAMA REDDI:—ఆదేపనులను కంట్రాక్టు ద్వారా యిస్తే త్వరగా జరుగుతుందా? లేకపోతే డిపార్టుమెంటుద్వారా తొందరగా అవుతుందా?

అనే ప్రశ్నకు మంత్రిగారు సరియైన సమాధానం ఇవ్వలేదు. ఇప్పుడైనా జవాబు చెప్తారా ? కంట్రాక్టరుకు యిచ్చిన పనులు tenders పిలిచి యిప్పటికి 5 నెలలు కావచ్చినను పనులు మాత్రం ఏమీ జరగలేదని తెలుస్తున్నది. పనులు వీలైనంత తొందరగా జరగటానికి Department ద్వారా చేయిస్తే బాగుంటుందని మంత్రిగారికి తెలుసునా ? దానిని గురించి మంత్రి గారి అభిప్రాయమేమి ?

The Hon. Sri G. LATCHANNA:—అన్ని చోట్లలోనూ డిపార్టుమెంటే take-up చేయటానికి సాధ్యముకాదు. అట్లా అయితే దానికి క్రొత్త డిపార్టుమెంటును సృష్టించాలి. కంట్రాక్టరు లేనిచోట అత్యవసర పరిస్థితులనుబట్టి డిపార్టుమెంటు take up చేస్తుంది.

Sri B. SANKARAYYA :—ఈ ప్రశ్నలో (సి) భాగానికి జవాబు చెప్పలేదు. అక్కడ శాంక్షను అయిన electric posts యితర చోట్లకు ఏమైనా transfer చేయబడ్డవా ? అయితే ఎందువల్ల ఆ విధంగా జరిగింది ?

The Hon. Sri G. LATCHANNA :—ప్రశ్నలో (సి) భాగానికి జవాబు చెప్పాను. సభ్యుడు దానిని వినిపించుకోలేదేమో గాని, దానికి నేను negative సమాధానము చెప్పాను.

Sri S. NARAYANAPPA :— కంట్రాక్టర్లకు పని యిస్తున్నప్పుడు, తొందరగా పనులు జరగడములేదని తెలుస్తున్నది. అలాంటప్పుడు time limit పెట్టితే ఆ పనులు సకాలంలో పూర్తిచేయించటానికి వీలవుతుంది. ఆవిధంగానైనా చేస్తారా ?

The Hon. Sri G. LATCHANNA :— కంట్రాక్టర్లకు అప్పుడప్పుడు హెచ్చరికలు జరుగుతూనే వున్నవి.

## STARRED QUESTIONS

### *Construction of Houses to N. G. Os.*

194.

* 7-Q : Sri S. VEMAYYA :— Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether the construction of houses to N. G. Os. has been completed in Kurnool now;

(b) whether all N. G. Os. have been provided with Government quarters now; and

(c) if not, the number of them without Government quarters ?

The Hon. Sri B. GOPALA REDDI :—

(a) No.

(b) No.

(c) 1688.

(a) లేదు

(b) లేదు

(c) 1688

Sri S. VEMAYYA :—N. G. Os. కు యిళ్ళు లేనందువల్ల వారు అద్దె యిళ్ళలో వుండవలసి ఉన్నది గదా. అటువంటివారికి house rent allowance ప్రభుత్వమువారు pay చేస్తున్నారా ?

The Hon. Sri B. GOPALA REDDI:— ఎంతమందికి యిళ్ళు కట్టించి యిచ్చారు అని ప్రశ్న. ఇప్పుడు వేసిన supplementary question యీ ప్రశ్నకు సంబంధించదు. కాబట్టి వేరే ప్రశ్న వేయాలి.

Sri PRAGADA KOTAIAH :—అధ్యక్షా ! ఇప్పటికి ఎన్ని యిళ్ళు కట్టించారు ? మద్రాసునుండి యిక్కడికి ఆ ఆఫీసులు తరలిస్తే, యింకా ఎన్ని యిళ్ళు కావలసి వుంటుంది ?

The Hon. Sri B. GOPALA REDDI :—ఎన్ని యిళ్ళు కట్టవలసి వున్నది అనేది వేరే ప్రశ్న. ఎన్ని ఇళ్ళు కట్టించారని అడిగితే, ఆ information యిక్కడ యిప్పుడు నా వద్ద వున్నంతవరకు చెబుతున్నాను.

| | | |
|---|---|---|
| A type | ... | 92 |
| B type | ... | 551 |
| C type | ... | 97 |
| D type | ... | 31 |
| D-1 type | ... | 2 |
| Total | ... | 773 |

ఇవన్నీ occupy చేసుకోబడ్డవి. ఇంకా ఎన్ని అవసరము వుంటుందని అడిగితే అది వేరే విషయము.

Sri A. KALESWARA RAO :—రాజధాని అయిన యీ కర్నూలులో ఎన్ని వందలమంది డేరాలలో వుంటున్నారు ? వారందరికి గృహవసతి ఏర్పాటు చేయుటానికి యింకా యెంతకాలం పడుతుంది ? అందుకు ఎంత డబ్బు ఖర్చు అవుతుంది ?

The Hon. Sri B. GOPALA REDDI :—ఇప్పటికి యింకను డేరాలలో వుంటున్నవారి సంఖ్య 626. ఒకరు గవర్నమెంటువారు provide చేసిన private house లో వుంటున్నారు. గవర్నమెంటువారు houses provide చేస్తే వుంటున్నవారి సంఖ్య 1061. తక్కిన వాటికి వేరే ప్రశ్న వేయాలి.

Sri G. NAGESWARA RAO :—బైటవున్నవారి సంఖ్య ఎంత ?

The Hon. Sri B. GOPALA REDDI :—1061.

Sri PILLALAMARRI VENKATESWARLU:—ఈ 773 యిళ్ళకు ఎంత ఖర్చు అయింది ?

21st July 1955]

The Hon. Sri B. GOPALA REDDI:— శాంక్షను అయిన యిళ్ళ మొత్తం 1061. వాటిలో 773 పూర్తిఅయినవి. మిగిలినవి యీ నెలఆఖరులోనూ, లేక ఆగస్టు 15 వ తేదీలోగానో పూర్తిఅవుతాయి. వీటికి అయిన ఖర్చుమాత్రం యిప్పుడు నాకు జ్ఞాపకములేదు.

Sri PRAGADA KOTAIAH:— అధ్యక్షా, 1061 మందికి వసతి చూపించ లేదన్నారు. అయితే యిందులో హరిజనులు ఎంతమంది ఉన్నారో చెబుతారా?

(No answer)

Sri C. SUBBARAYUDU:— కొంతమంది బైటవున్నారని అన్నారు. ఈ విధంగా వుండేవారు వారంతటవారు స్వేచ్ఛగా బైటవుండాలనే వుద్దేశ్యముతో వున్నారా? లేక యిక్కడ tents లోనూ, కట్టించిన యిళ్ళలోనూ వుండటానికి యిష్టములేక బైటవున్నారా?

The Hon. Sri B. GOPALA REDDI:— బహుశ చాలామంది డేరాలలో వుండడము కష్టమని బైట యిళ్ళు అద్దెకు తీసుకుని వున్నారనుకుంటాను.

*Homes for Juvenile Offenders.*

195.

650 - Q: Sri S. VEMAYYA:—Will the Hon. the Deputy Chief Minister be pleased to state:

(a) whether there are proposals with Government to run homes for juvenile offenders in the State with financial assistance of the Central Government; and

(b) if so, the places where they will be opened?

The Hon. Sri N. SANJEEVA REDDI:—

(a) Yes.

(b) The proposals are under examination.

Sri S. VEMAYYA:—ప్రస్తుతము యీ విషయము యింతవరకు ప్రభుత్వము వారి ఆలోచనలోనే వున్నదని చెప్పారు. ఇప్పుడు మైనర్లుగావున్న నేరస్థులు ఆంధ్ర రాష్ట్రిము నుంచి పోయేవారందరికీ అక్కడక్కడ వసతులు ప్రభుత్వము ఏర్పాటు చేస్తున్నదా?

The Hon. Sri N. SANJEEVA REDDI:— పూర్వము వుంటున్న చోటనే వున్నారు. ఇప్పుడు మాత్రం విశాఖపట్టణంలో ఒక Junior Central Certified School, Central jail ప్రక్కగా వున్న స్థలములో ఏర్పాటు చేయటానికి Inspector-General of Prisons recommend చేశారు. దాన్ని గురించి ప్రభుత్వము ఆలోచిస్తున్నది. త్వరలోనే decision తీసుకుంటాము.

ఇక Senior Certified School విషయములో మాత్రము హిందూపురంవద్ద యిదివరకు vegetable oils తయారుచేయబడ్డ refineries యొక్క buildings

available గా వున్నవి. అవి తీసుకొని వాటిలో పెట్టటానికి I. G. of Prisons recommend చేశారు. కాని అది అంత వసతిగా వుంటుందో లేదో ఆనే అభిప్రాయముతో యింకొక Building ను యేర్పాటు చేయమని I. G. of Prisons కు వ్రాశాము. ఆయనవద్దనుంచి జవాబు రాగానే decision తీసుకుంటాము.

*Loans granted under Land Improvement and Agricultural Loans Acts.*

196.

* 228 – Q: Sri S. VEMAYYA :—Will the Hon. the Minister for Revenue be pleased to state :

the amount of money granted under Land Improvement and Agricultural Loans Acts, in the State to the ryots for 1954 ?

The Hon. Sri K. CHANDRAMOULI :—

An amount of Rs. 1,12,39,523/- was granted under the Land Improvement and Agriculturists' Loans Acts, to the ryots in the State during 1954.

Sri S. VEMAYYA :—1954 వ సంవత్సరములో యీ రెండు యాక్ట్స్ క్రింద allot చేసిన మొత్తము ఎంత ?

The Hon. Sri K. CHANDRAMOULI :—వేరే ప్రశ్న వేయాలి.

Sri B. SANKARAYYA :— Allotted amount లో sanction అయిన మొత్తం ఎంత? అందులో అప్పులకుగాను ఎంత యివ్వబడ్డది ? ఇప్పుడు అప్పులు యివ్వడములో చాలా యిబ్బందులు వుంటున్నవని అన్నారు. అందువల్ల చాలా భాగము నిలచిపోతున్నదని అన్నారు. ఆ విధంగా నిలిచిపోకుండా చూస్తారా ?

The Hon. Sri K. CHANDRAMOULI :—అంతా యిచ్చాము.

Mr. SPEAKER :—The hon. Member does not want the grant but the amount disbursed.

The Hon. Sri K. CHANDRAMOULI :—వ్రాసి పంపించండి.

Sri P. SUNDARAYYA :—మంత్రిగారి సమాధానాన్ని బట్టి, యీ రకంగా ప్రతి ప్రశ్నకు గూడా వ్రాసి పంపించండి అని సమాధానము చెబుతూ వుంటే, యిక మా ప్రశ్నలు ప్రతి ఒక్కటీగూడా వ్రాసి పంపించమంటే, అవి చేటభారతములాగు తయారౌతాయి. ఈ విధంగా ఉంటే, మేము ప్రశ్న వేస్తే, దానికి సమాధానం ఎప్పుడు వస్తుందో తెలియదు. వ్యవసాయ అప్పులు దేనికి ఎంత యిచ్చారు ? ఆ యిచ్చేదాన్ని ప్రభుత్వమువారి అనుమతివున్నదా ? ఉంటే యెంత యిచ్చారు ? ఎవరెవరికి యిచ్చారు ? అన్నీ నా ప్రశ్న. ఇటువంటి చిన్న చిన్న సమాధానాలకొరకు supplementaries

వేస్తే, వాటిని వ్రాసిపంపమనడం అది సరియైన విధానము కాదు. పెద్దపెద్ద సమాధానాలు యివ్వవలసి వుంటే, వాటికి వేరే వ్రాసి పంపమని మంత్రిగారు అడగవచ్చు. అప్పుడు మేము వ్రాసి పంపడం న్యాయమే. కాని యీ చిన్న ప్రశ్నలకుగూడా వ్రాసిపంపమంటే, అది సరియైనది కాదు.

Mr. SPEAKER :—Hon. Member, Mr. Sundarayya wants information whether there is provision for this loan?

Sri P. SUNDARAYYA :— అదికాదు. చాలావరకు ప్రశ్నలకుజవాబులు తెప్పించేటప్పుడు కొంచెము వివరముగానే సమాధానాలు తెప్పిస్తే సభ్యులకు సమాధానాలు చెప్పటానికి వీలవుతుంది. సభ్యులకు సుళువుగాకూడా ఉంటుంది. ఎంతగ్రాంటు చేశామని అడిగితే, ఇంతగ్రాంటు చేశామని చెప్పాలిగాని అడిగిన ప్రతిచిన్న ప్రశ్నకు కాదని చెప్పటం న్యాయంకాదు.

The Hon. Sri K. CHANDRAMOULI :— బొత్తిగా అంకెలు యివ్వవలసిన ప్రశ్నను అడిగితే, సమాధానం చెప్పటంకష్టం. గౌరవ సభ్యుడు ఎంతగ్రాంటు చేశారని అడిగితే, అంతాగ్రాంటు చేశామని చెప్పాను.

Sri N.C. SESHADRI:— అన్ని జిల్లాలకు సమానంగా పంచిపెట్టారా! లేకపోతే population basis మీద పంచిపెట్టారా? లేకపోతే వెనుకబడిన ప్రాంతాలకు, కష్టములువున్న జిల్లాలలో ఎక్కువగా యిచ్చారా?

The Hon. Sri K. CHANDRAMOULI :— అన్ని జిల్లాలకు సమానంగా యివ్వలేదు. వెనుకబడిన జిల్లాలలో, ఎక్కువ కష్టములు వున్న జిల్లాలలో ఎక్కువ మొత్తములు, తక్కువ కష్టములు వున్నచోట తక్కువ మొత్తములు యిచ్చారు.

Sri R. B. RAMAKRISHNA RAJU :— ఈ పన్నెండులక్షలు 1954వ సంవత్సరములో యిచ్చారా? లేకపోతే 1954 సంవత్సరం ఆదినుండి ఆ సంవత్సరము ఆఖరువరకు యిచ్చారా?

The Hon. Sri K. CHANDRAMOULI :— 1954 వ సంవత్సరం మొత్తానికి అయింది.

Sri T. PAPA RAO :— ఈ మొత్తములో శ్రీకాకుళం జిల్లాకు ఎంత మొత్తం యిచ్చారు? ప్రత్యేకించి అగ్రహారాలలోని రైతులకు కూడా యీ లోన్సు యిస్తారా?

The Hon. Sri K. CHANDRAMOULI :— శ్రీకాకుళం జిల్లాకు యిచ్చింది రు. 9,94,405 లు.

Sri V. VISWESWARA RAO :— కృష్ణాజిల్లాలో ఎంత యిచ్చారు? అందులో ఏమైనా అప్లికేషనులు రైతులు పెటితే, provision లేదు అని గాని, joint పట్టాలని గాని, నిరాకరించిన కేసులున్నవా?

The Hon. Sri K. CHANDRAMOULI :— కొన్ని కేసులు వుంటాయి తప్పకుండా. కృష్ణా జిల్లాకు రు: 6,19,579 రూపాయలు యిచ్చారు.

Sri R. B. RAMAKRISHNA RAJU :— అన్ని జిల్లాలకు ఎంతెంతో చెబుతారా ?

The Hon. Sri K. CHANDRAMOULI :—

| | | |
|---|---|---|
| శ్రీకాకుళం | ... | రు 9,91,405 |
| విశాఖపట్టణం | ... | రు 15,05,921 |
| తూర్పుగోదావరి | ... | రు 12,49,900 |
| పశ్చిమగోదావరి | ... | రు 8,96,080 |
| కృష్ణా | ... | రు 6,19,579 |
| గుంటూరు | ... | రు 5,29,110 |
| నెల్లూరు | ... | రు 9,80,410 |
| చిత్తూరు | ... | రు 9,06,230 |
| కడప | ... | రు 14,24,710 |
| కర్నూలు | ... | రు 14,63,625 |
| అనంతపురం | ... | రు 11,69,550 |

Mr. SPEAKER :—The whole information is laid before the House. We shall proceed to the next question.

*Labour School teachers of Cuddapah District.*

197.

* 311 - Q : Sri P. VENKATASUBBAYYA:—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :

(a) Whether the permanent Labour School teachers are paid their increments ; and

(b) if not, the reasons for not sanctioning increments to the Labour School teachers of Cuddapah District ?

The Hon. Sri G. LATCHANNA:—

(a) All eligible permanent teachers are paid their increments.

(b) Eighteen teachers in the Cuddapah District have not been sanctioned increments for the following reasons ;

(1) Nine teachers are overaged and proposals for relaxation of age limit in their favour are awaited from the Director of Social Welfare,

(2) Seven teachers have put in less than one year service and their increments cannot be drawn and

(3) Two teachers do not possess the necessary qualifications and are therefore not entitled to increment. For the

remaining eleven teachers in the District, increments due have been sanctioned.

Sri P. VENKATASUBBAYYA :— Increments రాకుండా labour school teachers కడప జిల్లాలో 12 సంవత్సరములనుంచి కష్టపడుతున్నారు. ఇటీవల కలెక్టరుకు ఒక మెమోరాండము యిస్తూ నాకు కూడా ఒక కాపీ యిచ్చారు. కనుక త్వరలో వారికి increments శాంక్షను అయ్యేటట్టు చేస్తారా ?

The Hon. Sri G. LATCHANNA:— నేను యిచ్చిన సమాధానం పూర్తి వివరాలతో కూడుకొన్నది. 11 మందికి శాంక్షను అయింది. మిగతా ఉపాధ్యాయుల విషయంలో ఆలోచిస్తున్నాము.

Sri G. NAGESWARA RAO :— ఇంచుమించు యీ ఆందోళన అన్ని జిల్లాలలోనూ వున్నట్లు కనబడుతున్నది. అసలు యీ అభ్యంతరాలవల్ల వారికి increments రావని తెలియజేస్తే, కొంతమట్టుకు ఆందోళన తగ్గుతుంది. కాబట్టి, ప్రభుత్వము వారికి ఆ విధంగా తెలియజేస్తుందా ?

The Hon. Sri G. LATCHANNA:— టీచర్లుగా ప్రవేశించినవారికి, వారి సర్వీసు రిజిష్టరు చూస్తే, వారికి తెలుస్తుంది. ఎవరెవరికి రావాలో తెలియజేస్తే పరిశీలిస్తాము.

Sri T. LAKSHMINARAYANA REDDI :— అసలు యీ లేబరు స్కూళ్ళు ఎక్కడెక్కడ వున్నవో చెబుతారా ?

The Hon. Sri G. LATCHANNA :—A separate question may be put.

Sri A. C. SUBBA REDDI :—గవర్నమెంటు హాస్టళ్ళలో కూడా యీ unqualified teachers పనిచేయవలసిన అవసరము ఎందుకు వచ్చింది ?

The Hon. Sri G. LATCHANNA:—ప్రత్యేక ప్రశ్న వేయండి.

Sri V. KURMAYYA :— Age limit అంటే ఎంతో తెలియజేస్తారా ?

The Hon. Sri G. LATCHANNA :—Over aged వారికి, age limit exemption యిచ్చే అవకాశం వున్నదా, లేదా అనే విషయం గురించి Director of Social welfare నుంచి రిపోర్టు అడిగివున్నాము. అదిరాగానే దానిమీద తుది నిర్ణయం చేస్తాము.

Sri B. APPALASWAMY :— లేబరు స్కూళ్ళు గూడా గవర్నమెంటు స్కూళ్ళేగదా ! అందులో పనిచేస్తున్న టీచర్లకు పెన్షను వున్నదా ? అప్పుడు అందరికీ యిస్తారా ?

The Hon. Sri G. LATCHANNA:— స్కూలు టీచర్లకు వున్న రూల్సే, వీరికి గూడా వర్తిస్తాయి.

Sri PRAGADA KOTAIAH :— ఈ స్కూళ్లను నిర్వహించడములో Social Welfare Department వారి పాత్ర యేమిటి ? Education Department వారి పాత్ర యేమిటి ?

[21st July 1955

The Hon. Sri G. LATCHANNA :— ఈ స్కూళ్ళు డైరెక్టుగా Social Welfare Department వారి ఆధీనములో వుంచబడి వాటి వ్యవహారాలన్నీ చూడబడుతాయి.

The Hon. Sri B. GOPALA REDDI :— అయితే supervision మాత్రమే Education Department వారిది.

Sri C. SUBBARAYUDU :— Labour School Teacher యొక్క scale of pay ఎంత? District Board and other Municipal School teachers తో సమానంగా వీరి జీతాలు కూడా వుంటాయా? ఉండకపోతే, తేడా ఎంత?

The Hon. Sri G. LATCHANNA:— వేరే ప్రశ్న వేయండి.

Sri D. KONDAYYA CHOWDARY :— Over aged teachers చాలా మంది వున్నారని చెబుతున్నారు. అంతమంది వుంటూంటే, వారిని తీసివేసి unemployed qualified hands, అంటే Secondary Grade trained teachers ను ఎందుకు వేయకూడదు?

The Hon. Sri G. LATCHANNA:— ప్రత్యేక ప్రశ్న వేయండి.

Sri P. BAPAYYA :—ఇన్ని లేబరు స్కూళ్ళు ప్రత్యేకంగా వున్నప్పుడు కులతత్వాలను పాటించినట్లు అవుతున్నదిగదా! ఇకమీదట యివన్నీ abolish చేయటానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుందా?

The Hon. Sri G. LATCHANNA :— ఈ కులతత్వాలు, వర్గతత్వాలు ఆనేవి కూడదు అనే పద్ధతిపైననే విద్యాబోధన జరుగుతున్నది.

Sri S. VEMAYYA:—ఇంతకు పూర్వము Welfare Department అని అంటూవచ్చారు. ఇప్పుడు దానిని Social Welfare Department అని అంటున్నారు. ఈ మార్పును జి.ఓ. మూలంగా చేశారా? అది ఎట్లామార్పుచేశారో చెబుతారా?

The Hon. Sri B. GOPALA REDDI :—వేరే జి. ఓ. ప్యాసుచేశాము. దానికి వేరే ప్రశ్న వస్తుంది జవాబు తరువాత యిస్తాము.

*Opening of Rural Co-operative Banks.*

198.

* 723- Q : Sri PRAGADA KOTAIAH : Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state whether Rural Co-operative Banks on limited liability basis have been opened and if so, the places at which they were started and their functions ?

The Hon. Sri D. SANJIVAYYA:— Co-operative Rural Banks on limited liablity have been registered in the following places.

| | | |
|---|---|---|
| 1. | Annadevarapeta | West Godavari District. |
| 2. | Palacoderu | do. |
| 3. | Pasivedala | do. |
| 4. | Jaggampeta | East Godavari District. |
| 5. | Alamur | do. |
| 6. | Manikonda | Krishna District. |
| 7. | Tadikonda | Guntur District. |
| 8. | Alluru | Nellore District. |

The objects of the Banks are :

[a] To promote thrift, tap and mobilise rural savings and to borrow funds from members or others to be utilised for giving loans to members for useful or productive purposes;

[b] to spread knowledge of banking and to foster and develop banking habits and practices among the rural classes, and to carry on such general business of banking as is not repugnant to the provisions of the Co-operative Societies Act and the Rules framed thereunder as may be approved by the Registrar:

[c] to procure and supply seed, fertilisers and other agricultural requirements for sale or distribution to members,

[d] to own or rent godowns to facilitate the grant of loans to members against produce ;

[e] to arrange for the grading, marketing and sale of agricultural produce of members to the best advantage;

[f] to purchase and own or hire to members, implements, machinery etc., in connection with the development of land, agricultural production, processing etc.

[g] to disseminate knowledge of the latest improvements in agriculture;

[h] to promote co-operative consciousness and knowledge among members by running a reading room and a library, by organising study cricles and periodical meetings and by the distribution of leaflets, etc.

[i] generally to encourage self-help, mutual aid and co-operation among members; and

[j] to undertake such other activities as may be conductive to the promotion of the economic interests of members and incidental to the attainment of the above objects.

Sri PRAGADA KOTAIAH :—అధ్యక్షా! ఈ బ్యాంకును ఒకే గ్రామానికి నిర్మాణము చేస్తారా? లేదా ఒక ఫిర్కాకా, లేదా ఫిర్కాల్లో సగమునకు ఈ బ్యాంకు నిర్మాణము చేస్తారా? మీరు ముందు ఎంత వాటా ధనముపెట్టి ఈ బ్యాంకును నిర్మాణము చేస్తారు?

The Hon. Sri D. SANJIVAYYA :—ఈ బ్యాంకులను ఏర్పాటుచేయడానికి 3 లేక 4 మైళ్ళ రేడియస్ లోపలవున్నటువంటి గ్రామాలను చేర్చుకుంటారు. మూలధనము 50 వేలు వుండాలి.

Sri P. SREERAMULU :—ఈ వాటా ధనము ప్రజలు ఎంత వసూలు చేయాలి. ప్రభుత్వము ఎంత వాటా ధనము యిస్తారు?

The Hon. Sri D. SANJIVAYYA :—ప్రభుత్వము ఏమీ వాటా ధనము యివ్వదు. ప్రజలే యివ్వాలి.

Sri S. NARAYANAPPA :— రూరలు బ్యాంకు ప్రభుత్వంవారు నేరుగా ఏర్పాటుచేస్తున్నారా? లేక ప్రజలనుంచి ధరఖాస్తులు వస్తే ఏర్పాటు చేస్తారా? వివరాలు తెలపగలరా?

The Hon. Sri D. SANJIVAYYA :— సహకార సంఘాలు స్థాపించేటప్పుడు ప్రజలుకూడా కోరుతుంటారు. ప్రభుత్వోద్యోగులు కూడా అక్కడకు వెళ్ళి, ఇటువంటి ప్రణాళికలు వున్నాయి, మీకు లాభకరంగా వుంటుంది, ఇటువంటివి ఏర్పాటు చేసుకోండి అని చెబుతుంటారు. ఆ ఉద్యోగుల సహాయము చేతను ప్రజలయొక్క సహాయముచేతను ఇవన్నీ దేశంలో వుత్సాహ వంతంగా ఏర్పాటుచేస్తారు.

Sri M. NAGESWARA RAO :— అధ్యక్షా! ఇప్పుడు ఏ ఏ గ్రామాల్లో ఈ రూరలు బ్యాంకులు తెరిచారు. మంత్రిగారు రూరలు బ్యాంకులు తెరిచిన గ్రామాలు కొన్ని లిస్టు యిచ్చారు. ఇంకా మిగతా గ్రామాలకు ఎందుకు ఈ బ్యాంకులను తెరవరు?

The Hon. Sri D. SANJIVAYYA :—అన్నింటిలోను తెరిచారు.

Sri RAJARAM :—ఈ రూరలు బ్యాంకులను హరిజనులకుకూడా యిస్తారా?

The Hon. Sri D. SANJIVAYYA :— వారికి ఒక్కరికే కాదు, అన్ని తెగలవారికి, అన్ని జాతులవారికి అన్ని వర్గాల వారికి, అన్ని మతాలవారికి, అన్ని రాజకీయ వాదులకు యిస్తాము. సహకారోద్యమములో ఇటువంటి అభ్యంతరము లేదు.

Sri V. VESWESWARA RAO :— 50 వేల రూపాయలు ఈ రూరలు బ్యాంకులు ఆర్గనైజు చేయడానికి కావాలని మంత్రిగారు చెప్పారు. ఆ మొత్తమును

గ్రామాల్లో వసూలు చేయడము కష్టమని ప్రభుత్వానికి ఏమైనా నివేదికలు వచ్చాయా ? బ్యాంకులు 3 మైళ్ళ రేడియస్‌లో ఉన్న గ్రామాలకు పెట్టాలని చెబుతున్నారు. అనుభవములో 2, 3వూళ్లు కలిసివుంటే, విడిపోవాలని ప్రత్యేకించి పిటీషన్లలో అనేకము వచ్చే సందర్భంలో ఈ రూరలు బ్యాంకులు 2, 3 మైళ్ల రేడియస్‌లోగల గ్రామాలకు పెట్టాలని చెప్పడమువల్ల ఇబ్బందులుండవా ? దాని ఫలితాలు ఎట్లా వుంటాయి ?

The Hon. Sri D. SANJIVAYYA :— అటువంటి విషయములు నా నోటీసులోకి రాలేదు. వస్తే విచారిస్తాను.

Sri R. B. RAMAKRISHNA RAJU :— 50 వేలకు తగ్గితే బ్యాంకు తెరుస్తారా ?

The Hon. Sri D. SANJIVAYYA :— ఆ ప్రాంతాన్ని బట్టి అక్కడ వుండేటటువంటి రైతుల ఆర్థిక స్తోమతును బట్టి తగ్గించవలసివస్తే తగ్గిస్తాము.

Sri C. SUBBARAYUDU :—ఇప్పుడు అర్బనుబ్యాంకు వుండేచోట, town bank వుండేచోట 3, 4 మైళ్ళ రేడియస్‌లో ఈ బ్యాంకులు పెట్టడానికి వీల్లేదు అని కో-ఆపరేటివుశాఖవారు చెబుతున్నారు. అటువంటప్పుడు town banks గాని, urban banks గాని ఈ రూరలు బ్యాంకులు చేసినపని అంతా కూడా చేస్తాయా ? లేకపోతే ప్రత్యేకంగా రూరలు బ్యాంకులను పెట్టడానికి అవకాశము కలుగజేస్తారా ?

The Hon. Sri D. SANJIVAYYA :– Town banks కు ఈ రూరలు బ్యాంకుల పని అప్పగించడము బాగుండదు. అవసరమైతే రూరలు బ్యాంకులను పెట్టడానికి ప్రయత్నము చేస్తాము.

Sri P. VENKATASUBBAYYA :- ఈ రూరలు బ్యాంకులు వున్నచోట గోడౌన్సు అవసర మనుకుంటాను. కేంద్రప్రభుత్వము ఏదైనా డబ్బు సహాయము చేస్తుందా ?

The Hon. Sri D.SANJIVAYYA:— నూతనంగా warehousing fund అని వారు కాన్‌స్టిట్యూట్ చేసినారు. అందులోనుండి కొంత ధన సహాయము తీసుకొని ఈ గోడౌనులు కట్టుకోవచ్చును.

Sri P. BAPAYYA :- మెట్టతాలూకాల్లో 3, 4 మైళ్ళ పరిధిలో 2, 3 గ్రామాలకంటే ఎక్కువ వుండవు. అటువంటి సమయంలో 50 వేలు షేర్ కాపిటలు వసూలు చేయడము చాలా కష్టము కాబట్టి మెట్టతాలూకాలో ఏరియా ఏమైనా పెంచుతారా ?

The Hon. Sri D. SANJIVAYYA :- పరిస్థితులను బట్టి చూస్తాము. Each case will be decided on its merits.

Sri R. B. RAMAKRISHNA RAJU :- ఈ బ్యాంకులను పాత జమీందారీ ఏరియాల్లో పెట్టడానికి అభ్యంతరములు ఏమైనా వున్నాయా ?

The Hon. Sri D. SANJIVAYYA :- అలాంటి అభ్యంతరాలు లేవు.

Sri PILLALAMARRI VENKATESWARLU :— మొత్తం 50 వేలు షేర్ కాపిటలు వుంటేగాని బ్యాంకు పెట్టడానికి వీలు లేదు అని చెప్పారు. మెట్ట ప్రాంతాల్లో గ్రామాలు దూరదూరంగా వుంటాయి కాబట్టి గ్రామానికి ఇంత ప్రపోర్షను అని నిర్ణయించి ప్రభుత్వము దాని ప్రకారము ఏర్పాటు చేయడానికి పూనుకుంటుందా?

The Hon. Sri D. SANJIVAYYA :- ఇంతవరకు అటువంటిది ఏమీ జరగలేదు. ఇకముందు కూడా ఏమీ జరగదనుకొంటున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU :—ఒక గ్రామానికి చుట్టుప్రక్కలలో ఏ గ్రామం లేదు కాబట్టి 50 వేల రూపాయలు షేర్ కాపిటల్ వస్తేనే బ్యాంకు పెట్టుతాము అంటారా లేక ఒకే గ్రామం వున్నది కాబట్టి దానిని ఏమైనా తగ్గిస్తారా ?

The Hon. Sri D. SANJIVAYYA :—ఇందాక రాజుగారు అడిగిన ప్రశ్నకు సమాధానము చెప్పాను. తప్పనిసరిగా రిజిష్టరు చేయడానికి తప్పకుండా ఆలోచిస్తాము. అక్కడ వున్నటువంటి రైతులయొక్క ఆర్థిక స్తోమతనుబట్టి కొంతవరకు తగ్గించడానికి కూడా ప్రయత్నం చేస్తాము.

Sri D. GOPALA RAO :—Did the Government receive any report about the working of these banks, and are the Government aware that manures are not supplied in time to these banks ?

The Hon. Sri D. SANJIVAYYA :—ఇవి కొత్తగా ఏర్పాటు చేయబడినవి. అలమూరు, పసివేదల గ్రామాల్లో బ్యాంకులు పూర్వమునుంచి వున్నవి. పని సక్రమంగా జరుగుతున్నది వాటిని గురించి రిపోర్టులు అడిగాము. ఇతర బ్యాంకులగురించి రిపోర్టు రాలేదు. ఈ మెన్యూర్సు సక్రమంగా సకాలంలో రాకుండా వుండేటట్లయితే విచారిస్తాము.

Sri PRAGADA KOTAIAH :— ఈ బ్యాంకుల ఆశయాలు చాలా వున్నతంగా వున్నవి. బ్యాంకును నిర్వహించడానికి, కావలసిన ప్రత్యేక సౌకర్యాలు కలిగించడానికి రిజర్వుబ్యాంకు ప్రత్యేకంగా ఏమైనా కేటాయించిందా? లేదా ? సెంట్రల్ బ్యాంకు ప్రత్యేకంగా సహకరిస్తోందా ?

The Hon. Sri D. SANJIVAYYA :—సెంట్రలు బ్యాంకులు అంతా సహకరిస్తాయి. రిజర్వు బ్యాంకులు కూడా యివ్వడానికి అవకాశం వుంది. Government of India కొంతవరకు యివ్వడానికి అవకాశం వున్నది.

Sri R. B. RAMAKRISHNA RAJU :— షేరుధనం ఇంత హెచ్చుగా పెట్టడానికి కారణాలు ఏమిటి? ఏ బ్యాంకులో అయినా, ఏ గ్రామంలో అయినా వారు ఎంత ధనం సంపాదిస్తే అంత పని చేయడానికి ఏమీ అభ్యంతరం లేదు.

The Hon. Sri D. SANJIVAYYA :— అది బ్యాంకు సిద్ధాంతాలకు వ్యతిరేకంగా వుంటుందేమో ?

Sri P. SURYANARAYANA :— అధ్యక్షా! మా శ్రీకాకుళంలో ఇదివరకు శ్రీ సాయిబాబా మార్కెటింగు కో-ఆపరేటివు స్టోర్సు అనేది వుండేది. అది యిప్పుడు లేదు. ఇప్పుడు శ్రీకాకుళంలో బ్యాంకు పెట్టడానికి ఏమైనా ఆలోచిస్తున్నారా? 50 వేల రూపాయలు ఇస్తే నేగాని పెట్టడానికి వీల్లేదు అని తీసివేస్తారా?

The Hon. Sri D. SANJIVAYYA :— అన్ని జిల్లాలను గురించి ఆలోచిస్తున్నాము. ఒక శ్రీకాకుళం సంగతే కాదు. అక్కడ వున్న స్టోర్సు పోతే, అక్కడ వున్నటువంటి ప్రజలు అంతా కోరితే రూరలు బ్యాంకు మేము తప్పకుండా పెడతాము.

Sri PRAGADA KOTAIAH :— అధ్యక్షా! ఇప్పుడు పెట్టినటువంటి బ్యాంకులకు జిల్లా సహకార సంఘాలు ఏమాత్రం యిచ్చినాయి. రిజర్వు బ్యాంకు ఏమాత్రము సొమ్ము కేటాయించింది చెప్పగలరా?

The Hon. Sri D. SANJIVAYYA :— ప్రత్యేక ప్రశ్న వేస్తే అన్ని విషయాలు సవిస్తరంగా చెబుతాను.

Sri V. VISWESWARA RAO :- రూరలు బ్యాంకులు షేరు కాపిటలుకు 8 రెట్లు మాత్రమే అప్పు యివ్వడానికి అవకాశం వుందని ఒక బైలావుంది. ఇప్పుడు క్రెడిట్ సొసైటీలలో 10 రెట్లు ఇవ్వడానికి అవకాశం వుందని తెలుస్తోంది. ఈ రూరలు బ్యాంకులలోకూడా 10 రెట్లవరకు పెంచడానికి అవకాశములు ఏవైనా వున్నాయా? ఆ బైలాను మార్చడానికి ఏమైనా ప్రయత్నం చేస్తారా?

The Hon. Sri D. SANJIVAYYA :- ప్రయత్నం చేస్తాము.

Sri A. KALESWARA RAO :- ఈ కో-ఆపరేటివు సొసైటీలన్ని, కో-ఆపరేటివు బ్యాంకులు రైతాంగానికి మాత్రమే ఉపయోగపడతున్నాయి. బస్తీలలోను పల్లెటూళ్ళలోను వున్న కార్మికులకు వాటివుపయోగము కలిగేట్లు ఏవైనా రూల్సు చేస్తారా?

The Hon. Sri D. SANJIVAYYA :-కార్మికులకు ప్రత్యేకమైన సొసైటీలు పెట్టుతాము.

*Finances of the District Boards.*

199.

* 406 - Q: Sri P. RANGA REDDI :- Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state :

(a) whether any Special Officer has been appointed to enquire into the finances of the District Boards; and

(b) whether any report has been submitted by the Special Officer, and if so, what is the financial position of the respective District Boards in this State?

The Hon. Sri A. B. NAGESWARA RAO :-

(a) Yes.

(b) A statement [a] is laid on the table of the House.

"The report has brought to light that the main caus that led most of the district boards to the present state of financial breakdown is due to their taking on commitments without least regard to their resources. With the exception of Srikakulam, East Godavari and Krishna, all the district boards became deficit."

Sri P. RANGA REDDI :— ఈ బల్లమీద పెట్టబడిన statement ప్రకారము చాలా జిల్లా బోర్డులలో లోటు కన్పిస్తున్నది. ఈ లోటు రావడానికి ఏమైన కారణము ఉన్నదని Special Officer గారు చెప్పినారా ? ఆ లోటును పూడ్చడానికి ఫలానా విధముగా చేసిన బాగుండునని సలహాలేమైనా యిచ్చినారా? దానిమీద ప్రభుత్వము ఏమిచర్య తీసుకొన్నది ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :— లోట్లు రావడానికి కారణము ఆదాయమునకు మించిన ఖర్చులు చేయడమువల్ల. Land cess increase చేయాలని ; తరువాత motor taxation, secondary education కు గ్రాంట్సు యివ్వవలసినదని సూచనలు ఉన్నవి. ఇందులో grants విషయం ప్రభుత్వం ప్రత్యేకముగా ఆలోచిస్తుంది. తరువాత యీ జిల్లా బోర్డులకు loss of income due to motor tax గురించి toll compensation గురించి ప్రభుత్వము ఆలోచిస్తుంది. Secondary education కు grants యివ్వడానికి ఆర్థిక స్తోమతు ప్రభుత్వానికి లేదు గనుక యివ్వడానికి సావకాశము లేదు. Stamp duty ఇదివరకు కంటే increase చేశారు. (4% నుంచి 5% కు) అందులో 100 కి 40 వంతులు జిల్లాబోర్డులకు యివ్వడానికి ఏర్పాట్లు చేయడానికి ప్రభుత్వంఆలోచిస్తున్నది.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—గుంటూరు జిల్లా surplus జిల్లాగా ఉన్నా పన్నులు తగ్గించామనడానికి కారణము ఏమిటండీ ?

Mr. SPEAKER :—గుంటూరు లోటు జిల్లా.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—Accounts లో ఎట్లా ఉన్నవో నాకు తెలియదు. Receipts నూ, expenditure ను లెక్క వేస్తే Guntur లో surplus కన్పడుతున్నది. అందువల్ల నేను అడుగుచున్నాను. లెక్కలలో పొరపాటు ఉంటే చెప్పవలెను.

---

[a] Vide appendix at page 124 infra.

21st July 1955]

The Hon. Sri A. B. NAGESWARA RAO :—అదివరకు ఎక్కువగా draw చేయడము మూలమునే deficit కనపడుచున్నది.

Sri A. C. SUBBA REDDI :— Secondary education కు grants యివ్వమని Special Officers recommend చేసినట్లు Minister గారు చెప్పారు. District Boards కు ⅓ గ్రాంటు private agencies ½ గ్రాంటు యిస్తున్నారు. District Boardకు కూడా ½ యిచ్చేట్లు ప్రభుత్వం ఏర్పాటుచేస్తుందా?

The Hon. Sri A. B. NAGESWARA RAO :— ఇదివరకు ఇస్తూన్నవి అలాగే యిస్తూ ఉంటారు. కాని క్రొత్తగా యిచ్చేందుకు ప్రభుత్వానికి ఆర్థిక స్తోమతు లేదు. కనుక యివ్వడానికి వీలులేదు.

Sri A. C. SUBBA REDDI :— ఇదివరకు ఎప్పుడు కూడా ½ grants Local Boardsకు యివ్వలేదు. అందువల్ల యిస్తున్నవారికి యిస్తున్నాము అని చెప్పటకు వీలులేదు. ⅓ గ్రాంటు local boards యిస్తున్నారు కాబట్టి ½ గ్రాంటు ఎందుకు యివ్వకూడదు అని గవర్నమెంటును అడుగుచున్నాను.

The Hon. Sri A. B. NAGESWARA RAO :— నాకు తెలిసినంత వరకు మ్యునిసిపాలిటీకి 50% grant యిస్తున్నారు.

Sri S. K. V. KRISHNAVATHARAM :— చాలా జిల్లాబోర్డులలో ఆదాయముకంటే ఖర్చు ఎక్కువ అవుతోంది. అందువల్ల deficit వస్తుందంటున్నారు. ఆ రిపోర్టునుబట్టి జిల్లాబోర్డులు ఏమైనా దుర్వినియోగము చేసినవా? దానిని గురించి జవాబుదారి అయినవారిమీద చర్యలు తీసుకున్నారా.

The Hon. Sri A. B. NAGESWARA RAO :— ప్రత్యేకముగా యీ జిల్లాబోర్డుల విషయములో వేరే ప్రశ్న వేస్తే దానికి సమాధానము చెబుతాను.

Sri P. RANGA REDDI :- ఆవిధముగా దుర్వినియోగము చేసినటువంటి జిల్లాబోర్డుల విషయము ప్రశ్న వేస్తే చెబుతామన్నారు. అందుచేత కనీసము కొన్ని జిల్లా బోర్డులలో దుర్వినియోగము జరుగుచున్నదని మంత్రిగారు ఒప్పుకొంటున్నారా?

The Hon. Sri A. B. NAGESWARA RAO :- దుర్వినియోగము జరిగిందని నేను ఒప్పుకోను. కాని ప్రత్యేకముగా ఎందుకు ఖర్చులు ఎక్కువైనవో ఒక జిల్లాబోర్డును గురించి ప్రశ్న వేస్తే తప్పకుండా సమాధానము చెప్పెదను.

Sri M. R. APPA RAO :- ఇప్పుడు కొన్ని జిల్లాబోర్డులలో deficit అని చెప్పుచున్నారు. కారు కొనడము పెట్రోలు కొనడమువల్ల deficit వచ్చింది అంటారా? ఇంకా వేరే కారణం ఉన్నదంటారా.

The Hon. Sri A. B. NAGESWARA RAO :- మొదట సెలవిచ్చాను. జిల్లాబోర్డు పేరుపెట్టి వేరే ప్రశ్న వేస్తే కారణములన్ని విపులముగా చెప్పెదను.

Sri S. K. V. KRISHNAVATHARAM :— పశ్చిమగోదావరి జిల్లా బోర్డులో అట్లాంటి దుర్వినియోగము జరిగినట్లు ప్రభుత్వము దృష్టికి వచ్చింది. దానిమీద ఏమైన చర్య జరిగిందా?

The Hon. Sri A. B. NAGESWARA RAO :— దుర్వినియోగం అన్న మాట నేను చెప్పను. లోటు ఎందుకు వచ్చింది వేరే ప్రశ్న వేస్తే సమాధానము చెప్పెదను.

Sri R. B. RAMAKRISHNA RAJU :—ఆదాయము కంటె ఖర్చు ఎక్కువ అయినప్పుడు deficit వస్తుంది వాస్తవమే. కాని ఎక్కువ ఖర్చుకు మొత్తము ఎక్కడనుండి వచ్చింది.

The Hon. Sri A. B. NAGESWARA RAO:–Treasury account లోనుంచి over draw చేయటమువల్ల.

Sri M. BAPAYYA CHOWDARY :— అధ్యక్షా ! Special Officer గారు యిచ్చిన రిపోర్టులో కొందరు ఉద్యోగస్తులను తగ్గించమని ఏమైనా సలహా యిచ్చారా ?

Mr. SPEAKER :—The question is whether there is a recommendation for retrenchment.

The Hon. Sri A. B. NAGESWARA RAO :— I request the member to put a separate question.

Sri M. BAPPAYYA CHOWDARY :—దుర్వినియోగము లేకుండా సన్మార్గముగా జరిపించుటకు ఉద్యోగస్తులపైన ఏమైనా చర్య తీసుకొనమని రిపోర్టులో వ్రాశారా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :—నే నిదివరకే సెల విచ్చాను. దుర్వినియోగము అంటే నేను ఒప్పుకోవడము లేదు.

Sri PRAGADA KOTAIAH:–చాలా జిల్లాబోర్డులు deficit budgetలో ఉన్నవి. అందువల్ల పనులు నిలిపివేయమని ఉత్తరువులు జారీ చేసినారా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :—ఆ విధముగా ఉత్తరువులు జారీ చేశాము. Audit departmentను expenditure విషయములో కొంత check చేయమని కూడా ఉత్తరువు పంపించాము.

Sri C. SUBBARAYUDU :—Deficit Budget లో చాలా జిల్లా బోర్డులు ఉండుటచేత Secondary Schools ఉపాధ్యాయుల సంఖ్యను పెంచుట లేదు. అనంతపురం జిల్లాలో విద్యార్థుల సంఖ్యకు ఉపాధ్యాయుల సంఖ్యకు చాలా తేడా ఉంది. అందుకు చర్యలు తీసుకుంటారా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :— అవన్నీ ఆలోచిస్తాం.

Sri A. BAPINEEDU :— అధ్యక్షా ! పశ్చిమగోదావరి జిల్లాబోర్డును గురించి గత ప్రభుత్వకాలంలో దుర్వినియోగముజరిగినట్లు పిటీషనులు వచ్చినవి. వాటిమీద action ఏమైనా తీసుకున్నారా ? లేక తీసుకోడానికి ప్రయత్నము చేస్తారా ?

21st July 1955]

The Hon. Sri A. B. NAGESWARA RAO :— ఈ ప్రభుత్వము వచ్చిన తర్వాత petitions రాలేదు, పిటీషన్‌లు వస్తే ఆలోచిస్తాము.

Sri R. B. RAMA KRISHNA RAJU :— Treasury account లో over draw చేయడానికి గవర్నమెంటు ఏమైన అధికారము యిచ్చినారా? లేక ఎవరికివారే over draw చేయవచ్చునా?

The Hon. Sri A. B. NAGESWARA RAO :— District Board Presidents ఖర్చు కోసము డబ్బు over draw చేయుటకు వచ్చినప్పుడు Treasury Deputy Collector చూడకుండా డబ్బు యివ్వటము జరిగినది. తెలుసుకున్న తర్వాత stop అయినది.

Sri PILLALAMARRI VENKATESWARLU :— ఈ రిపోర్టును గాని లేక కొన్ని ముఖ్యమైన recommendations ను సభ్యులకు ఈ బడ్జెటు సెషన్ పూర్తిఅయ్యే లోగా యిచ్చుటకు ప్రయత్నం చేస్తారా?

The Hon. Sri. A. B. NAGESWARA RAO :- ఈ బడ్జెటు సమావేశము అయ్యేలోపుగా పూర్తి అవునో కాదో తెలియదు. కాని సభ్యులకు యివ్వవలెనని ఆలోచిస్తున్నాము.

Sri P. RAMACHARLU :- Deficit గా ఉన్న జిల్లా బోర్డులలో school teachers ను establishment ను తగ్గించడమువల్ల budget సరిగా ఉండేటట్లు చేస్తారా? లేక వరుమానం కొద్దిగాపెంచి establishmentను తగ్గించకుండా చేస్తారా? ఏది ప్రభుత్వ policy?

The Hon. Sri A. B. NAGESWARA RAO :- కొన్ని జిల్లాబోర్డులకు కొన్ని సూచనలు, మరికొన్ని జిల్లాబోర్డులకు మరికొన్ని సూచనలు చేయబడ్డవి. ఏ జిల్లా బోర్డుకో ప్రత్యేకముగా ప్రశ్న వేస్తే సమాధానము వస్తుంది.

Sri M. HARICHANDRA PRASAD :- పశ్చిమగోదావరి జిల్లాబోర్డుకు వరదల వల్ల వచ్చిన నష్టానికి grant యివ్వమని కోరారు. దానికి ప్రభుత్వము grant యిచ్చినదా?

Mr. SPEAKER : That is a separate question.

The Hon. Sri A. B. NAGESWARA RAO :— I will answer the question. 1 లక్ష 30 వేల రూపాయలు grant కోరారు. 30 వేలు advance క్రిందయిచ్చాము. 48 వేలదాకా sanction చేయబడింది. తక్కినదాని విషయం ఆలోచించ బడుతుంది.

Sri S. BRAHMAYYA :— జిల్లాబోర్డులో ద్రవ్యాపహరణ, దుర్వినియోగంజరిగి ఏండ్లుపూండ్లు అయినదికదా. మీకు పిటిషన్లు వచ్చాయా? Enquiry ఎప్పుడు చేస్తారు? Action తీసుకోవడానికి అవకాశంవుంటుందా?

The Hon. Sri A. B. NAGESWARA RAO :— దుర్వినియోగం అయినదని నేను ఒప్పుకోడం లేదు. పిటీషన్లు రాలేదని అంటున్నాను, వస్తే విచారిస్తాము.

*District Boards in deficit Budget in the State.*

200.

*142–Q :–Sri S. VEMAYYA :—Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state :

[a] the names of District Boards in deficit Budget in the State now ; and

[b] the reasons for the deficit ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :—

[a] A statement showing the financial position of District Boards has been placed on the table of the House in answer to clause [b] of Legislative Assembly Question 406 [Starred].

[b] The report of Sri Vasudevan, Special Officer appointed to investigate into the financial condition of District Boards has brought to light that the main cause that led most of the District Boards to the present state of financial breakdown is due to their taking on commitments without least regard to the obligations imposed on them by law.

Sri S. VEMAYYA :—జిల్లా బోర్డులు ప్రభుత్వముయొక్క సలహాలు తీసుకొని ఖర్చుచేయాలి కాబట్టి పర్మిషను లేకుండా ఖర్చుచేసిన జిల్లాబోర్డు ప్రెసిడెంట్లు, మెంబర్లమీద ప్రభుత్వం చర్య తీసుకోడానికి ఒప్పుకుంటుందా ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :— వరమిలా ప్రభుత్వం పర్మిషను ఇచ్చింది. ముందు overdraw చేయడం జరిగింది.

*James' Report.*

201.

*150—Q : Sri S. VEMAYYA : Will the the Hon. the Chief Minister be pleased to state :

[a] Whether the Government have implemented the recommendations of the "James' Report" regarding the services of the officers recruited from mofussil to Secretariat Service ; and

[b] If so, how far ?

The Hon. Sri B. GOPALA REDDI:— [a] and ]b] :

In the cases of persons drafted into the Secretariat from the District and Regional Offices, the recommendation

made in Sri James' Report was that they might be allowed to count 50% of their mofussil service in the particular category for purpose of seniority in the corresponding category in the Secretariat Service. This recommendation was accepted by the Government in full and the departments of the Secretariat are implementing it. This weightage will apply only to persons recruited to the Secretariat during the period from 1-10-1953 to 31-3-1954, that is, immediately after the partition.

Sri S. VEMAYYA :— జేమ్సుగారి రిపోర్టులో 50% ను మాత్రం వారి సర్వీసును తీసుకోడానికి అంగీకరించినట్లు తెలుస్తోంది ; పూర్తి సర్వీసును secretariat service లో సమానంగా చేయడానికి ప్రభుత్వానికి ఏమైనా ఇబ్బంది వున్నదా ?

The Hon. Sri B. GOPALA REDDI :— వారు చెప్పిన రిపోర్టు మేము ఒప్పుకున్నాం. వారు చెప్పింది 50% మాత్రమే.

Sri N. C. SESHADRI:— 31-3-54 పూర్వం వచ్చినవారికి అమలుచేసాము అన్నారు. 31-3-54 నుంచి 31-3 55 వరకు కూడా కొంతమందిని mofussil నుంచి recruit చేసారు. వాళ్ళకు ఈ recommendations ఎందుకు apply చేయలేదు ?

The Hon. Sri B. GOPALA REDDI :— ఇది ఎప్పటికి శాశ్వతంగా వుండే నిబంధన కాదు. Partition అయినందువల్ల Secretariat లో ఎక్కువ మంది కావలసివచ్చింది. జిల్లాలలో కలెక్టరు ఆఫీసులనుంచి మిగతా చోట్లనుంచి తీసుకువచ్చారు. ఈ జేమ్సు రిపోర్టు వాళ్ళకోసము ఉద్దేశించబడింది.

Sri N. C. SESHADRI:— ఈ రెండు batches ఒకే విధమైన సర్వీసు నుంచి recruit చేసారు కొబట్టి రెండవ batch వారికి ఆ అవకాశం ఇవ్వకపోవడం discrimination కాదా ?

The Hon. Sri B. GOPALA REDDI :— Discrimination కాదని అభిప్రాయపడుతున్నాను.

Sri PRAGADA KOTAIAH :— అధ్యక్షా ! మన సెక్రటేరియటులో తెలుగురానివా రెందరో వున్నారు. ఈ విషయాన్ని గురించి ఆలోచిస్తున్నాం అని చెప్పారు ముఖ్యమంత్రిగారు. అలాంటివారిని తొలగించే విషయంలో కమిటీవారేమైనా చెప్పారా ?

The Hon. Sri B. GOPALA REDDI :— రెండు సంవత్సరాల లోపుగా ఒక నిర్ణయం చేసి వాళ్ళను allotted officers గా చేసుకోవడమో వారిని పంపించడమో అనేది వున్నది. అటువంటి వారిని సెప్టెంబరులోపుగా తిరిగి పంపిస్తాము.

Sri S. VEMAYYA :— ఇప్పుడు జిల్లాలనుంచి తీసుకున్న ఉద్యోగులు Secretariat లో వుండే ఉద్యోగాలకన్న తీసిపోతున్నారని ప్రభుత్వంయొక్క ఉద్దేశమా ?

The Hon. Sri B. GOPALA REDDI :— Recruitments లో ఒక్కొక్క ఉద్దేశంకోసం, ఒక recruitment వుంటుంది. వారికి ఇచ్చే training departmental test దీనికి సంబంధించి వుంటాయి. సాధ్యమైనంతవరకు Secretariat must be self sufficient. అపుడు అత్యవసర పరిస్థితులను బట్టి జిల్లా ఆఫీసులనుంచి కొంతమందిని తీసుకున్నాను. వాళ్ళను సగం weightage మాత్రం ఇచ్చాము.

Sri PILLALAMARRI VENKATESWARLU :- 1954 సంవత్సరం అనంతరంకూడా తీసుకున్నట్లు తెలుస్తోంది. వారిని ప్రత్యేకంగా mofussil నుంచి తీసుకున్నపుడు వారికికూడా ఈ సదుపాయం కలుగచేయవలసిన అవసరం లేదా ?

The Hon. Sri B. GOPALA REDDI :— మొదట తీసుకున్న వాళ్ళను గురించే సెక్రటేరియటులో కొంత అలజడి జరిగింది. ఎందుకంటే వాళ్ళ seniority పోతుంది. ఎక్కడనుంచియో, శ్రీకాకుళంనుంచో కడపనుంచో వచ్చి Secratariat లోనివారికి ప్రమోషను లేకుండా చేయడంవల్ల చాలా అలజడి జరిగింది. ఆవిషయంలో గవర్నమెంటుకు representationsవచ్చాయి.

*Care of children of persons sentenced to imprisonment etc.*

202.

*704-Q: Sri P. GOPALA KRISHNA REDDI :— [Put by Sri P. Ranga Reddi] Will the Hon. Deputy Chief Minister be pleased to state:

[a] Whether there are any existing rules under which dependents specially young children or babies of those who are sentenced to imprisonment are taken care of and whether in the case of babies and young children they are allowed the company of their matron; and

[b] Whether the Government will take care of a child whose guardian is hanged to death under a sentence of a court of law ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—

[a] There are no rules under which the dependents of those who are sentenced to imprisonment are to be taken care of. But a female prisoner is permitted to have her child with her if it cannot be placed with relations or otherwise provided for, till the child becomes six years old, after which arrangements to place the child with its relatives, are made by the District Magistrate for the duration of the imprison-

ment of the mother. If the relatives are unable to support the child or if the District Magistrate is unable to discover any relative willing to take charge of the child, he will select a trustworthy person to undertake such charge, a moderate sum being allowed for the maintenance of the child.

[b] The Government do not as a matter of course take charge of a child, whose guardian is hanged under a sentence of a court of law. Under the provisions of the Children Act such children may be brought before a Magistrate, by any police officer or other person authorised by the Government in that behalf under the Children Act and the Magistrate may order the committal of the child to suitable custody or to a Certified School.

Sri P. RANGA REDDI :—ఇంతచిన్న పిల్లలుగా వుండేవారి parents విషయమై ఉరితీయకుండా mercy చూపించి వాళ్ళశిక్ష imprisonment for lifeగా చేయడానికి చూస్తారా ?

The Hon. Sri N. SANJEEVA REDDI:—ఇకముందు చేయించబోయే ఖూనీలు అన్నీ రంగారెడ్డిగారు పిల్లలున్నవాళ్ళచేత చేయిస్తారా ?

Sri R. B. RAMAKRISHNA RAJU:— ఇది వరకు రంగారెడ్డిగారు చేయించారా ?

The Hon. Sri N. SANJEEVA REDDI:— రంగారెడ్డిగారేకాదు ఎవరైనా అది admit చేస్తే death sentence రాదుకదా ?

Sri M. BAPAYYA CHOWDARY :— ఆరుసంవత్సరాలవరకు వారి ఇష్టమయితే పిల్లలను జెయిలులో వుంచడానికి permission ఇస్తాము అన్నారు. ఆ పిల్లల ఖర్చు government భరిస్తుందా ? తల్లిదండ్రులు ఇచ్చుకోవాలా ?

The Hon. Sri N. SANJEEVA REDDI:— తల్లితోబాటే బిడ్డఖర్చు కూడా గవర్నమెంటువారే భరిస్తారు.

*Temple Lands of Gandavaram Village in Nellore District.*

203.

*538 - Q : Sri S. VEMAYYA :— Will the Hon. the Minister for Revenue be pleased to state :

[a] whether Government have received representations dated 31-10-1954 from the tenants of Sri Udayaswaraswamy temple lands of Gandavaram Village in Nellore District regarding the remission of the maktas ; and

[b] if so, the action taken thereon ?

The Hon. Sri K. CHANDRAMOULI :—

[a] Yes ;

[b] Remission of maktas was permitted subject to the conditions that no remissions should be granted in respect of lands where land revenue was collected in full by the Government during that fasli and that lessees should pay balance of arrears in excess of remissions before 15-4-1955, the date on which the arrears get time-barred.

Sri S. VEMAYYA :— గండవరం దేవస్థానానికి సంబంధించిన భూములు 1361 ఫస్లీలో నీళ్ళులేకపోవడంవల్ల పండలేదని Executive Officer తనిఖీచేసి సిఫారసుచేసారు. ఆ సిఫారసును పురస్కరించుకుని మక్తాలు తగ్గించడానికి ప్రభుత్వం పూనుకుంటుందా ?

The Hon. Sri K. CHANDRAMOULI :— ప్రభుత్వంవారు దీనిని గురించి భోగట్టా చేయడానికి కొంత ప్రయత్నంచేసారు. దానివల్ల సరియైన information రాకపోవడంవల్ల మళ్ళీ Commissioner గారిని అడిగాము.

Sri S. NARAYANAPPA :— దేవాలయం భూములు ఉన్న ప్రాంతాలలో రివెన్యూశిస్తు రిమిషను ఇవ్వకపోయినా పంటలులేక చాలా బాధలు పడేరైతులు వున్నారు. వారి వివరాలతోబాటు విజ్ఞప్తులు పంపారు. అట్టి కేసులు విచారణ జరిపించి ఆ రైతులకు ఒక విధమైన నష్టపరిహారంగా మక్తాలు తగ్గింపుచేసే ప్రయత్నం చేస్తారా?

The Hon. Sri K. CHANDRAMOULI :— పంటలు పండనపుడు రెమిషన్లు ఇస్తారు. పంటలు పండితేనే మక్తాలు పూర్తిగా వసూలు చేస్తారు. లేకపోతే తగ్గిస్తారు.

Sri B. SANKARAIAH :— 5% పండినా శిస్తు రిమిషను వచ్చేది చాలా కష్టం. మక్తా 95% వుంటుంది. కొద్దిగా పండినపుడు శిస్తుకట్టినా మక్తా విషయం తగ్గించడానికి ప్రభుత్వం ప్రత్యేకంగా ఆలోచిస్తోందా ?

The Hon. Sri K. CHANDRAMOULI :— ప్రత్యేకమైన case వుంటే ఆలోచిస్తాము.

Sri PRAGADA KOTAIAH :—అధ్యక్షా, పంటలు పండకపోతే తప్పని సరిగా శిస్తు remission ఉంటుంది అన్నారు. మా ప్రాంతములలో వర్జీనియా పొగాకు వేస్తాం. అది ఆకు బాగానే అవుతుంది, కాని రంగురాదు. అందువల్ల ఆసామీకి మాత్రం గిట్టుబాటు అయేది వుండదు. ప్రభుత్వం శిస్తు తీసుకుంటుంది. అలాంటివి దేవాలయం తాలూకు భూములున్నాయి. వారు కూడా కొంత శిస్తు తగ్గింపు చేయాలని ప్రభుత్వానికి అర్జీలు పెట్టినాను. వాటిని ప్రభుత్వము పరిశీలిస్తున్నదా ?

[21st July 1955

The Hon. Sri K. CHANDRAMOULI:—ఏదయినా ఒక కష్టతరమైన కేసులో ఆలోచించడానికి ప్రభుత్వం వెనుకంజ వేయదు.

Sri S. VEMAYYA :— ఈ భూములన్నీ యినాం భూము లయినందువల్ల remission యివ్వరు. కాబట్టి land revenue remission question అక్కడ రాదు. ప్రస్తుతం యీ భూములన్నీ exceutive officer ల క్రింద గానీ trusteo ల క్రిందగాని వున్నవి. ప్రభుత్వమువారు వీటిని పునరాలోచించి మక్తాలు తగ్గించడానికే పూనుకుంటారా ?

The Hon. Sri K. CHANDRAMOULI :— దాంట్లో ఏమయినా కష్టమయిన విషయమున్నంటే దానిగురించి ఆలోచన చేయడానికి విచారణ జరుగుతుందని నేను చెప్పాను.

Sri B. SANKARAIAH :— నేను అడిగింది ప్రత్యేకమైన case గురించి కాదు. 5% కట్టేశిస్తుకున్నా 95% కట్టేమక్తాకున్నా భేదంవున్నది. కాబట్టి మక్తావిషయం ప్రత్యేకంగా ఆలోచించడానికి ప్రభుత్వం చర్య తీసుకుంటుందా ?

The Hon. Sri K. CHANDRAMOULI:— ఏ భేదం వున్నా పంటలు అపారంగా పండినప్పుడే శిస్తులు వసూలు చేస్తాం అంటారు. దానికికూడా కొన్ని నియమాలున్నాయి. దాంట్లో అది కూడా ఒక కారణంగా తీసుకొంటున్నాం.

*Railway Line from Kalingapatnam to Parvatipuram.*

204.

* 565 - Q: Sri P. GUNNAYYA :— Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :

[a] whether the State Government recommended the inclusion of construction of the Railway line from Kalinga-patnam via., Srikakulam to Parvatipuram in the Second Five Year Plan ; and

[b] if not, why ?

The Hon. Sri G. LATCHANNA :—

[a] The answer is in the negative.

[b] In connection with the Second Five Year Plan of the Government of India for expansion of Railways, this Government have examined, among other, proposals, for laying [i] a new railway line from Calingapatnam to Vamsadhara dam site via., Srikakulam town and Srikakulam Road and [ii] a new railway line from' Parvatipur Railway Station to Srikakulam Road Railway Station via., Veeraghattam and

Palakonda. It has been found that the line mentioned in item [i] above may be unproductive while the line mentioned in item [ii] above is not an immediate necessity, as the area is well connected by roads to the already existing railway. The Government therefore have not considered it necessary to recommend these lines to the Government of India for inclusion in their second five year plan. Government while making their recommendation bore in mind the overall provision of the centre for new lines and included only very pressing and important proposals.

(a) లేదు.

(b) 80 proposals ప్రభుత్వం పరిశీలించింది. కళింగ పట్నంనుండి శ్రీకాకుళం మీదుగా పార్వతీపురం వెళ్ళవలసిన రైల్వేలైను కొకుండా కళింగ పట్నంనుండి ఆముదాల వలస మీదుగా వంశధార dam site కి line వెళ్ళాలన్న proposal కూడా యీ 80 proposals లో వున్నది. ఐతే కేంద్ర ప్రభుత్వము వారు యీరైల్వేలైన్ను recommendations లో చేసినటువంటి కొన్ని ప్రాతిపదికలు ననుసరించి బాగా రహదారుల సౌకర్యాలు లేకుండా, main line కు దూరంగావున్న ప్రాంతాలలో, అడవిప్రాంతాలకు, ప్రాధాన్యత యివ్వాలని, కొన్నికొన్ని మైళ్ళ limit లో వుండాలని షరతులుండటట్టి వాటి దృష్ట్యా కి ప్రతిపాదనలు మాత్రమే చేయవలసి వచ్చింది. అందువల్ల కళింగపట్నం నుంచి శ్రీకాకుళంమీదుగా పార్వతీపురం వెళ్ళవలసిన proposal ప్రభుత్వం recommend చేసే దానికి అవకాశం కలుగలేదు.

Sri G. GUNNAYYA :- కళింగపట్నంనుంచి వంశధార Project కైనా Government proposal చేశారండీ ?

Mr. SPEAKER :- లేదని చెప్పారు.

Sri P. SURYANARAYANA :- అధ్యక్షా, చాలా కాలంక్రిందట కళింగపట్నం రైలుమార్గం వచ్చే పంచవర్ష ప్రణాళికలో తప్పకుండా వేస్తాంఅని చెప్పారు. పేపర్లు ప్రకటించిన మూడింటిలో యివిలేవు. దయచేసి దానినికూడా పంచవర్షప్రణాళికలో చేర్పించాలని కోరుతున్నాను.

The Hon. Sri G. LATCHANNA :- మనరాష్ట్ర ప్రభుత్వం సిఫారుసు చేసేదే అనే సంగతి గౌరవసభ్యులందరకు తెలుసును. ఇదివరకు memorandum గౌరవసభ్యులు యిచ్చినమాటవాస్తవం. అది చేర్చేవిషయం పరిశీలించ బడుతుందని అప్పుడిచ్చిన సమాధానం. ఆ విధంగా సుమారు 80 proposals అనేక department ల నుండి పరిశీలింపబడినాయి. కేంద్రప్రభుత్వం నిర్ణయించిన

కొన్ని ప్రాతిపదికలననుసరించి main lineను దూరంగా, రహదారి సౌకర్యములేని ప్రత్యేక అవిభక్త ప్రాంతములనుండి పోవునట్లుగా సిఫార్సు చేయవలసినదని సూచనలు చేయబడినవి కనుక యీ ప్రభుత్వమునకు సభ్యులు చెప్పినదాన్ని సిఫార్సు చేయడానికి అవకాశం కలుగలేదు.

Sri SHAIK MOULA SAHEB:— అధ్యక్షా! నెల్లూరు జిల్లా మెట్ట తాలూకాలలో రైలు వేస్తామని జిల్లాబోర్డువారు railway cess వసూలు చేశారు. అప్పట్లో పానుగంటి రాజాగారు వెనుకబడిన ప్రాంతాలకు రహదారికల్పించుటకు నెల్లూరు, ఆత్మకూరు, ఉదయగిరి, కనిగిరి, దొనకొండ ప్రాంతాలకు రైలు లైను వేయాలని survey జరిపించారు. దానిని జిల్లా Planning Committee శిఫార్సు చేశారు. దానిని గురించి ప్రభుత్వం ఏమయినా ఆలోచిస్తారా ?

The Hon. Sri G. LATCHANNA :–3 రోజుల క్రిందట వచ్చినటువంటి ప్రశ్నకు సమాధానంగా నెల్లూరునుంచి మైదుకూరుకు సిఫార్సు చేసినసంగతి గౌరవ సభ్యులకు తెలుసు ననుకుంటాను.

*Fazl Ali Commission.*

205.

*589–Q: Sri S. NARAYANAPPA : Will the Hon. the Chief Minister be pleased to state :

[a] when the Fazl Ali Commission visited Kurnool and whether the Government presented any memoranda to the Commission,

[b] whether the Government will be pleased to place a copy of the report on the table of the House,

[c] whether the Government have received resolutions passed by Moka and other conferences regarding their anxiety to go over to Andhra as immediately as possible ; and

[d] if so, the action taken by the Government ?

The Hon. Sri B. GOPALA REDDI :

[a] The Commission visited Kurnool in September, 1954. The answer to the second part of the question is in the affirmative.

[b] The contents of the Memoranda are treated as strictly confidential. It will not therefore be in the public interest to place a copy of the report on the table of the House.

[c] The answer is in the affirmative.

[d] The Commission was appraised of the public opinion of these areas.

Sri S. NARAYANAPPA :— ఆంధ్రరాష్ట్రం యొక్క సరిహద్దులు నిర్ణయించే నిమిత్తం Fazl Ali Commission కు ఆంధ్ర ప్రభుత్వము యిచ్చినటువంటి memorandum చాలా confidential అని చెప్పారు. అది confidential అయితే దాని వివరాలు చెప్పనవసరములేదు. మన సరిహద్దులు బళ్ళారి ప్రాంతం, కోలారు గనుల విషయం గురించి ఏ సూచనలు చేశారో స్థూలంగా తెలిపిస్తారా ?

The Hon. Sri B. GOPALA REDDI :— స్థూలముగా చేసినా సూక్ష్మముగా చేసినా memorandum లో నున్నటువంటి రహస్యములు ప్రజలకు చెప్పడం మంచిది కాదేమోనన్న వుద్దేశంతో ఇప్పుడు చెప్పలేకుండా వున్నాను.

Sri P. SUNDARAYYA :— మద్రాసు ఆంధ్ర సరిహద్దుల విషయములో రాయబారాలు జరిపి ఒక ఒడంబడికకు వచ్చేదానికి ప్రయత్నం చేస్తున్నట్లే మైసూరుకు ప్రస్తుత ఆంధ్రరాష్ట్రానికి సరిహద్దుల విషయంలో కూడా సంప్రదింపులేమైనా ప్రభుత్వం జరిపిందా ?

The Hon. Sri B. GOPALA REDDI:—No, Sir, We are awaiting the States Reorganization Committee's report.

Sri P. SUNDARAYYA :— ఫజలాలీ కమీషను ప్రధానంగా రాష్ట్రాల పునర్నిర్మాణం గురించి చర్చిస్తుంది. సరిహద్దులను గురించి తరువాత కమీషనులను వేయవలసి యుంటుంది. మద్రాసు విభజనప్పుడు మైసూరులో కొంత భాగం కలపడం అనే సమస్యవున్నది. కాబట్టి ఏరీతిగా మద్రాసు ఆంధ్ర రాష్ట్ర సరిహద్దుల గురించి మద్రాసు ప్రభుత్వంతో సంప్రదింపులు జరిపారో అదే రీతిగా ప్రస్తుత మైసూరు ఆంధ్ర రాష్ట్రాల సరిహద్దుల విషయంలో మైసూరు ప్రభుత్వంతో మన ప్రభుత్వం ఎందుకని సంప్రదింపులు ఆరంభించలేదు ?

The Hon. Sri B. GOPALA REDDI :— అది చేయడానికి policy విషయం ఒకటి ప్రధానంగా వున్నది. States Reorganization Committee దాని విషయమై ఏదయినా చెబుతారేమో చూడవలసి యున్నది. అది pending గా వున్నప్పుడు కొదమ విషయాలు మాట్లాడడం ఉచితం కాదేమోనని ఇంతవరకు మైసూరుతో ఏవీ సంప్రదింపులు జరుపలేదు.

Sri A. KALESWARA RAO :— ప్రకాశం మంత్రివర్గం విశాలాంధ్ర కావాలని, హైదరాబాదు రాజధాని కావాలని Memorandum లో వ్రాయడమే కాకుండా సాక్ష్యంకూడా యిచ్చిందని ప్రస్తుత మంత్రిగారికి తెలియునా ?

The Hon. Sri B. GOPALA REDDI :— తెలుసునో తెలియదో చెబితే confidential అని నేను చెప్పినదానికి భంగమవుతుందేమోనని భయపడుతున్నాను.

Sri A. KALESWARA RAO :— విశాలాంధ్ర మహాసభకు ఒక కోర్కె యిచ్చారు మద్రాసు రాష్ట్రప్రభుత్వంవారు, ఇంకొకటి Provincial Congress

Committee కి యిచ్చారు. అప్పుడు ప్రధానమంత్రిగారు దానికి అధ్యక్షులుగా వున్నారు. ఏమిటి confidential? ప్రజాభిప్రాయానికి బ్రహ్మాండంగా ప్రాతినిధ్యం వహించి నటువంటి గవర్నమెంటు, శాసనసభ్యుల తరపున ప్రాతినిధ్యం వహించి నటువంటి గవర్నమెంటు సిఫార్సులు చేస్తే ప్రజాభిప్రాయాన్ని ననుసరించినదానిని మీరు పాటిస్తారా? అది మీపైన bind అవుతుందా? అది అసలు మేము చూడనేలేదు; చూడం, confidential; మాకేమీ సంబంధంలేదని చెబుతారా మంత్రిగారు?

The Hon. Sri B. GOPALA REDDI :—ఎవరెవరు ఇచ్చినారో నాకు తెలియదు. కాని రిపోర్టు వచ్చేంతవరకు దానిని గురించి చర్చించి, వివరాలు చెప్పడంవల్ల, మనకు చుట్టుప్రక్కల నున్న రాష్ట్రాలతో కొంత భేదాభిప్రాయాలు, మనస్పర్థలు వస్తవనే భయంతో ఆ రిపోర్టు వచ్చేంతవరకు confidential గా వుంచితే మంచిదని ప్రభుత్వంవారు అభిప్రాయ పడుతున్నారు.

Sri P. SUNDARAYYA :— అధ్యక్షా! సభ హక్కులను గురించి point of order raise చేస్తున్నాను. ప్రభుత్వం confidential report అని చెప్పినప్పుడు leakage స్పష్టంగా వున్నదని చెప్పి గౌరవ సభ్యులు అందరికి తెలియచేశారు. అందుచేత అది యింక confidential కాదు. అందుచేత ఆ రిపోర్టును శాసన సభముందు పెట్టడం మన శాసనసభయొక్క హక్కులను రక్షించడం అవుతుంది. సరియైన ruling యివ్వమని కోరుచున్నాను. అది confidential report అయితే అడుగుచుండేవాడను కాను. ఎప్పుడయితే కాంగ్రెసు కమిటీకి ఒక కాపీ యిచ్చారో అది ఏమాత్రం confidential కాదు. Confidential report కానప్పుడు కాపీ table మీద పెట్టటానికి ఏలాంటి అభ్యంతరం వుండకూడదు అని ruling ఇవ్వకోరుచున్నాను.

Mr. SPEAKER :— Unauthorised disclosure does not take away the confidential nature of the document. We have accepted the statement of the Hon. Chief Minister, in preference to any other statement, when he said that it is a confidential document.

Sri P. SUDARAYYA :— Then I shall put the question to the Chief Minister. గోపాలరెడ్డిగారు ముఖ్యమంత్రిగా వున్నవారు. యిదివరకు ముఖ్యమంత్రి ప్రకాశం పంతులుగారు యీ రకంగా కాంగ్రెసు కమిటీకి, కాశీశ్వరరావుగారికి రిపోర్టు కాపీ యివ్వడం తప్పని చెప్పి ఖండిస్తున్నారా? అది నిజముకాదని చెబుతారా?

The Hon. Sri B. GOPALA REDDI :—నేను దానిగురించి అభిప్రాయం చెప్పడం లేదు. కాశీశ్వరరావుగారు ఏ అభిప్రాయంతో చెప్పినారో నాకు తెలియదు. Provincial Congress Committee కి అధ్యక్షుడనుగా వున్నప్పుడు వారు నా దగ్గరకు వచ్చినట్టు జ్ఞప్తి లేదు. అదీకాక ఏదయినా ఒక రిపోర్టు table మీద పెట్టడం అనేది లేదు. ఎవరో ఒకరికి, కాశీ

శ్వరరావుగారికి, సుందరయ్యగారికి, వ్యక్తులకు confidential గా దాని విషయాలు ఏమయినా చెబితే చెప్పవచ్చు. కాని పత్రికలలో పడేటట్లుగా table మీద పెట్టడం, లేక అందరికీ చెప్పడం కొంతవరకు సాధ్యం కాదేమో ననుకుంటాను. దానికి, దీనికి కొంత తేడా వున్నది.

Sri PILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా! మన మంత్రిగారు యిచ్చిన సమాధానంలో కూడా ఆ confidential అని చెప్పినటువంటి డాక్యుమెంటులో ఉన్నటువంటి విషయాలు కొంతవరకైతే చెప్పడం confidential క్రిందనే తీసుకోవచ్చునని చెప్తూ ఉన్నారు. ఆనాడు శాసన సభ్యులుగ లేనటువంటి కాశీశ్వరరావుగారికి, గోపాలరెడ్డిగారికి కూడ ఇది జ్ఞాపకం లేదన్నారు,........

The Hon. Sri B. GOPALA REDDI :—Even now I do not remember to have seen the report either as the President of the Andhra P. C. C. or as the Chief Minister of Andhra. I have not seen the report.

Sri PILLALAMARRI VENKATESWARLU :—Chief Minister గ గాని, President of P. C. C. గ గాని వారు చూడలేదంటున్నారు. వారు చూడకుండానే ఒక Sub-Committee వేశారు. వారికి జ్ఞాపకం లేకపోవచ్చును. కాని కాశీశ్వరరావుగారు నిర్ధారణగా 'నాకు ఇచ్చారని' చెప్తున్నారు.

Sri PILLALAMARRI VENKATESWARLU :— He will place the copy before us and the Hon. Speaker can give a ruling that the Hon. Chief Minister can place the paper on the table of the House.

Mr. SPEAKER :— If the Government say that a certain document is confidential, we cannot compel them to place it on the table.

*Karnams in the State.*

206.

* 317 - Q :— Sri P. VENKATA SUBBAYYA :—Will the Hon. the Minister for Revenue be pleased to state :

Whether it is a fact that the karnams are burdened with heavy scriptory work, the daily account the kirdi account, and that they are unable to discharge their duties without an assistant or additional remuneration ?

The Hon. Sri K. CHANDRAMOULI :—

The Karnams are not burdened now with any heavier scriptory work than before. Assistant Karnams are

21st July 1955]

employed where the work is unieldy for one karnam. Additional remuneration is also paid to them whenever they are required to do extra work.

*Educational facilities to children of Village Officers.*

207.

* 676-Q : Sri P. GOPALAKRISHNA REDDI :— Will the Hon. the Chief Minister be pleased to state :

(a) Whether the educational facilities that have been granted to the non-gazetted officers' children have been extended to the children of village officers and servants ; and if not, why ;

(b) Under what category the Government have classified the Village Officers and servants ?

The Hon. Sri B. GOPALA REDDI :—

(a) The educational concessions granted to the children of the Non-Gazetted Officers are not admissible to the children of Village Officers and servants as they are not full time Government servants.

(b) The Village Officers and servants have all along been treated as part-time Government servants who are not required to work for regular hours. The rules and regulations regarding personal conduct, and Fundamental Rules which are admissible to Government servants are not applicable to them.

*Andhra Irrigation Board*

208.

*543 Q:—Sri S. VEMAYYA :—Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) Whether the Government have constituted the Andhra Irrigation Board; and

(b) If so, the matters on which the Board will advise the Government ?

The Hon. Sri K. CHANDRAMOULI :—

(a) The answer is in the affirmative.

(b) The Irrigation Development Board will advise Government on all aspects, other than purely technical engineering, connected with the development of all irrigation projects.

## II BUSINESS OF THE HOUSE.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:— ఈ సభా సమావేశం ఎన్నాళ్ళవరకు ఉంటుందో కాస్త చెప్పితే arrangements చేసుకొనే సూనులు ఉంది. Republic President మన Capital కు వస్తున్నారు. ఈ సభ ఎప్పుడు ముగింపు అవుతుందో సభ్యుల సౌకర్యంకోసం చెప్పగోరుతున్నాను.

Mr. SPEAKER :—The Hon. Leader of the House will appraise the House.

The Hon. Sri B. GOPALA REDDI :— ఆగస్టు 5 వ తేదీన Appropriation Bill ప్యాసు అవుతుంది. తరువాత tea party ఉంటుంది. దానితో ఈ sitting అయిపోతుంది. మళ్ళీ బహుశః సెప్టెంబరులో సమావేశం అవుతాము.

Sri PILLALAMARRI VENKATESWARLU :— ఇదివరకు ప్రణాళికపై discussion ఉంటుంది అన్నారు.

Mr. SPEAKER :—We shall have Planning Debate on the 2nd and 4th August, 1955.

Sri S. BRAHMAYYA :—President గారు ఆగస్టు 14, 15 తారీకులలో వస్తారుకదా. అప్పుడు మెంబర్సు అందరిని introduce చేయడానికి సమావేశం పొడిగిస్తారా ?

The Hon. Sri B. GOPALA REDDI :—లేదు. అప్పటివరకు సమావేశం కావడానికి గవర్నమెంటు దగ్గర ఇంకా bussiness తయారుగా లేదు. President గారు కొన్నికొన్ని జిల్లాలకు వస్తున్నారు. కాబట్టి మెంబర్లు అందరు వారి సందర్శనము చేసుకొంటారని ఆశిస్తున్నాను.

[Note :-An asferisk at the commencement of a speech indicates revision by the member]

21st July 1955]

## III. BUDGET FOR THE YEAR 1955 - 56

*Voting on Demands for Grants (Continued)*

### DEMAND VIII - IRRIGATION

The Hon. Sri N. SANJEEVA REDDI :— Mr. Speaker, Sir, on the recommendation of the Governor, I move :

" That the Government be granted a sum not exceeding Rs. 1,34,91,300 under Demand VIII - Irrigation. "

Irrigation గురించి ప్రత్యేకంగా సభ్యులకు తెలియని విషయాలు నేను చెప్ప గలిగినవి ఎక్కువగా లేవు అని నేను భావిస్తూ ఉన్నాను. ప్రతిరోజు వీటిని గురించి ప్రశ్నల సందర్భములోనేమి ఇతర సందర్భాలలోనేమి మనము చర్చిస్తూనే ఉన్నాము.

దాదాపు గడచిన రెండు సంవత్సరములుగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తర్వాత ప్రత్యేకమైన నూతన దృక్పథముతో, శ్రద్ధతో ఇరిగేషన్ పనులు జరుప బడుతూ ఉన్నాయి అనే విషయం ఎంతఅభిప్రాయ భేదములున్న సభ్యులైనాసరే అంగీకరించక తప్పని సత్యం. కాని ప్రత్యేకమైన దృక్పథముతో ఆలోచించి నపుడు ఒక్కొక్క శాసన సభ్యుడు తన ప్రాంతములో, తన నియోజక వర్గములో ఈ కార్యక్రమము కావాలి, ఇది చేయలేదు అని ఆక్షేపించడానికి మాత్రం అవకాశాలు ఉన్నాయి. అన్ని నియోజక వర్గాలకు తృప్తి కరంగా ఉండేటట్లు ఇరిగేషన్ కార్యక్రమాన్ని ఏర్పరచు కోవడం అసంభవమైన విషయం. రాష్ట్రం మొత్తం పై తీసుకొన్న కార్యక్రమాలను గురించి ఆలోచించినపుడు గాని జరుగుతూ ఉన్న పనులను ఆలోచించి నపుడుగాని ఆక్షేపించడానికి ఎక్కువ అవకాశాలు లేవేమో అని విశ్వసించుచున్నాను. గడచిన రెండు సంవత్సరాలుగా, 1953 అక్టోబరు నుంచి జరిగిన కార్యక్రమాన్ని ఒక పర్యాయం పునరాలోచించి తరువాత జరుగవలసిన కార్యక్రమాన్ని గురించి కూడ చర్చించుకొని మిత్రులు సరిఅయిన సలహాలుఇచ్చి నపుడు ప్రభుత్వం పాటించ డానికి సిద్ధంగా ఉందని మాత్రమే మిత్రులకు తమద్వారా సలహా ఇస్తున్నాను.

1953 వ సంవత్సరం ఆంధ్రరాష్ట్రం ఏర్పడినపుడు క్రిష్ణా ఆనకట్ట ఏ క్లిష్టమైన పరిస్థితిలో ఉందో, ఏ ప్రమాదమైన పరిస్థితిలో ఉందో ఇక్కడ ఉన్న సభ్యులందరికి తెలిసిన విషయమే. అప్పటి కప్పుడే చాల ప్రమాదానికి గురియై రెండు ఏండ్లుగా దీని విషయం ఏమిచేయాలి? 12 లక్షల ఎకరాలను ఏలా రక్షించు కోవాలి అనే ఆదుర్దాతో ఆలోచనలు సాగుతూ ఉండినాయి. ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన వెంటనే మిగిలిన సమస్యలకు ప్రాధాన్యం ఎక్కువ ఇవ్వకుండా ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వం ఆ సమస్యకే అగ్రస్థానాన్ని ఇచ్చి డబ్బు ఉన్నదా? లేదా? లేక రావలసిన గ్రాంటులు లేక అప్పులు వస్తాయా రావా? అన్న విషయాలను గురించి ఆలోచించకుండా వెంటనే ఆ barrage పనిని ప్రారంభించి కోట్ల కొలది రూపాయలను ఖర్చుపెట్టడానికి, ఖర్చు పెట్టడమే కాదు, అతి త్వరలో దానిని పూర్తిచేయడానికి చేసిన కృషి ఈ సభవారందరికి తెలుసును,

పని ఏలా చురుకుగా జరుగుతూ ఉండేది కూడా మిత్రులు, కనీసం ఆ ప్రాంతపు మిత్రులు అయినా, చూచి ఉంటారని అనుకొంటాను. ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వం ఏర్పడిన వెంటనే పునాది రాళ్ళు వేయడం చాలా ఎక్కువగా జరుగుతున్నది అని కొందరు ఆక్షేపిస్తూ ఉంటారు. వారికి తెలియకపోవడంవల్లనో, లేదా వారు ఇతర ప్రాంతములకు వెళ్ళి చూడకపోవడంవల్లనో, లేదా చూచి ఆక్షేపించాలి అనే దీక్ష వల్లనో, ఏదో ఆక్షేపించాలి అన్న దృక్పథంతోనో ఆక్షేపణ తెలుపుతూ ఉంటారు. దానికి సరియైనజవాబు చెప్పుతూఉండడం చాలాకష్టం. గోపాలరెడ్డిగారి మంత్రివర్గం ఏర్పడినతర్వాత నేను ఒకపర్యాయం పోయి క్రిష్ణా barrage విషయంలో చేస్తున్న పని చూచి వచ్చాను. అక్కడ దాదాపు 5 వేల మంది కూలీలు పని చేస్తున్నారు. దానికి తగిన సామగ్రి supply చేయడానికిగాను గనులలో దాదాపు 5వేల మంది పనిచేస్తూవున్నారు. మొత్తం 10 వేల మంది రాత్రింబగళ్ళు రోజుకు 20 గంటల సేపు పనిచేస్తూ schedule ప్రకారం ఈ కార్యక్రమాన్ని ముగించాలని, ఎప్పుడైనా ఈ అకస్మాత్తుగ ప్రమాదం వస్తే ఆంధ్రదేశానికంతా లోటు సంభవిస్తుందనే విషయాన్ని గుర్తించి, రాత్రి, పగలు పనిచేస్తున్న విషయం కూడా మా మిత్రులు గమనించే ఉంటారు.

ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరువాత ఒక్క పెద్ద ప్రాజెక్టులే కాక, చిన్న చిన్న ప్రాజెక్టులు ఎన్నో ప్రారంభించబడ్డాయి. అటువంటివి దాదాపు 17 స్కీములున్నా ఇంక ఇతర స్కీములు రెండో, మూడో, మొత్తం దాదాపు 20 స్కీములవరకు ఉన్నాయి. వాటి విషయంగురించి ఆయా ప్రాంతపు మిత్రులకు తెలుసుననుకొంటాను. అన్ని ప్రాజెక్టులపని చాలా సలీసుగా అనుకొన్న ప్రకారం జరుగుతున్నది. సకాలములోనే ఆ పని అంతా పూర్తిచేయగలమని ఆశిస్తున్నాము. ఇప్పటికప్పుడే కొన్ని ప్రాజెక్టులపని పూర్తియైనది. కాళహస్తి తాలూకాలో స్వర్ణముఖి ప్రాజెక్టు దాదాపు పూర్తిఅయినది. ఇంకా కొద్దిగా ఏదైనా చేయవలసిఉంటే కొద్ది రోజులలోనే (నెలలలోకాదు) పూర్తిఅవుతుంది. ఇతర ప్రాజెక్టుల విషయంలోగూడ, కొన్ని లక్షల రూపాయలు అప్పుడే ఖర్చు పెట్టబడింది. పనులు సక్రమంగా జరుగుతున్నాయి. ఒకటి, రెండు ప్రాజెక్టుల విషయంలో మాత్రము, అనుకొన్న విధంగా పనులు జరగలేదు. శ్రీకాకుళం జిల్లాలో నారాయణపురం దగ్గర నాగావళికి కట్టబడుతున్న ప్రాజెక్టుపని అనుకొన్నవిధంగా జరగలేదు. దానికి కారణం లేకపోలేదు. నారాయణపురందగ్గర కాకుండా ఇంకా పైన ఎక్కడనో ఈ ప్రాజెక్టు కడితే బాగుంటుందని, ఇక్కడ కట్టడం చాలా పొరబాటని అక్కడఉన్న కొంతమంది మిత్రులు ప్రభుత్వం దృష్టికి తీసుకురావడంవల్ల, ప్రకాశం మంత్రివర్గము రాజీనామా ఇచ్చిన తరువాత, ఆ విషయాన్ని పరిశీలించడంలో కొన్ని నెలలు వృథాఅయింది. గోపాలరెడ్డిగారి మంత్రివర్గం వచ్చిన తరువాత, ఈ ప్రభుత్వం దానికి administrative sanction ఇవ్వవలసి వచ్చింది. అది 50 లక్షలకు మించినపని. ఆవిధంగా ఒక సంవత్సరంమించి ఆలస్యం కావడంవల్ల ఆ పని కొంత కుంటుబడింది. అయినా ఇప్పుడు administrative sanction ఇవ్వ

బడింది. ఆ పనికూడ చురుకుగా జరుగుతున్నది. ఈ సంవత్సరం లక్ష రూపాయలు అందుకు ఖర్చుపెట్టాలని అనుకొన్నాము. ఎంత ఖర్చుపెట్టినాసరే, రెండేళ్ళలో పూర్తి చేయగలదాన్ని ఒకే సంవత్సరంలో పూర్తి చేయగలమనే ఆశ మాత్రము మాకులేదు. ఇంక కడప - కర్నూలు కాలవపని మనమందరము చూస్తూనే ఉన్నాము. అది క్రిష్ణాబేరేజ్ లాంటి పెద్దపని. కొన్ని లక్షలు ఖర్చు అయ్యాయి. దానిని రెండేళ్ళలో పూర్తి చేయగలమని ఆశించాము. గత సంవత్సరం పని ప్రారంభించబడింది. మొదటి సంవత్సరము కాబట్టి కంట్రాక్టర్లకు అనుభవము తక్కువ, ఇంజనీర్లకూడ తెలిసిన పద్ధతులలో దానిని చురుకుగా చేయడంలేదేమో ననుకొంటాను. ఏమైనాసరే, గడచిన సంవత్సరం కొద్దిగా పని కుంటుబడింది. ఈ కారణాలవల్ల, వచ్చే మార్చిలోపలనే ఈ పని పూర్తి చేయగలమా అనే సందేహాలు ఏర్పడ్డాయి. దీనికి కోట్లకొలది రూపాయలు ఖర్చు పెడుతున్నామని, ఎందుకు ఇంత ఖర్చుపెడుతున్నారని కొందరు ఆక్షేపించారు. మొన్న ఈ బడ్జెట్ పైన general discussion లో ఒక సోదరశాసన సభ్యుడు మాట్లాడుతూ, ఈ కడప - కర్నూలు కాలవకు సిమెంటువేస్తున్నారు, క్రింద సిమెంటు వేస్తున్నారు, ప్రక్కన సిమెంటు వేస్తున్నారు, రేపు దాని పైనకూడవేసి మూతపెడతారేమోనని ఆక్షేపించారు. ఆయనకు దీని విషయమై తెలియకపైనా ఉండాలి, లేక తెలిసి, ఏమైనాసరే అవకాశం తీసుకొని ఆక్షేపించాలని అయినా ఆక్షేపించి ఉంటారు.

బహుశా ఆయనకు దాని సంగతి తెలియదేమో, తెలిసిఉంటే ఆ రకంగా మాట్లాడి ఉండరనుకొంటాను. ఆ దినమే నేను దానికి సమాధానము చెప్పి ఉండవలసింది; కాని అనవసరమేమో అనుకొని చెప్పలేదు. ఈ కడప-కర్నూలు కాలువ ఇటీవల త్రవ్వింది కాదు. పూర్వం ఎప్పుడో త్రవ్వబడింది. మూడు లక్షల ఎకరాలకు నీరు పారాలని ఉద్దేశించబడింది. కాని ఇదివరకు ఒక లక్ష ఎకరాలకు మాత్రమే నీరు పారుతున్నది. దీనికి కారణం, ఈ ప్రాంతములో భూమి మూడు అడుగులు త్రవ్వగానే క్రింద పలుచన slate లాంటి బండలు కనపడతాయి. ఈ కాలవలో నీరు పోతూ పోతూ ఆ బండల మధ్య నీరు చాలా భాగము కారిపోయి నదిలో కలిసిపోతుంది. మూడు వేల క్యూసెక్కుల నీళ్ళు దీనిలో పారించాలి అనే విధంగా ఏర్పాటుచేసుకొని ఉన్నప్పటికీ, వెయ్యి క్యూసెక్కులైన పారడం లేదు. కడప ప్రాంతమునకు పోయేసరికి అక్కడ నీరు పారడమే లేదు. అక్కడ ఇతర నదులలో ఉన్న నీరు పారుతున్నదే గాని, తుంగభద్ర నీరు మాత్రము కడపవరకు చేరడంలేదు. ఇన్ని కోట్లు ఖర్చుపెట్టినటువంటి ఈ కాలవద్వారా నీరు తీసుకొని పోలేకపోవడంవల్ల నష్టము కలుగుతున్నదని తెలిసే, ఆంధ్ర రాష్ట్రము ఏర్పడిన వెంటనే కోస్లా కమిటీవారి సలహాలను అనుసరించి ఈ విధంగా దానికి సిమెంటు వేయడంద్వారా మూడు వేల క్యూసెక్కుల నీళ్ళు మూడు లక్షల ఎకరాలకు పారించడానికి అవకాశం ఏర్పడుతుందని, ఈ 70 మైళ్ళు అనగా నీరు ఎంత దూరమువరకు కారిపోతుందో అంత దూరము, సిమెంటు plastering చేయాలని నిశ్చయించి ప్రభుత్వం ఈ మొత్తాన్ని sanction చేసింది. ఆ పని జరుగుతూంది. అంతే కాని, ఇదేదో డబ్బు ఎక్కువగా ఉందని అనవసరంగా K. C. Canal శృంగారానికి

లేదా సిమెంటు వేస్తే భద్రంగా ఉంటుందని గాని, ఏ ఉద్దేశ్యంతోనూ డబ్బును నిరుపయోగం చేస్తున్నది కాదు. మూడు కోట్లు ఖర్చు పెట్టినా, రెండు లక్షల ఎకరాలు అదనంగా సాగులోకి వస్తుందంటే ఇది ఎంత ఉపయుక్తమైన కార్యక్రమమో, ఇది దేశానికి ఎంత క్షేమకరమో ఆ మిత్రునికి తెలియకపోవచ్చును. కాని అలాంటివారే 20 కోట్లు, 30 కోట్లు ఖర్చుపెట్టి మూడు రెండు లక్షల ఎకరాలకు నీరు ఇవ్వండి అని అప్పుడప్పుడు అడుగుతూ ఉంటారు. మీరు ఈ విధంగా 20 కోట్లు, 30 కోట్లు ఖర్చుపెట్టి 2 లక్షల ఎకరాలకు నీరు సప్లయి చేయండి అనేటప్పుడు, ఇక్కడ 3 కోట్ల రూపాయలతోనే 2 లక్షల ఎకరాలను సాగులోకి తీసుకొనివస్తూంటే ఎందుకు ఇంత ఖర్చుపెడుతున్నారని అడగడం ఏ మాత్రం సమంజసంగా లేదు. కాబట్టి ఈ విషయంలో విమర్శిస్తున్నారంటే అది బాధ్యతా రహితంగానైనా ఉంటుంది, లేదా ప్రాంతీయ అభిమానంతోనైనా ఉంటుంది, లేదా ఇంకే కారణంవల్లనైనా ఉంటుంది. విషయం తెలియక పోవడంవల్ల ఈ విమర్శలన్నీ వస్తూ ఉంటాయి. తెలియకపోతే, ముందు తెలుసుకోవాలి. తెలుసుకొన్న తరువాత, తప్పులున్నాయని తోస్తే విమర్శించవచ్చును. ఆ విధంగా విషయం తెలుసుకొని విమర్శిస్తే నూటికి నూరుపాళ్లు స్వీకరించడానికి సిద్ధంగా ఉన్నాను. తప్పులు చేయాలనిగాని, మన డబ్బు అనవసరంగా ఖర్చుపెట్టాలనిగాని, ఇంకెక్కడో ఏ ప్రాంతానికో ఒక ప్రాంతానికి ఏదో చేయాలనిగాని ప్రభుత్వముయొక్క ఉద్దేశ్యంకాదు. ముఖ్యంగా మనం అందరమూ కలసి రాష్ట్రం మొత్తానికి ఏది క్షేమకరంగా ఉంటుందో ఆలోచిస్తే మనం ఇప్పుడు చేస్తున్న కార్యానికన్నా ఎంతో ఎక్కువ చేయడానికి వీలుంటుంది.

ఇది ఇట్లుండగా గడచిన సంవత్సరం నందికొండను గురించి ఎంతో దుమారం రేగింది. తుంగభద్రను గురించి ఎంతో దుమారం రేగింది. మీకు తెలుసు. అదృష్టవశాత్తు ఏలాంటి చిక్కులు లేకుండా దాదాపు రెంటిని సాధించగలిగాము అని చెప్పవచ్చు. నందికొండ, తుంగభద్ర ఎగువకాలువ, వంశధార, ఈ మూడింటిని సాధించి తీరాలి అనేది ప్రకాశం మంత్రివర్గంయొక్క ఆశయము. ఆనాడు ఇంకా ఎన్నో ప్రాజెక్టులు ఉండినా, ఈ మూడింటిని మాత్రము తప్పక సాధించాలనుకొన్నాము. ఇంకా ఇతర ప్రాజెక్టులు ఎన్నో ఉన్నాయి. సిద్ధేశ్వరం ప్రాజెక్టు ఉన్నది. గండికోట ప్రాజెక్టు ఉన్నది. పులిచింతల ప్రాజెక్టు ఉన్నది. గోదావరి నదిపైన ఒక ప్రాజెక్టు ఉన్నది. ఇంకా ఏవేవో ఉన్నా, తొలుదొల్త చేయవలసినవి ఈ మూడు. ఈ ప్రాంతానికి ప్రాజెక్టు లేకపోయినా, ఒక కాలువ త్రవ్వాలనే ఉద్దేశ్యంతో తుంగభద్ర ఎగువకాలువను, ఆంధ్రదేశానికే కాదు, భారతదేశానికంతా ఘనంగా చెప్పుకోదగ్గ నందికొండ ప్రాజెక్టును, ఇటు క్షామమునకు నిలయమవుతున్నటువంటి ఈ ప్రాంతాలకును, అటు నెల్లూరు శ్రీకాకుళం జిల్లాలకు వంశధార ప్రాజెక్టును, ఈ మూడింటిని సాధించుకొంటే ఇప్పటికి చాలుననే ఉద్దేశ్యంతో గట్టిగా కేంద్ర ప్రభుత్వము పైన వీటికొరకు ఒత్తిడి చేస్తూవచ్చాము. ఈ మూడింటిని మాత్రమే ఆలోచించి మిగిలినవి మరచిపోలేదు. మన చీఫ్ ఇంజనీరుగారు 20 ఏళ్ళ పథకాన్ని ఒకటి తయారుచేశారు. అంటే ఫస్టుఫేసులో ఈ మూడు ప్రాజెక్టులు తీసుకొని, రెండవ ఫేసులో సిద్ధేశ్వరం ప్రాజెక్టు తీసుకోవలెనని, సిద్ధేశ్వరం తీసుకొనిననాడే ఇటు గండికోటకు

గాని, అటు నెల్లూరు జిల్లాకు సోమశిలకు గాని తీసుకొని నీరు సరఫరా చేయ గలుగుతామని, తరువాత మూడవ ఫేస్‌లో, ఇంకా క్రిష్ణా డెల్టాలో ఉన్న వారికి నీరు కలుగజేయుటకు గాను పులిచింతల ప్రాజెక్టును తీసుకోవలెనని, ఈ విధముగా వీటన్నింటిని సాధించగలుగుతామని ఢిల్లీ ప్రభుత్వానికి తెలియజేశాము. ఇప్పుడు ప్రజలకు కూడా తెలియ జేశాము. ఇందులో ఏదో రహస్యంగా పెట్టుకోవలసిన అవసరములేదు. ఒక conviction తో మనం ఈ పని సాధించుకోవాలి అనుకున్నప్పుడు, ఒక ప్రాంతము వారికి కొంత మోసగాలున్నా, మనము న్యాయం చేస్తున్నామనే విశ్వాసం ఉన్నప్పుడు అందరికి తెలియజేయడంలో తప్పులేదు. ఆ విశ్వాసంపైననే, ఆ సిద్ధాంతంపైననే మేము అఖిల భారత ప్రభుత్వానికి మొదటి ఫేసులో ఈ మూడు ప్రాజెక్టులను సమగ్రము recommend చేశాము. ఈ మూడు ప్రాజెక్టులను recommend చేసినప్పుడు శాసనసభలో (అప్పటి మంత్రివర్గం ఉన్న రోజులలో) కొందరు సభ్యులు తుంగభద్ర ఎగువ కాలువను ముడిపెట్టామని అన్నారు. అది కాదని చెప్పాను. అది ఎప్పటికీ కాదు. మనకు రెండూ కావాలి. అంతేగాని, ఒకదాని కొకటి ముడిపెట్టి ఇంకొకదాన్ని విడిచిపెడతాము అన్న సమస్యను ప్రభుత్వము అంగీకరించదు అనే విషయాన్ని నేను చెప్పాను. కాని ఆరోజులలో ఢిల్లీలో అధికారములో ఉన్న ఒక మిత్రుడు ఈ రెండింటిలో ఏదైనా ఒకటి కోరుకోండి, తుంగభద్ర ఎగువకాలువ కావాలంటే ఇప్పుడే ఇస్తాము అని చెప్పారు. కాని నందికొండ లేనినాడు తుంగభద్ర ఎగువకాలువ అవసరంలేదని ఆనాడే ప్రభుత్వం సాహసంగా చెప్పగలిగింది. మాకు రెండూ కావాలి, ఒకటి మాత్రం తీసుకోవడానికి సిద్ధంగాలేము అని చెప్పాము. తరువాత high level conference ఢిల్లీలో జరిగింది. అప్పుడు మేమందరము నేను, గోపాలరెడ్డిగారు (అప్పుడు మంత్రివర్గములో లేకపోయినా) ఢిల్లీకి పోయి అందరికి నచ్చచెప్పి అక్కడ ఉన్న ప్రధాన మంత్రికి, ఆర్థిక మంత్రికి నచ్చచెప్పి ఈ రెండు ప్రాజెక్టులు ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాము అని హామి వారివద్ద తీసుకో గలిగాము.

తుంగభద్ర ఎగువకాలవ విషయములో యిక్కడ మిత్రుల మనస్సులలో చాలా అనుమానాలు వుంటున్నవి. ఈ కాలవ యిప్పటికీ రాలేదే, వస్తుందో రాదో, ఆలస్యం అవుతుందా అనే మాదిరిగా అనుమానాలు పడుతున్నారు. వారికి వున్న అనుమానాలు నాకు కూడా కొద్దిగా లేకపోలేదు. వారికి కష్టముగా తోచినప్పుడే దీనిని పట్టుదలగా సాధించాలని నాకు వున్నది. ఇది సాధించాలనే పట్టుదల రాయలసీమ జిల్లాలలోనివారికే కాదు. కడప అనంతపురం జిల్లాల లోనివారికే కాదు. ఈ పట్టుదల ఆంధ్రదేశములోని వారికి అందరకూ గూడా వుంది. తుంగభద్ర ఎగువ కాలవ ఏ ఒక్క జిల్లాకో రెండు జిల్లాలకో వస్తున్నదని కాదు. ఆంధ్రదేశములో నందికొండకు ఎంత ప్రాముఖ్యత యిస్తున్నామో, అది మన భారతదేశమునకంతటికి ముఖ్యమైన ప్రాజెక్టు అని ఎట్లా అనుకుంటున్నామో, ఆ ప్రాముఖ్యతనుబట్టి దానికి గాను ఎన్నికోట్లు ఖర్చు పెట్టబోతున్నాము. తుంగభద్ర డామకు ఇంత డబ్బు ఖర్చు పెట్టిన తరువాత ఎగువ కాలువను కూడా తవ్వకపోవడము పొరబాటే. ఈ పొరబాటును యిప్పటి

కైనా సద్దుకోవాలి, అనే ఉద్దేశ్యముతోను దీక్షతోను యీ ప్రభుత్వము పని చేస్తున్నది. కాని యీ కాలువ విషయములో కొన్ని యిబ్బందు లున్నవని నేను ప్రశ్నల సమయములో చెప్పాను. ఆ యిబ్బందులన్నీ త్వరలోనే దాటుకో గలమని అనుకుంటున్నాము. కాని యీ ప్రాజెక్టులు శాంక్షను అయిన తరువాత మన మిత్రులలో కొంతమందికి విశాలమైన దృష్టి లేనట్లు వున్నది. ఆ జిల్లాకు నీరు వస్తున్నదే, యీ తాలూకాకు రావడంలేదే, ఇక్కడ కాలువ త్రవ్వితే యీ తాలూకాకు వస్తుందా, లేక యీ కాలువ యింకా ఎటు వైపుకు పోతుంది, మా తాలూకాకు రాకుండా ఆ తాలూకాకు పోతున్నదే యీవిధంగా ప్రచారము ప్రారంభించారు. నేను నా పర్యటనలో నెల్లూరు జిల్లాను చూచాను. నెల్లూరుజిల్లాలో కొందరు మిత్రులు కూడా ఈ విధంగా అన్నారు. ఈ తాలూకాకు ఆ కాలువనీరు రావటంలేదే యింకా ఎక్కడికో పోతున్నదే! నందికొండ నీరంతా యీ తాలూకాకు రాకుండా యింకా ఎక్కడికో పోతున్నదే? ఆ కాలువను ఈ కొండలలో నుంచి తీసుకొని వస్తే మా తాలూకాకు నీరు వస్తుందే అని ప్రచారముగూడ జరుగుచున్నది. 'ఇంకను యీ ఎగువ కాలవను ఎక్కడికో తీసుకొని పోతున్నారు,' ఇది యీ కొండమీదుగా తీసుకొనివస్తే మా తాలూకా అంతా పారుతుంది, అని ప్రచారము ప్రారంభించారు. ఈ విధంగా మాట్లాడుతూ వున్నారు. నందికొండ ప్రాజెక్టు కట్టితే మా తాలూకాకు గాని నీరు వస్తుందోరాదో కాని యిక్కడ అనకట్ట కట్టితే నీరు మా తాలూకాలో గూడా పారడానికి వీలు అవుతుంది, అని అంటూవుంటున్నారు. ఈ విధంగా రకరకాలుగా మాట్లాడుతూ వుంటే దీనికి అంత్యము ఎక్కడ? ఏదైనా ప్రాజెక్టు కట్టితే దానివీలును బట్టి సాధ్యమైనంత మటుకు దానియొక్క ఫలితములు వీలయినన్ని చోట్లకు అందేటట్లు చూడాల్సి వున్నది.

ఏదో ఒక ప్రాజెక్టు కట్టమంటే, దానియొక్క ఫలితము అందరూ అనుభవించాలంటే, అది సాధ్యపడే విషయమా? కొంతమందికి వస్తుంది, కొంతమందికిరాదు. ఇన్నికోట్లు ఖర్చుపెట్టి ఆ ప్రాజెక్టు ద్వారా ఏ ఏ తాలూకాలకు నీరు తీసుకొని పోగలుగుతామో ముందు preliminary గా ఒక అభిప్రాయము నకువచ్చి, ఏ తాలూకాలకు ఆ నీరును సరఫరా చేయగలుగుతామో చూచి వీలయినన్ని తాలూకాలకు తీసుకొని పోవటానికి వీలుచేయడానికి ప్రభుత్వం సిద్ధంగా వున్నది. కొంతమంది చెప్పేది ఎట్లావున్నదంటే, మా తాలూకాలో గుండానే పారాలి, ప్రక్క తాలూకాలోకి పోవటానికి వీలుకాదు, మా జిల్లాలో గుండానే పోవాలి, ప్రక్క జిల్లాలకు పోవటానికి వీలుకాదని అంటున్నారు. ఈ విధంగా మాట్లాడితే ఎట్లాగు? అటువంటి రకరకాల అభిప్రాయలతో మాట్లాడితే, ఇక యీ ప్రాజెక్టుయొక్క ఫలితాన్ని మనము సరిగా పొందలేము. చేసిన కార్యక్రమమంతా వృధాఅనేచెప్పాలి. ఇప్పుడు తుంగభద్ర ఎగువ కాలవవున్నది. అది మైసూరు ప్రావిన్సులోవున్న బళ్లారి తాలూకాలో సుమారు లక్ష ఎకరాలకు ఆ నీరు పారవలసివుంది. తరువాత ఆ కాలువ ఉరవకొండ, కళ్యాణదుర్గము, రాయదుర్గం ఆ ప్రాంతాలకు వెళ్ళి, అటుపైన పెన్నా నదిద్వారా పులివెంగ్ల, జమ్మలమడుగు తాలూకాలోని ప్రాంతాలకు పోవాలని వున్నది. ఈ విధంగా యీ స్కీము original గా తయారు చేయ

బడ్డది. దీన్ని మేము ఏర్పాటు చేసినదికాదు. ఎప్పుడో పూర్వపు రోజులలో మెకంజీ, యింకా ఎవరెవరో పెద్ద పెద్ద యింజనీర్లు ఆ ప్రాంతమంతా పరిశీలన చేసిన తరువాత ఓం ప్రథమములో ఏర్పాటుచేసిన స్కీముయిది. ఈ స్కీమును అనుసరించే వీలుఅయినంతవరకు నీరు తీసుకొని పోయేదానికి ప్రభుత్వము ప్రయత్నిస్తున్నది. అక్కడ ఎగువ కాలువకు కట్టిన తూములను బట్టిచూస్తే అక్కడ నాలుగువేల క్యూసెక్కుల నీరు మాత్రమే తీసుకొని పోవడానికి వీలు అవుతుందని తెలుస్తున్నది. అంతేకాదు. డాముకు నిండా నీరువుంటే, యింకా జాస్తిగానే నీరు తీసుకొని పోవచ్చు. కాని ఈ డాము ఎల్లప్పుడు నిండుగా వుండదుగదా! అందువల్ల యిటువంటి యిబ్బంది లేకుండా వుండటానికి అక్కడే ఒక reservoir ను కట్టినట్లయితే, నీరు యింకా ఎక్కువగానే తీసుకొనిపోవటానికి వీలు కలుగుతుందని తెలుస్తున్నది. నాలుగువేల క్యూసెక్కులనీరుతో నాలుగు అయిదులక్షల ఎకరాల భూమికి నీరు పారుదల చేయించుకోవచ్చు. ఈ నాలుగు లక్షల ఎకరాలు అనంతపురము తాలూకాలోనే వున్నది. లేకపోతే యింకా పెనుకొండ ప్రాంతంలో కొంతభూమి వున్నది. కనుక ఆ ప్రాంతములోనే నీరును పూర్తిగా వుపయోగించుకుంటామని అంటే, అది న్యాయముకాదు. మనకు వీలయినన్ని చోట్లకు సరిసమానంగా నీరు పారేటట్లు చూడాలి. అందులో యిది original గా ఏర్పాటు చేసినది. ఆ కాలములో మెకంజీ, యింకా ఎవరెవరో పెద్ద పెద్ద యింజనీర్లు ఏర్పాటుచేసిన స్కీము గనుక ఈ ప్రాంతము, ఆ ప్రాంతము అని అభిప్రాయభేదాలు తెచ్చుకొంటే, దేశానికి క్షేమంకాదని నేను కొంతమందిమిత్రులకు సలహాయిస్తున్నాను. సిద్ధేశ్వరం ప్రాజెక్టువస్తేగాని సోమశిలకు నీరు సప్లయిచేయటానికి వీలుండదు అని చెప్పారు.

అన్ని జిల్లాలవారు కలసి మాకు సిద్ధేశ్వరము ప్రాజెక్టు కావాలి అనే దీక్షతో ప్రయత్నము చేస్తే తప్ప యీ plan లో కాదు గదా! రెండవ పంచవర్ష ప్రణాళికలో కూడ దీన్ని తెప్పించుకోవడం అసంభవమైన పనే. నందికొండకు 122 కోట్ల రూపాయలు యిచ్చి, తుంగభద్ర ఎగువ కాలువకు 20 కోట్లు యిచ్చి, వంశధారకు 12 కోట్లు, యీ విధంగా యీ మూడింటికి డబ్బు దాదాపు 160 కోట్లవరకు యిచ్చినప్పుడు అది తెచ్చుకొని ప్రాజెక్టు కట్టడానికి సిద్ధమైన ప్రభుత్వము యీనాడే యీ సిద్ధేశ్వరం ప్రాజెక్టుకూడా కట్టడానికి డబ్బుకావాలని చెప్పితే ఢిల్లీ ప్రభుత్వము ఒప్పుకుంటుందా? ఒకవేళ ఒప్పుకున్నప్పటికినీ అది సాధ్యముకాదు. ఇంత పెద్దమొత్తము ఆంధ్రరాష్ట్రములో ఖర్చు చేయడానికి ఢిల్లీ ప్రభుత్వము అంగీకరించింది. ఈ సిద్ధేశ్వరం ప్రాజెక్టుగూడా యిప్పుడు కాకపోయినా మరొక పర్యాయము అయినను సాధించుకోవాల్సి ఉన్నది. ఆ ప్రాజెక్టు వచ్చిన నాడు క్షామ ప్రాంతంగావున్న రాయలసీమలో కొన్ని చోట్ల లక్షల ఎకరాలు సాగవుతుంది. 7 లక్షల ఎకరాలనుంచి 10 లక్షల ఎకరాలవరకూ సాగు చేసుకోడానికి వీలు అవుతుంది, అందులో ముఖ్యంగా నెల్లూరు జిల్లాలోని వారికి ఎక్కువగా అంటే 4, 5 లక్షల యకరాలు భూమి సాగు చేయటానికి అవకాశాలు వుంటాయి. ఇది ఇప్పటి programme కాదు. ఎప్పుడో రాబోయే programme. ప్రస్తుతం అసలు జరుపుతున్న ప్రకారం నందికొండ కట్టుతాము. నందికొండ ప్రాజెక్టు దేశానికంతటికినీ పెద్దది. ఆంధ్ర

(Sri N. Sanjeeva Reddi) [21st July 1955

దేశము అభివృద్ధి అయిందని చెబితే కర్నూలు జిల్లావారికి యేమి చెప్పేది? అది ప్రజలను enthuse చేస్తుంది. ఈ ప్రాజెక్టు చాలా పెద్దది. ఎత్తుగూడా 590 అడుగులు వుంటుంది. ఈ మధ్య గవర్నరుతోను Chief Minister తోనూ నేను నందికొండ ప్రాజెక్టు ప్రాంతానికి వెళ్ళి చూచాను. అక్కడ మాకు ఆకొండ పైన Tea కూడా ఏర్పాటు చేశారు. ఆ కొండపైనుంచి అక్కడికి దానిపైన ఇంకొక 120 అడుగుల ఎత్తువుంటుంది. అంటే క్రిందనుంచి 590 అడుగుల ఎత్తుగల డాము యిది. దేశములోవున్న ప్రాజెక్టులలో కల్లా యిదే పెద్దదని చెప్పవచ్చు. కాబట్టి యింతపెద్ద డామును మనము కట్టించుకోవడము నిజంగా యిది సంతోషించ దగ్గ విషయమే. కాని యిది ఆంధ్రదేశమున కంతటికి ఉపయోగపడదు కాబట్టి యిదే రకమైన ఉత్సాహముతో యీ ప్రాజెక్టువల్ల benefit పొందని జిల్లాలవారికి గూడా encouragement యివ్వాలి. Major projects క్రింద 122 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టుతున్నప్పుడు, యితర జిల్లాలవారిని సంతోషించండి అని అంటే అది సాధ్యముకాదు. ఈ ఉత్సాహము ఎంతో కాలముండదు నశించి పోతుంది. ఇతర జిల్లాలవారు గోలచేయటానికి వీలవుతుంది. కాబట్టి medium size irrigation projects కోసం ప్రభుత్వము ఎక్కువ డబ్బు ఖర్చుపెట్టాలనే తలిస్తున్నది. గత సంవత్సరం ఢిల్లీ ప్రభుత్వమునుంచి అప్పు సేకరించాము. అప్పుడు అయిదుకోట్ల రూపాయలతోనే ప్రారంభించిన 17 ప్రాజెక్టులు పూర్తిగా రాలేదు. కొన్ని ప్రాంతాలకు అందుబాటుఅయింది. ఇచ్చిన డబ్బును కొంత ఆ జిల్లాలకు కొంత యీ జిల్లాలకు యిచ్చాము. అందులో విశాఖపట్టణం జిల్లాలో కూడా నాలుగు ప్రాజెక్టులను చేర్చియిచ్చాము. కాని ఏకారణముచేతనో గాని ప్రభుత్వము యిచ్చిన 28 ప్రాజెక్టులలోనూ 17 మాత్రమే approve అయినవి. డబ్బు మాత్రం అప్పుగా అయిదు కోట్లే యిచ్చారు. వెనుకబడిన ప్రాంతాలలో medium size schemes ను అమలు జరిపితే ప్రభుత్వము మంచి వుద్దేశ్యముతో propose చేసినప్పటికినీ గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలోనివి select చేయడం తటస్థించలేదు. దానికి యితర ఆక్షేపణలుగూడా యేమీ తెలుపలేదు. ఆ ప్రాంతాలలో వెనుక బడిన ప్రాంతాలు గూడా వున్నవి. ఆ తరువాత చిన్న చిన్న నదులు గూడా వున్నవి. శ్రీకాకుళం జిల్లాలో వీటినే గడ్డలు అంటారు. వాటికి ఆనకట్టలు కట్టినట్లయితే ఒకటి, రెండు వేల ఎకరాలకు మాత్రమే నీరు సరఫరా చేయటానికి వీలవుతుంది. కాని percentage of land revenue చూస్తే చాలా తక్కువ కావచ్చు. అయినప్పటికినీ ఆ ప్రాంత ప్రజలు కొంత ఉత్సాహ భరితులౌతారు గదా! వారికి project వచ్చిందని ఉత్సాహభరితులౌతారు. ఎందుకంటే మా గ్రామానికి యీప్రాజెక్టు వచ్చింది, అదిమాకు ఆహారము యిస్తుంది, అనే ఆశతో వారు వుంటారు. ఆందోళనను జాస్తిగా పెంచరు. అన్ని జిల్లాలవారికి కొంతసాగు భూమి చూపించాలనే యీ పర్యాయము రెండవ పంచవర్ష ప్రణాళికలో కూడా ఏబది లక్షలో ఇరవై లక్షలో ఇరవై అయిదు లక్షలో అవుతున్నప్పటికి యీ స్కీములకు యింకను వీలయినంత హెచ్చు మొత్తము కేటాయించాలనే ప్రభుత్వము నిర్ణయించింది. కాని ఢిల్లీ ప్రభుత్వము ఎంత మొత్తము యిస్తుందో చెప్పలేము. ఈ మాదిరిగా ప్రాజెక్టులు తెచ్చి ప్రజ

లను తృప్తి పరచాలనేది ప్రభుత్వముయొక్క వుద్దేశ్యముకాదు. మేజరు స్కీములలో అన్నిటికి ఎంత ప్రాముఖ్యము యిచ్చామో చిన్న స్కీములకు గూడా అంతే ప్రాముఖ్యము యిచ్చామని చెబుతున్నాను.

ఇంతకుముందే ప్రారంభించిన ప్రాజెక్టులు కొన్ని వున్నాయి. స్వరాజ్యము రాకపూర్వము కొత్త ప్రాజెక్టులు ప్రారంభించినట్లు మనము వినలేదు. అప్పటి రోజుల్లో percentage of return చాలా ప్రాముఖ్యంగా వుండేది. ఇన్ని లక్షలు రూపాయలు, ఇన్ని కోట్ల రూపాయలు ఈ ప్రాజెక్టుకు గాను మనము ఖర్చుపెట్టితే, దీనివల్ల మనకు ఎంత percent లాభం తిరిగి మనము రాబట్ట గలము, వడ్డీ గిట్టుబాటు అవుతుందా, మనకు ఎంత నష్టము వస్తుంది, ఎంత లాభము వస్తుంది? అని ఆలోచిస్తుండేవారు. స్వరాజ్యము వచ్చిన తరువాత ఆ దృక్పథము మారింది. ఎంత ఖర్చు పెట్టుతున్నాము, ఎంత వడ్డీ వస్తోంది, అనే దృక్పథమే కాకుండా దీనివల్ల ఎన్ని ఎకరాలు సాగవుతోంది, ఎంత మందికి ఉపయోగపడుతోంది, ఎంతమంది ప్రజలు దీనివల్ల సుఖపడుతున్నారు, (ప్రభుత్వానికి నష్టము రావచ్చు, percentage of return 2% కావచ్చు, 1% కావచ్చు) ఎన్ని లక్షల ప్రజానీకము క్షామానికి గురిఅవుతున్నారు, వారందరికి ఇది ఉపయోగపడుతుందా అనే సిద్ధాంతా లన్నిటిని అంగీకరించి ఆ పద్ధతులపైన ప్రాజెక్టులు ప్రారంభించాము. ఇప్పుడు కొన్ని ప్రాజెక్టులు పూర్తి అయినవి. కొన్ని పూర్తి అవుతున్నాయి. హిందూపురం తాలూకాలో మన ఉపాధ్యక్షుల వారి నియోజకవర్గంలో పెన్నారు కుముద్వతి ప్రాజెక్టు పని జరుగుతోంది. 1949 వ సంవత్సరములో నేను మద్రాసు రాష్ట్రంలో మంత్రిగా వున్నప్పుడు మనకు ఇప్పుడు ప్లానింగు మంత్రిగా యున్న కళా వెంకట్రావుగారిచే పేరూరు దగ్గర పునాది రాయి వేయించబడింది. ఒక కోటి ఏబది లక్షల రూపాయలు ఈ ప్రాజెక్టుకు ఖర్చు అవుతుంది. రెండు నెలల క్రిందట నేను అచ్చటకు వెళ్ళి చూచి వచ్చాను. చాలా బాగా పని జరుగుతోంది. అనుకొన్న ప్రకారము పని పూర్తి అవుతోంది. ఈ సంవత్సరము కాకపోయినా కొన్ని నెలలో అది కూడా పూర్తి అయి అక్కడ వున్న క్షామ ప్రాంతంలోని ప్రజలకు 10 వేల ఎకరాలకు నీళ్ళు యివ్వడం జరుగుతుంది. ఇంకా నీరు వుండే ఇతర చెఱువులకు కూడా నీరు పంపడానికి అవకాశాలు వున్నాయి. నేను ప్రకాశంగారి మంత్రివర్గంలో మంత్రిగా యున్న రోజుల్లో నెల్లూరు జిల్లాలోని రాళ్ళపాడు స్కీమును చూచి వచ్చాను. మన ఛీఫ్ ఇంజనీరుగారు ఆ స్కీముకు కొద్ది మార్పులుచేసి అసలు జరిపిస్తున్నారు. దానిని త్వరలోనే పూర్తి చేసుకోగలుగుతాము. భైరవానితిప్ప ప్రాజెక్టు నిర్మించడంలో వున్న ఇబ్బందులనుగురించి చెప్పినాను. ఈ మధ్యనే దాని పని ప్రారంభించాము. కేంద్ర ప్రభుత్వమువారు దానిని మొదటి పంచవర్ష ప్రణాళికలో చేర్చినా కూడ మనము మైసూరు రాష్ట్రముకు ప్రక్కనే వుండటం వల్ల కొన్ని యిబ్బందులకు లోనై మొదటి పంచవర్ష ప్రణాళిక పూర్తి అవుతున్నా ఇంతవరకు దానిని ప్రారంభించకుండా వుండటము చాలా విచారకరము. దానికి administrative sanction యివ్వబడింది. కొన్ని వేలమంది కూలీలు పని చేస్తున్నారు. చాలామంది ఇంజనీర్లు పని చేస్తున్నారు. తొందరగా పని జరుగుతోంది. అది త్వరలో పూర్తి కాకపోవచ్చును. రెండవ పంచవర్ష

ప్రణాళికలో మొదటి 2, 3 యేండ్లలోనైన పూర్తి అవుతుంది. ఇలాంటి ప్రాజెక్టులు అక్కడక్కడ తయారవుతున్నవి. చిన్న చిన్న చెరువుల రిపేర్లు మొదలైనవన్నీ (Revenue Department వారి అధీనంలో వున్నవి కాదు.) మైనరు ఇరిగేషను స్కీములకు, కొత్తగా ఇంకొక category తయారు చేస్తున్నాము. 50 లక్షలో, 40 లక్షలో ఖర్చు అయ్యే మీడియము స్కీములు, లక్ష, రెండు లక్షలు ఖర్చు అయ్యే చిన్న చిన్న ప్రాజెక్టులు పూర్తిచేసే అవకాశాలు వున్నాయి. అటువంటివి కొన్ని వందలు వున్నాయి. వాటి పేర్లు అన్నీ వర్ణించడం బాగుండదు. Revenue Department లో వున్న మైనరు ఇరిగేషను స్కీములు కాకుండా P. W. D. వారి క్రింద వున్నవాటికి ఒక లక్షో, రెండు లక్షలో ఖర్చుపెట్టి మరమ్మతులు చేయగలిగిన చెరువులు, చిన్న చిన్న కాలువలు, ఆనకట్టలు కట్టుకోవడము యిటువంటి వాటి కన్నిటికీ రెండవ పంచవర్ష ప్రణాళికలో డబ్బు యివ్వవలసిందిగా కోరినాము. ఆ కార్యక్రమానికి పూనుకొని ఒక్క మేజర్ స్కీములు, మీడియం స్కీములే కాకుండా మైనరు స్కీములకు కూడా ప్రాముఖ్యము యివ్వాలని కోరుతున్నాము.

వరద నివారణ స్కీము క్రింద కేంద్ర ప్రభుత్వమువారు కొన్ని కోట్ల రూపాయిలు ప్రత్యేకించి, కోసీ నదికి, బ్రహ్మపుత్రా నదికి వరద కట్టలు పోయించడమో, డాములు కట్టించడమో చేస్తున్నారు. "మా రాష్ట్రంలో నదులు పొంగి పట్టణాలకు, ప్రజలకు తీరని నష్టములు కలిగిస్తున్నవి. వాటిని అరికట్టడానికి మాకుకూడా వరదనివారణ నిధిలోంచి కొంత భాగము యివ్వాలని మేము వున్నప్పుడు అడిగాము. బుడమేరు స్కీము, డెల్టా ప్రాంతంలోని కొల్లేరు స్కీములకు గాను 2, 3 కోట్ల రూపాయిలు ఖరీదు అయ్యేవి ఢిల్లీ ప్రభుత్వానికి పంపాము. ఇంకా ఏలేరు, తమ్మిలేరు, తాండవగుప్ప, శారదా ఇలాంటి నదులన్నింటినీ వరదనివారణ స్కీములో చేర్చి పంపాము. వాటిలో కేంద్ర ప్రభుత్వము అన్నీ తీసుకుంటారనే ఆశ నాకు లేదు. తప్పకుండా కొన్ని అయినా తీసుకుంటారు. కాబట్టి ఆ వరద నివారణస్కీములో ప్రాజెక్టులు మనము సాధించడానికి వీలవుతుంది అనుకొంటాను. సోమశిల కూడా దాంట్లో చేర్చాము. అది పెద్ద ప్రాజెక్టు. గోదావరిపైన ఇప్పూరు వద్దగాని యింకెక్కడైనా రిజర్వాయరు కట్టడానికి వీలవుతుంది. తద్వారా వరదనివారణ చేయడానికి కూడా వీలవుతుందని కేంద్ర ప్రభుత్వానికి వ్రాసినాము. మేజరు ఇరిగేషను స్కీము క్రింద ఒకటి, మైనరు ఇరిగేషను స్కీము క్రింద ఒకటి, వరదనివారణ స్కీము క్రింద ఒకటి, ఈ రకంగా విభజించి, ఢిల్లీ ప్రభుత్వము నుంచి ఎన్ని రకాలుగా అప్పులు తెచ్చుకోడానికి వీలవుతే అన్ని రకాలుగా తెచ్చుకునే శ్రద్ధ లేకపోవడమువల్ల ఇన్నాళ్ళుగా వెనుకబడి వున్నాము. ప్రత్యేక రాష్ట్రము లేకపోవడము వల్ల వెనుకబడి వున్నాము. ఒక్క పర్యాయమే వాటినన్నీ సంపాదించుకుంటే బాగుంటుందనే ఉత్సాహంతో, ఆశతో ఈ కార్యక్రమానికి ప్రభుత్వము పూనుకొన్నది. ఉప్పుటేరు, బుడమేరు స్కీములు అమలు జరిపి నష్టము గాని కొల్లేరుకు వరదనివారణకాదు. అందువల్ల ఉప్పుటేరును కూడా తీసుకొని తప్పకుండా పనిచేస్తాము అని చెబుతున్నాను. మన సభ్యులు కొంతమంది మాట్లాడుతూ P. W. D. లో Corruption చాలా ఎక్కువగా వుందని

అంటున్నారు. మనము మద్రాసులో వున్నప్పుడు ముఖ్యమంత్రి శ్రీ రాజగోపాలాచారిగారు Enemy No. 1. కమ్యూనిస్టులు అయినా Enemy No. 2 P. W. D. అని చెప్పారు. ఆయన పూరికే చెప్పలేదు. అందులో సత్యం లేక పోలేదు. ఈ P. W. Department అంతా purify అయిందని చెబితే ఎవరు నమ్మరు. అయినా చెప్పడానికి నేను సాహసించను. ఆ పాత పద్ధతిలో కొంత మార్పు వస్తుందని ఆశమాత్రం నాకు కలుగుతోంది.

ఇప్పుడు ఆంధ్ర రాష్ట్రము వచ్చిన తరువాత చిన్న వయస్సు వాళ్ళు చాలా మంది ప్రమోషనులు సంపాదించుకుంటున్నారు. ఇది నా దేశం అన్న దీక్ష వారికి లేకపోలేదు. పూర్వపు రోజుల్లో ఎగ్జిక్యూటివు ఇంజనీరు కావాలంటే ఎన్నో యేండ్లు పట్టేది. జూనియరు ఇంజనీరుగానే 10 యేండ్లు పడివుంటేగాని, తరువాత ఎప్పుడో అసిస్టెంటు ఇంజనీరు అయి 100 కి 70 మంది అసిస్టెంటు ఇంజనీర్లుగానే రిటైరయ్యేవారు. ఎవరో కొద్దిమంది మాత్రమే ఎగ్జిక్యూటివు ఇంజనీర్లు అయ్యేవారు. సూపరింటెండెంటు ఇంజనీర్లుగా అవడానికి అవకాశమే దొరికేది కాదు. ఇన్నాళ్ళకు మన ఆంధ్రరాష్ట్రంలో ఒకరో ఇద్దరో Superintending Engineers గా రిటైరు అయ్యారో లేదో? ఇప్పుడు అట్లాకాదు. ప్రాజెక్టులు ఎక్కువగా కట్టుతున్న కారణముచేత, మనకు పెద్ద ఇంజనీర్లు కావలసిన అవసరాన్ని బట్టి చిన్న వయస్సులో చాలా వుత్సాహంగా వున్నవాళ్ళు "ఈ దేశం నాది, దీనిని అభివృద్ధిలోకి తీసుకురావడానికి నేను కూడా దీక్షగా పనిచేయాలి" అన్న దీక్షగల యువకులు చాలామందికి ప్రమోషన్లు వచ్చాయి. ఎగ్జిక్యూటివు ఇంజనీర్లుగా దాదాపు 100 మందిని అయినా ప్రమోటుచేసి వుంటాము. వీరు అంతా కూడా 40 యేండ్లు, 30 యేండ్లు మధ్య వయస్సువాళ్ళే. వాళ్ళు బాగా పని చేస్తున్నారు. నాకు తెలిసినంతవరకు, నేను చెప్పగలిగినంతవరకు చాలా వుత్సాహంగా పనిచేస్తున్నారు. సత్ప్రవర్తనతో న్యాయంగా పనిచేస్తున్నారు. అలాంటివాళ్ళు department లో లేకపోలేదు. ఇంకా చెడ్డవాళ్ళు కూడా లేకపోలేదు. కొద్దిగా వుండవచ్చును. మన రాజ్యాంగాన్ని అనుసరించి, మన పద్ధతులను అనుసరించి చెడ్డవాళ్ళు అయినా తగు చర్యతీసుకోడానికి తగిన అవకాశాలు లేవు. నేను ఇప్పుడే కాదు, గడచిన సంవత్సరమే ప్రయత్నముచేశాను. ఇప్పుడుగూడ ప్రయత్నంచేస్తూనే వున్నాను. ఒక Mr. X చెడ్డవాడు అని మనకు తెలుసును. నాకు తృప్తికరంగా తెలుసును, నిస్సందేహంగా తెలుసు. ఫలాన వాడు లంచగొండి అని తెలిసినాసరే ఇప్పుడువున్న రాజ్యాంగ చట్టాన్ని అనుసరించి వెంటనే అతన్ని శిక్షించడానికి అవకాశాలు లేవు. Proof కావాలి, లంచము ఇచ్చినవాళ్ళు చెప్పాలి. దానిని నిరూపించాలి, ట్రిబ్యునలుకు పోవాలి, జడ్జీగారిముందు నిరూపించాలి. జడ్జీగారి తీర్పులో ఇతను లంచగొండి అని చెప్పాలి. తరువాత అతనికి నోటీసు ఇవ్వాలి. అతనికి నోటీసులో గవర్నమెంటు సమాధానము చెప్పాలి. ఇంత అయిన తరువాత శిక్షవేయడానికి వీలవుతుంది. ఇన్ని అడ్డంకులూ దాటి కొందరికి శిక్షవేస్తూనే వున్నాము. ఈ అడ్డంకులు దాటడంలో మనకు లంచగొండి మనిషి అని తెలిసివున్నా కూడా మనం శిక్షించలేని పరిస్థితులు

కొన్ని వున్నాయి. ఇది ప్రత్యేకంగా నేను అనుభవిస్తున్న చిక్కు. నేనే కాదు అన్ని department ల వాళ్ళుకూడా అనుభవిస్తున్న చిక్కు. అవకాశం దొరికి నప్పుడు కఠినమైన శిక్షలు విధిస్తున్నాము. అలాంటి వాడని రక్షించాలని ఎవరికి వుండదు. P. W. D ఒక్క దాంట్లోనేకాదు. ఇంకా సప్లై పోలీసుల్లోకూడా చాలా కఠినమైన శిక్షలు తీసుకున్నాము. ఏ కానిస్టేబులు పైననో చిన్న మేస్త్రి పైననో కాదు. పెద్దవాళ్ళపైనకూడా ఈ చర్యలు తీసుకున్నాము. నామిత్రుడు చెప్పాడు అనిగాని, లేదా పెద్ద అపోజిషనులీడరు చెప్పాడు అనిగాని, లేదా ఒక మంత్రి చెప్పాడు అనిగాని నేను వెంటనే ఎవ్వరిని డిస్‌మిస్ చేయడానికి వీలులేదు. నువ్వు లంచగొండి మనిషివి అని dismiss చేస్తే వెంటనే కోర్టుకు పోవడానికి అతనికి హక్కువున్నది. నాకు వుద్యోగము ఇవ్వండి అని అతను కోర్టుకు వెళ్ళితే వుద్యోగము ఇచ్చితీరాలి. న్యాయంగా శిక్షించండి కాని ఈ రకంగా శిక్షించడానికి వీలులేదు, ఉద్యోగము ఇచ్చి శిక్షించండి అని, ఎవరినైతే మనము dismiss చేశామో అతను వచ్చి అడిగి తీసుకోడానికి అవకాశం వుంది. చట్టాన్ని మార్చాలి. లేకపోతే డెమోక్రసీలోవున్న ఇబ్బందులను తొలగించుకోవాలి. ఇతర సిద్ధాంతాల ప్రకారము రాజ్యాంగాన్ని మార్పుచేసుకుంటే లంచగొండిపని ఎవరుఅయినా ఇద్దరు చెబితేను, మనమనస్సుకు నిదానంగాఅయి, తృప్తికలిగినంతనే అతడిని వెంటనే శిక్షించడానికి వీలవుతుంది. కాని ఇప్పుడున్న చట్టాన్ని అనుసరించి కొందరు ఆరకంగా చేయడానికి వీల్లేకపోవడమువల్ల ఇంకా లంచగొండితనము వున్నది. లంచగొండితనం తగ్గించాలంటే కఠిన చర్యలు తీసుకోవాలి. చట్టాన్ని మార్చాలి. అది పోగొట్టడానికి పూనుకోవాలి. లంచగొండితనము వుందని చెప్పినప్పటికి, నా క్రింది వుద్యోగులను చూడ్డమువల్ల చాలా తక్కువగావుందని నా అనుభవాన్ని బట్టి చెబుతున్నాను. తరువాత ఉద్యోగులలో ఉత్సాహం కూడా వున్నది. ఊరికే ఏదో లంచగొండి కాకుండా, నేను మంచి మనిషిని అని ప్రసిద్ధి, ప్రసిద్ధిగా తిరుగుతూ ఏదో అందరితోనూ మంచిగా వుంటూండటము గాక, "యువకుల్లో నేను ఈ ప్రాజెక్టు నిర్మించాలి, ఈ ప్రాజెక్టు నా లెక్కలోకి జమతీసుకోవాలి, ఇదిగో కడప జిల్లాలో ఈ సగిలేరు ప్రాజెక్టును 50 లక్షల రూపాయలతో నేను కట్టాను, జీవితంలో ఎప్పుడు అయినా మరచిపోకుండా నేను చూడ్డానికి అవకాశం వుండాలి'' అన్న దీక్షతో పని చేస్తున్న Excutive Engineer లు లేకపోలేదు. మన Chief Engineer గారు కూడా, వయోవృద్ధులైనా కష్టపడి పనిచేస్తున్నారు. వారిని మనం ప్రత్యేకంగా మద్రాసు రాష్ట్రంలో ఎప్పుడో రిటైరు అయిన వారిని ఆంధ్రరాష్ట్రానికి తీసుకున్న విషయం మీ అందరికి తెలిసిందే.

ఆంధ్ర రాష్ట్రములో ఉత్సాహవంతులైన యువకు లున్నారు. వారికి అనుభవము కావాలి. వారి నందరిని ఒకే పర్యాయము Chief Engineer లుగా గాని Executive Engineer లుగా గాని సృష్టించలేము. 10 సంవత్సరములు పోయిన తరువాత ఆంధ్ర రాష్ట్రములో ఇంజనీరింగు సర్వీసు ఎట్లా యుండునో నేను ఊహించుకోగలను. ఈ నాడువున్న Executive Engineers 30, 40 సంవత్సరముల మధ్య వయస్సులో నున్నవారు, యువకులు, ఉత్సాహవంతులు,

వారు 10 సంవత్సరాలలో అనుభవము గడించి ఈ ప్రాజెక్టు లన్నియు కట్ట కలుగుదురు. ఈ రోజు కృష్ణా బారేజి నిర్మిస్తున్న ఇంజనీర్లలో సూపరింటెండింగ్ ఇంజనీరు మొదలుకొని క్రిందివరకు ఎంతోమంది యువకులు వున్నారు. వారికి ఒక 10 సం॥ల పాటు అనుభవము చేకూరితే ఆ నాడు ఆంధ్ర రాష్ట్రములో ఇతర రాష్ట్రాలకన్నా ఎక్కువ అనుభవముగల యువక ఇంజనీర్లు ఉన్నారనిపించుకునే అవకాశం ఉన్నది. కాబట్టి భవిష్యత్తును గురించి నాకు చాలా ఆశగా యున్నది. ఇంజనీర్లు ఎందరో తయారవుతున్నారు. పని చేస్తున్నారు. కాని వెంటనే వారిని సూపరింటెండింగ్ ఇంజనీర్లుగా గాని, Chief Engineers గా గాని మార్చడానికి వీలులేదు. వారు తగు అనుభవము గడించుకోవలయును. ఇల్లాంటి పరిస్థితులలో మనము మద్రాసు రాష్ట్రమునుంచి వెంకట కృష్ణయ్యరు గారిని తెచ్చుకున్నాము. ఆ విషయము అందరికి తెలిసిందే. వారుకూడా యువకులకు బాగా ఉత్సాహము కలిగించి, ప్రోత్సాహము ఇస్తూ, వారు చేస్తున్న పొరపాట్లను సరిదిద్దుతూ, వారికి పనినేర్పి ఉత్సాహవంతులుగా తయారు చేస్తున్నారు. ఆ విషయములో వారు ఎక్కువ కృషి చేస్తున్నారనే విషయం అందరికి తెలిసినదే. కొంతమంది సభ్యులు "ఏ డాము దగ్గర ఎన్ని మిలియన్ల క్యూసెక్కుల నీరు పారుతున్నది" అని అడుగుతున్నారు. ఆ విషయములు తెలుసుకోవడానికి నేను ఎక్కువ కృషి చేయను. పెద్ద పెద్ద ఇంజనీర్లే ఒక్కొక్కప్పుడు పొరపాటుపడుతూ ఉంటారు. ఒక్కొక్కతూరి స్కీములు తయారు చేసినప్పుడు రకరకాలుగా తయారు చేస్తుంటారు. పెద్ద పెద్ద ఇంజనీర్లే తికమక పడుతూంటే యిలాంటి వాటినిగురించి నేను సమాధానం చెప్పడము, చాల పొరపాటు అయిన విషయము. ఎప్పుడు అయినా ఏ ప్రాజెక్టు విషయము వచ్చినా నేను details లోకి పోను. అవి తెలుసుకోవాలని ప్రయత్నించను. తెలుసుకున్నా అవి మారుతూంటాయి. మనకు కావలసినది ముఖ్యముగా ప్రాజెక్టు. నీరు ఎల్లా పారుతోంది, ఎన్ని క్యూసెక్కుల నీరు ఉపయోగపడుతోంది అని మాత్రము నేను ఇంజనీర్లను సలహా అడుగుతాను. ఆ సలహావల్ల ఎక్కువ ప్రాంతానికి ఉపయోగపడే ప్రాజెక్టులను మనము తెచ్చుకుంటాము. ఆ రకంగా ఆ నీటిని సద్వినియోగము చేసుకొంటాము.

కాని ఆ విషయములను గురించి లెక్కలు చెప్పమంటే I plead incompetence. నేను ఆ విధముగా శక్తివంతముగా చెప్పలేనని ఒప్పుకుంటాను. అందువల్ల నేను మిమ్ములను క్షమించవలసినదిగా కోరుతున్నాను. మనము ఒక ప్రాజెక్టు కావాలి అని ప్రారంభించాము, ఎన్నాళ్ళలో దానిని పూర్తిచేయాలి. పూర్తి చేయకపోతే ఏమి కష్టాలు కలుగుతాయి, ఎందువల్ల ఇంజనీర్లు దానిని పూర్తి చేయలేక పోతున్నారు, దానిని పూర్తిచేస్తే ఇంకా ఎన్ని ఎక్కువ నీళ్ళు పారుతాయి, అన్న విషయాన్నే మనము అర్థము చేసుకొని administrative గా వారికి సలహాలు ఇచ్చినట్లయితే ఎక్కువ కృషి చేయించుకోడానికి వీలుంటుంది. ఇప్పుడు మీరు సరియైన సలహాలు ఇవ్వండి. మీరు ఎవ్వరు ఏమి సలహా ఇచ్చినా అది మన రాష్ట్రానికి, రాష్ట్రము మొత్తము శ్రేయస్సుకు ఉపయోగపడుతుంది. ఇది ఒక పార్టీయొక్క డబ్బు కాదు. అది మనదేశముయొక్క డబ్బు. దానిని మనము దేశముయొక్క క్షేమము కొఱకు వినియోగిస్తున్నాము. కాబట్టి మనము

(Sri N. Sanjeeva Reddi) [21st July 1955

అంపరము కలసి ఈ ప్రాజెక్టుకడితే ఎక్కువ ఉపయోగము ఉంటుంది. ఆ ప్రాజెక్టుకు ఖర్చుపెడుతున్న డబ్బు వృధాగా పోతోంది. ఈ రకంగా చేస్తే దానిని కంట్రోలు చేయగలము అని మీరు ఏమైనా సలహాలు ఇస్తే వాటిని మేము స్వీకరించడానికి సిద్ధముగా వున్నాము. ఈ విషయాన్ని మీరు మనస్సులో వుంచుకొని, ఆ దృక్పథముతోనే సలహాలను చెప్పండి. ఎస్టిమేట్లను గురించిగాని, జరుగుతున్న ఖర్చుగురించి గాని మనము పలుమార్లు ఆలోచిస్తుంటాము. అందరి సలహాలను తీసుకుంటూ వుంటాము. ఇప్పుడేకాదు. పోయిన సంవత్సరములో కూడా మన ఇంజనీర్లు, మన సెక్రటరీలు, మంత్రులు అందరూకలిసి ఇది ఏవిధముగా జరగాలి అనేదానిని గురించి ఆలోచించి అందరి సలహాలను అడుగుతూ ఉండేవారము. ఇప్పుడు కూడా ఆవిధమైన సలహాలను అడుగుతూనేవున్నాము.

ఈ రోజుఉదయము మేము, గవర్నరుగారు ముఖ్యమంత్రిగారు, Chief Engineer గారు సెక్రటరీ మొదలైన వారందరూ సమావేశమైనాము. అక్కడ నుండియే సరాసరి అసెంబ్లీకి వచ్చాము. మీరు బాగా ఆలోచించి దేశమునకు ఉపయోగ కరమైన సలహాలను చెబితే వాటిని తప్పక స్వీకరించడానికి సిద్ధంగా ఉన్నామని నేను ప్రభుత్వము తరఫున చెబుతున్నాను. ఎక్కడయినా పొరపాటు చెబితే దానిని అంగీకరించి సవరించుకోవడానికి సిద్ధముగా ఉన్నాము. అలాంటి ఉత్తమమైన నిర్మాణాత్మకమైన సలహాలు మీరు ఇవ్వాలని కోరుతూ నేను ఈ డిమాండును ప్రవేశపెట్టుతున్నాను.

Mr. SPEAKER :—The motion before the House is that the Government be granted a sum not exceeding Rs. 1,34,91,300 under Demand VIII-Irrigation.

Sri P. SUNDARAYYA :—Sir, I move :

To reduce the allotment of Rs. 1,34,91,300/- for Irrigation by Rs. ... 100

ముంపు నివారణ స్కీములను, ముఖ్యంగా బుడమేరు, కొల్లేరు ముంపు నివారణ స్కీములు ఆరంభించనందున.

Sri P. SUNDARAYYA :—Sir, I move :

To reduce the allotment of Rs. 1,34,91,300/- for Irrigation by Rs. ... 100

తుంగభద్ర ఎగువ కాల్వను ప్రారంభించనందున.

Sri P. SUNDARAYYA :—Sir, I move :

To reduce the allotment of Rs. 1,34,91,300/- for Irrigation by Rs. ... 100

పూర్వపు జమీందారీ ప్రాంతాలలో చెరువులు, తదితర నీటి పారుదల వసతులకు తగిన మరమ్మతులు చేయలేదు కాన,

21st July 1955]

Sri P. SUNDARAYYA :—Sir. I move:

To reduce the allotment of Rs. 1,34,91,300/- for Irrigation by Rs. ... 100

ఇర్రిగేషను పనులు మరమ్మతులు, డిపార్టుమెంటు ద్వారాగాని లేక స్థానిక స్వపరిపాలనా సంస్థల ద్వారాగాని లేక కార్మిక సహకార సంఘాల ద్వారాగాని చేయించక కంట్రాక్టర్ల మీద ప్రధానంగా ఆధారపడుతున్నది, కాన

Sri K. V. S. PADMANABHA RAJU :—Sir, I move:

To reduce the allotment of Rs. 1,34.91,300/- for Irrigation by Rs. ... 100

(To discuss the failure of the Government to provide for in this Budget for the execution of the KADAKONDA Project in Srungavarapukota Taluk, Visakhapatnam District).

Sri R. B. RAMAKRISHNA RAJU :—Sir, I move:

To reduce the allotment of Rs. 1,34,91,300/- for Irrigation by Rs. ... 100

(To discuss inadequate provision for minor irrigation schemes)

Sri D. GOPALA RAO :—Sir I move :

To reduce the allotment of Rs. 1, 34, 91, 300/— for Irrigation by Rs. ... 100

(To discuss about the maintenance of Eleru system of irrigation)

Sri P. NARASIMHAPPA RAO :—Sir, I move .

To reduce the allotment of Rs. 1, 34, 91,300/- for irrigation by Rs. ... 100.

(To discuss the necessity for Nandivada Project, Palakonda Taluk, Chayanagedda head work, Gopalapuram, Ampili and other villages flood-bank works in Parvatipur taluk)

Sri T. PAPA RAO :— Sir I move :

To reduce the allotment of Rs. 1,34, 91, 300/- for Irrigation by Rs. ... 100

(Sri T. Papa Rao) [21st July 1955

(To discuss about not having taken up Vamsadhara Reservoir construction in Srikakulam District)

Sri C. VENKATASURYANARAYANA RAJU :—

Sir, I move :

To reduce the allotment of Rs. 1,34,91,300/- for Irrigation by Rs. ... 100

[ To discuss about projects (Varaha river) ]

Sri V. VISWESWARA RAO :— Sir, I move :

To reduce the allotment of Rs. 1,34,91,300/- for Irrigation by Rs. ... 100

మురుగు వలన బాధపడుతూ, సాగుచేయు భూములను షార్ట్ కార్పునుండి లాంగ్ కార్పు పీరియడ్‌గా మార్చుటను గురించి చర్చించుటకు.

Sri V. VISWESWARA RAO :— Sir, I move :

To reduce the allotment of Rs. 1,34,91,300/- for Irrigation by Rs. ... 100

గుంటుపల్లి పంపింగు స్కీమును ప్రభుత్వము నిర్వహించుటకు పూనుకొనక పోవటం గురించి.

Sri B. SANKARAIAH :— Sir, I move :

To reduce the allotment of Rs. 1,34,91,300/- for Irrigation by Rs. ... 100

ఉన్న నీటి వనరులను కాపాడుట ప్రభుత్వ బాధ్యత అయి ఉండగా లక్షల ఎకరాలు సాగుకు నీరిచ్చే కనిగిరి రిజర్వాయరు క్రింద రైతులు ఇబ్బందులను గమనించి నెల్లూరు జిల్లా ప్లానింగు బోర్డు సదరు రిజర్వాయరు సప్లయి చానెలు వెడల్పు చేసి రిజర్వాయరు క్రింద తూములు remodel చేయమని ప్యాసు చేసిన తీర్మానాలను అమలు పరచనందులకు.

Sri NAGINENI VENKAIAH :— Sir, I move:

To reduce the allotment of Rs. 1,34,91,300/- for Irrigation by Rs. ... 100

(To discuss regarding project and repairs of irrigation sources in zamin areas and Dasabandam Inams).

21st July 1955]

Sri P. PAMIDESWARA RAO :— Sir, I move :

To reduce the allotment of Rs. 1,34,91,300/- for Irrigation by Rs. ... 100

పంటకాల్వల,మురుగుకాల్వల వసతులనుగురించి చర్చించుటకు.

Sri D. RAMABRAMHAM :— Sir, I move :

To reduce the allotment of Rs. 1,34,91,300/- for Irrigation by Rs. ... 100

1937 సంవత్సరము మద్రాసు ఉమ్మడి రాష్ట్రములో వుండి నప్పటినుండి ప్రజలు కోరుతున్నప్పటికి దేశం మొత్తంపై పెద్ద పెద్ద నీటి వనరుల నిర్మాణం జరుగుతుండినా, కుప్పం నియోజకవర్గములో పారుతున్న పాలారు నదితో శిథిలమైవున్న గిరివా చర్వవద్ద రిపేరు చేయించి సరఫరా కాలువను త్రవ్వించి చెరువులకు నీళ్ళు మళ్ళించుటను గురించి.

Sri D. RAMABRAMHAM :— Sir, I move :

To reduce the allotment of Rs. 1,34,91,300/- for Irrigation by Rs. ... 100

(1) వితోటు చెర్వు క్రింద నిరుపయోగమైయున్న 600 ఎకరముల భూమిని సాగుచేయుటకు వృధాగా పాలారునదిలో పోవు చున్న వరద నీటిని సరఫరా కాలువల ద్వారా చెరువులకు మళ్ళించుటను గురించి.

(2) 25 సంవత్సరములుగా తెగిపోయివున్న సోలోడబల్లి పెద్ద చెరువు వెంటనే మరమ్మతులుచేయించుటకు పూనుకొనుట

Sri G. NAGESWARA RAO :— Sir, I move :

To reduce the allotment of Rs. 1,34,91,300/- for Irrigation by Rs. ... 100

తూర్పు గోదావరి జిల్లాలో బొబ్బర్లంక కాలువ ముఖద్వారా నికి ఎదురుగా గోదావరిలో ఏర్పడిన యిసుక మెట్టలను తొలిగించే విషయము.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—

Sir, I move :

To reduce the allotment of Rs. 1,34,91,300/- for Irrigation by Rs. ... 100

(To impress upon the Government :—
to expedite the laying of the foundation stone of Nagarjunasagar Project-)

Sri A. BHAGAVANTHA RAO :—Sir I move :

To reduce the allotment of Rs. 1,34,91,300/- for Irrigation by Rs. ... 100

(To impress upon the Government that the proposal of Bepalle Drain Straight cut and Bhattiprolu Drain straight cut in Repalle Taluk be expedited)

Sri T. GOPALAKRISHNAYYA GUPTA:—Sir I move:

To reduce the allotment of Rs. 1,34,91,300/- for Irrigation by Rs. ... 100

(Restoration of small tanks and construction of a reservoir across river Bahuda in Madanapalle Taluk.)

Sri S. VEMAYYA :— Sir I move :

To reduce the allotment of Rs. 1,34,91,300/- for Irrigation by Rs. ... 100

కలాసులకు జీతములు పెంచకపోగా వారిని పీటికి మాటికి మార్పు చేయుచున్నందులకు, వారిని స్వంత పనులకు ఉపయోగించు చున్నందుకు.

Mr. SPEAKER :—Now the main demand and the cut motions are before the House for discussion.

Sri K. V. S. PADMANABHA RAJU :— అధ్యక్షా ! ప్రస్తుతం ఈ ఇరిగేషను డిమాండుమీద మాట్లాడ్డానికి నాకు ప్రప్రథమంగా అవకాశం ఇచ్చినందుకు మిమ్మల్ని అభినందిస్తున్నాను.

Sri R. B. RAMAKRISHNA RAJU :—

May I suggest to you that those members from the Opposition who have given notice of cut motions may be asked to speak first.

Mr. SPEAKER :—No, that will be all one-sided debate. That procedure will be blocking other members from participating in the debate. Already the other day one hon. Member said that he was not getting any opportunity to speak.

Sri R. B. RAMAKRISHNA RAJU :—What I am suggesting is, every member who has given notice of cut motion may be called to speak first, and they may be allowed ten minutes to speak.

Mr. SPEAKER :—What about other members? Are they to be denied an opportunity to speak. I am afraid they may not get an opportunity to speak on the main motion, if I am to call all members who have given notice of cut motions.

Sri R. B. RAMAKRISHNA RAJU :—So far as I know members sitting on the Government side should not give cut motions.

Sri P SUNDARAYYA :—అధ్యక్షా! పార్లమెంటరీ సాంప్రదాయం ప్రకారం బ్రిటిషు పార్లమెంటులో వున్న అన్ని సాంప్రదాయాలను మనంఅనుసరించ వలసిన అవసరం లేదు. మన కార్యనిర్వహణ కోసము మనకుతగిన rules చేసుకోవాలి. ఢిల్లీలో budget cut motions వచ్చినపుడు యిరుపైపుల వాళ్ళు cut motion యిస్తారు. Cut motions యిచ్చిన వాళ్ళే మాట్లాడాలి అంటే యిక్కడ వున్న 196 మందిచేత cut motions యిప్పించే స్థితి వస్తుంది. 196 మంది మాట్లాడాలంటే 15 రోజులు యిచ్చినా సాధ్యంకాదు. మనం అనుసరించే పద్ధతే సరిగా వున్నదని ఆరకంగా కొనసాగించాలని కోరుతున్నాను.

Sri R. B. RAMAKRISHNA RAJU :—మేమే మాట్లాడాలి అని అనడంలేదు. మేము ముందు మాట్లాడిన తరువాత వారిని పిలువవచ్చును.

Mr. SPEAKER :—Why that priority in your favour. Why that priority at all. I say, I shall call those who have given cut motions according to my discretion.

* Sri K. V. S. PADMANABHARAJU :— అధ్యక్షా, ఇరిగేషను డిమాండుమీద చర్చించ బోయేముందు, ఒక విషయానికి సంతోషించ వలసియున్నది. ఆంధ్రరాష్ట్రానికేగాక భారతదేశానికంతకు ముఖ్యమైన నందికొండ ప్రాజెక్టును మనం ఈ నాటికైనా సాధించగలిగాము. దానికి ప్రయత్నంచేసిన ప్రభుత్వానికి, గవర్నరు regime లో దాని ప్రాముఖ్యతను గమనించి ప్లానింగుకమిషను తో Central Govt. తో సంప్రదింపులలో ప్రముఖపాత్ర వహించి శ్రద్ధ తీసుకున్నందుకు గవర్నరు త్రివేది గారికి అభివందనాలు తెలుపుతున్నాను. డిప్యూటీ ముఖ్యమంత్రిగారు ఈ డిమాండు introduce చేస్తూ దీర్ఘమైన ఉపన్యాసం ఇచ్చారు. వారి ఉపన్యాసం debate జరిగినతరువాత ఇచ్చే జవాబు మాదిరిగా major, minor, medium ప్రాజెక్టులను గురించి వారు చేసిన కృషిగురించి మనముందు పెట్టారు. ఈ నాడు మనరాష్ట్రానికి సంబంధించిన పెద్ద ప్రాజెక్టులు నందికొండ, రామపాదసాగరం, సిద్దేశ్వరం మొదలైనవి వున్నాయి. ఇవి ఎప్పటికైనా తయారుచేసుకోవాలి. ఈ నాడు రాష్ట్రం ఆహారధాన్యాల విషయంలో సమృద్ధంగా వున్నదా లేక క్షామ పరిస్థితులు వున్నాయా అనేది ప్రధాన సమస్య. గవర్నమెంటు పాలసీ ఆహారపరిస్థితి విషయంలో ఎట్లావున్నది, దేనిని ముందుతీసుకోవాలి, దేనికి priority ఇవ్వాలి అనే దానిలో ఖచ్చితమైన అభిప్రాయం వుండాలి. నీలం సంజీవరెడ్డిగారు మాట్లాడుతూ ప్రాజెక్టుల విషయంలో నందికొండ high level channel విషయంలో ప్రాంతీయ అభిమానాలు చాలావరకు బయలు దేరాయి, వాటిని సహృదయతతో విచారించాలి అని చెప్పారు. నేను ఒకటి చెబుతు

న్నాను, వారిలో ప్రాంతీయాభిమానంలేదు. గత ప్రభుత్వంలో వంశధార high level channel, నందికొండ మూడింటికి ప్రాధాన్యత ఇచ్చారు. ప్రభుత్వం తీసుకునే నిర్ణయాలు సరియైన నిర్ణయాలుగా లేకపోతే ప్రాంతీయాభిమానాలు తేవతీస్తారని మనవిచేస్తున్నాను. ఉదాహరణకు రామపాదసాగర ప్రాజెక్టువున్నది. ఏనాడో నిపుణులు పరిశీలించారు. ఆ నాడే దాని ఆవశ్యకతను గుర్తించారు. దానిమీద కోటి రూపాయలు అప్పటిప్రభుత్వం కేటాయించారు. కొన్ని లక్షలు ఖర్చుచేసారు. 1948 లో దానిని ఆపుచేసారు. ఏది ముందు, ఏది వెనుక అనేదాని మీద ఒక సరిఅయిన నిర్ణయంతీసుకుంటే ప్రాంతీయ అభిమానాలు ప్రజలలో కల్గడానికి అవకాశంలేదు. అందుచేత ఈ వేళ నందికొండ తీసుకున్నారంటే ఆంధ్రదేశంలోని ప్రజలందరూ సంతోషించారేకాని రామపాదసాగరం గాని మరొకటిగాని రాలేదని బాధపడరు. పెద్ద ప్రాజెక్టుల విషయంలో ఒకసలహా చెబుతున్నాను. ఈ వేళనే రామపాదసాగరం తీసుకోవాలని నేను చెప్పడంలేదు. దానిని గురించి ఏనాటికైనా ప్రాధాన్యత ఇవ్వాలి.

నూతనంగా వచ్చిన రిపోర్టునుబట్టి చూస్తే ఇచ్ఛంపల్లి దగ్గర కడితే power కు irrigation కు బాగుంటుందని, హైదరాబాదు, ఆంధ్ర, మధ్యప్రదేశ్ ప్రాంతాలకు ఉపయోగంగా వుంటుంది అని సలహా వచ్చింది. కాబట్టి ఈ మూడు ప్రభుత్వాలు కలిసి దీనిని గురించి సహృదయంతో రావడానికి ప్రయత్నం చేస్తారని ఆశిస్తున్నాను. ఈనాడు తీసుకోవలసిన ముఖ్య సమస్య minor irrigation ప్రాజెక్టులు, రాష్ట్రం మొత్తం మీద చెరువులు, కాలువలు, చిన్న మధ్యరకం ప్రాజెక్టులకు ఎంత ప్రాధాన్యత ఇచ్చారు అనేది ప్రధాన సమస్య. నీలం సంజీవరెడ్డిగారు చెబుతూ నా వుద్దేశం అదే, మధ్యరకం ప్రాజెక్టులకోసం గత ప్రభుత్వంలో 28 స్కీములు కేంద్ర ప్రభుత్వానికి పంపామని చెప్పారు. ఇదినిజమే. నేను ఒకటి అడుగుతున్నాను. కేంద్ర ప్రభుత్వంవారికి 28 ప్రాజెక్టులు పంపి కరువు ప్రాంతాలకు 5 కోట్లు కేటాయించాము అని చెప్పారు.

5 కోట్ల రూపాయలకు సరైన స్కీములు పంపించ వలసిన బాధ్యత యీనాడు ప్రభుత్వముపై నున్నది. ఎన్ని స్కీములను పంపించింది? వారు పంపించిన 28 స్కీములకు ఎంతవుతుంది? వారు పంపించిన స్కీములకు 9 కోట్ల రూపాయలవుతుంది. కేంద్ర ప్రభుత్వము 5 కోట్లు యిస్తే 9 కోట్ల రూపాయల స్కీములు పంపించడంలో గల ఆంతర్యం ఏమిటో తెలియపరచ కోరుతున్నాను. ఈ పంపించిన 28 స్కీములలో విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలకు సంబంధించి చాల అన్యాయం జరిగింది. అది మనం తెలుసుకోవాలి. పంపించిన 6 స్కీములలో గంభీరంగెడ్డ స్కీము, కోటి 20 లక్షల స్కీము, విడిచి పెట్టబడింది. ఎందుకోసం విడిచి పెట్టారని విశాఖపట్నం శాసన సభా సమావేశంలో ప్రశ్నించడం జరిగింది. Investigation కాలేదని కేంద్ర ప్రభుత్వం తిరస్కరించారని చెప్పారు. Investigation కానటువంటి స్కీములు కేంద్ర ప్రభుత్వము నకు పంపించ వలసిన అవసరం ఎందుకు వచ్చింది? దీనిని బట్టి ఎందుకు వదిలారో చూస్తే అర్థమవుతుంది? ఆ రోజున పంపిన స్కీములలో విశాఖపట్నం, శ్రీకాకుళంకు సంబంధించిన 11 స్కీములు Investigation కాలేదన్నారు. ఇప్పటి వరకు investigation జరుగలేదు. పార్లమెంటు సభ్యుడు లేచి పార్లమెంటులో G. L. నందాగారిని ఆంధ్రదేశంలో ఎన్ని ప్రాజెక్టులు తీసుకుని ఎన్ని విడిచారు అని ప్రశ్నిస్తే G. L. నందాగారు చెప్పినదేమిటంటే ఆంధ్ర ప్రభుత్వం ఎన్ని పంపిస్తే

అన్నింటినీ మేము తీసుకున్నాం; దేనినీ మేము విడిచిపెట్టలేదు అని సమాధానం యిచ్చారు. అందులో ఏమున్నదో యీరోజుసరికి తెలియదు. సంజీవరెడ్డిగారు 25 వ తారీఖున కృషి చేస్తున్నాం, ప్రయత్నం చేస్తున్నాం అని చెప్పారు. 26వ తారీఖున పత్రికా ప్రకటనలో ప్రాజెక్టుల క్రిందకు15 కోట్ల రూపాయల ఖర్చు ప్రయత్నం జరుగుతున్నదని చెప్పారు. ఈనాడు తుంగభద్ర, నందికొండ వంటి పెద్ద ప్రాజెక్టులు కొద్ది ప్రాంతాల కుపయోగపడుతవి తప్ప అన్ని ప్రాంతాలకు ఉపయోగపడవు.

పెద్ద ప్రాజెక్టులతోపాటు చిన్న చిన్న ప్రాజెక్టులను తీసుకున్నప్పుడే ఆంధ్ర రాష్ట్రం ముందుకు పోతుంది. 28 ప్రాజెక్టులలోను క్రిష్ణా జిల్లాలోని ప్రాజెక్టు ఒకటి కూడా రాలేదు. కడమ అన్ని జిల్లాలనుంచి వచ్చినవి. ఎందుకంటే, investigation కాలేదంటారు. ఎంతవరకు investigation జరిగింది? Minor irrigation విషయంలో కూడా శ్రద్ధవహించవలసినదని కోరుచున్నాను. జమీందారీల abolition అయిన [illegible] ఆ ప్రాంతాలలోని చెరువులు, కాలువలు మరమ్మత్తు లేకుండా వున్నాయి. ఈ మధ్యతరకం ప్రాజెక్టుల విషయంలో కృషిచేయడంలేదని చెప్పడానికి విచారిస్తున్నాను. సంజీవరెడ్డిగారు, మంత్రివర్గం జాగ్రత్తగా ఆలోచించి విపులంగా చెబుతారని ఆశిస్తున్నాను. ఇప్పుడు మరొక ప్రధాన సమస్య యేమిటంటే, జమీందారీ abolition అయిన తరువాత ఆంధ్రరాష్ట్రంలో rent reduction జరిగిన villages వున్నవి. ఈ rent reduction జరిగిన villages విషయంలో landlords తమకు ఎట్టిసంబంధం లేదంటున్నారు. కలెక్టర్లదగ్గరకు పోతే land-lord దగ్గరకు పొమ్మంటున్నారు. వర్షాలవల్ల యీ rent reduction జరిగిన villagesలోని చెరువులు దెబ్బతిన్నాయి. శ్రీకాకుళం, విశాఖపట్నంజిల్లాలలో వర్షాలవల్ల పంటలు పాడైన రైతాంగం కలెక్టరుగారిదగ్గరకుపోతే land-lords ను అడగండి డబ్బు collect చేయడమే మాకంతు, repair చేసే బాధ్యత లేదు అన్నారు. అందుచేత యివి వెంటనే మరమ్మతు చేయించకపోతే చాల ప్రమాదముంది. వాటిని మరమ్మతు చేయించాలని కోరుతున్నాను. తరువాత 28 స్కీములలో విశాఖపట్నంజిల్లాకు సంబంధించిన ఈ స్కీముల గురించి మనవి చేస్తున్నాను. తాండవ reservoir 60 లక్షలు, వరహా reservoir 10లక్షలు, కడకొండ ప్రాజెక్టు 36 లక్షలు, మేఘాద్రిగడ్డ ప్రాజెక్టు 12 లక్షలు, గుర్రంపాలెంగెడ్డ 8 లక్షలు, గంభీరంగెడ్డ 8 లక్షలు, రూపాయలు అవుతవి. దీని క్రింద వచ్చేటటువంటి సాగు 65వేల ఎకరాలవుతుంది. కడమ 12వేల ఎకరాలున్నటువంటి స్కీములు ఎందుకు ignore చేశారు? ఇంతవరకు investigation ఎందుకు కాలేదు? ప్రత్యేకంగా కడకొండ, కంటికొండ ప్రాజెక్టుల విషయంలో గత Chief Minister గారైన ప్రకాశం పంతులుగారు సాయంత్రం 7గంటలైనా స్థలానికివచ్చి చూచి Second Five Year Planలో తీసుకుంటున్నాం అని చెప్పారు. తరువాత సంజీవరెడ్డిగారు కాళహస్తిలో మాట్లాడుతూ చాలమట్టుకు పని అయిపోయిందని చెప్పారు. సంతోషించాం.

The Hon. Sri N. SANJEEVA REDDI :— కాళహస్తిలోని స్వర్ణముఖి ప్రాజెక్టును రాజగోపాలాచారిగారు మద్రాసు ప్రభుత్వంలో వున్నప్పుడు sanction చేసినారు.

Sri K. V. S. PADMANABHA RAJU :— అది తప్పేమీ కాదు. వారు ప్రజలకు సేవచేసినందుకు అభినందిస్తున్నాను. కాని మానియోజకవర్గాలలోని ప్రజల

సేవ చేయడానికి మాకుకూడా అవకాశం యివ్వాలని కోరుతున్నాను. తరువాత కడకొండ ఆనకట్ట ఎక్కడ కట్టాలి అన్న విషయం స్పష్టంగా లేదు. Technical reports లో కడకొండ స్కీము తామరపల్లె దగ్గర కడితే శృంగవరపుకోట, చోడవరం తాలూకాలకు అది ఉపయోగపడుతుందని, తామరపల్లె దగ్గర కట్టాలని Chief Engineer రిపోర్టున్నది. కాని యిరాగోవున నాదు తెలిపినంతవరకు జరుగుతున్న దేమిటంటే, రేవాడ దగ్గర investigation ప్రయత్నాలు జరుగుతున్నవి. శృంగవరపుకోట తాలూకాలో గాని మరొక దగ్గర కాని ప్రాజెక్టు కట్టడానికి ప్రభుత్వానికేమీ అభ్యంతరంలేదు. రెండు స్థలాలలో ఎక్కడకడితే ఉపయోగపడుతుందో అక్కడ కట్టండి. Minor irrigation works విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహించండి.

విశాఖ, శ్రీకాకుళం జిల్లాలలో, రాయలసీమలో చాల చెఱువులకు మరమ్మత్తు కావలసివున్నది. వీటికి మొత్తం 50 లక్షలు కేటాయించారు. ఎక్కడ సరిపోతుంది? రాయలసీమలోను, విశాఖ, శ్రీకాకుళం జిల్లాలలోను 80, 90 లక్షల రూపాయలు రిపేర్లు సిద్ధంగా వున్నవి. అటువంటప్పుడు మీరు కేటాయించిన 50 లక్షల రూపాయలు చాలవు. కాబట్టి మళ్ళా దానిని మీరు reconsider చేయవచ్చు. Minor irrigation కు మీరు యింకా మొదట ప్రాధాన్యత యిస్తారని ఆశిస్తూ విరమిస్తున్నాను.

Sri Ch. S. R. V. P. MURTY RAJU :— అధ్యక్షా, ఈ ఇరిగేషన్ డిమాండును నేను బలపరుస్తున్నాను. పశ్చిమ గోదావరి జిల్లా విషయాలను గురించి ఇపుడు చెప్పడానికి ఇక్కడ నిలబడ్డాను. వానిలో ముఖ్యంగా మన సంజీవరెడ్డిగారు ప్రధానమైన, దేశంలో ఉన్నతమైన, కొత్త కొత్త projects ప్రారంభిస్తున్నారంటే చాలా సంతోషంగానే ఉన్నది. కాని కొత్తవి కట్టుతున్నారనే ఉద్దేశంతో పాతవి వదలిపెట్టడం మాత్రం న్యాయంకాదని మనవి చేస్తున్నాను. పాతవి వదలిపెట్టకూడదు. వాటికోసం కొత్తవి కట్టమనికూడ నా ఉద్దేశంకాదు. ఇపుడు నీటి పంపకాల విషయంలో ఈ డెల్టాలో జరిగే అన్యాయాలు అర్థంచేసుకొనుటకు సంజీవరెడ్డిగారు దానిలో కొంచెం అనుభవంగలవారినుండి తెలుసుకోవడంలేదని నేను చాల బాధపడుతున్నాను. జరిగిన విషయాలనుబట్టి మాస్తే ఈ నాటికి corruption తగ్గింది అని చెప్తూనూ ఉన్నారు. అంటే కొత్త ప్రాజెక్టులలో కొత్త ఇంజనీర్లు చేరారు కాబట్టి అక్కడ corruption తగ్గి ఉండవచ్చును. కాబట్టి delta లో ఉన్నవారిని ఇక్కడికి తీసుకొని ఇక్కడి వాళ్లను, అక్కడవేస్తే, delta లో కొంత కాలం మేముకూడా బాగుపడుతాము అనే కోరికతో ఉన్నాము. కొల్లేరుప్రాంతంలో ఉన్న సమస్య ఈవేళ మీరు ఆలోచించినట్లయితే-కొల్లేరుకు సరియైన స్కీము ఏ విధంగా వస్తుందిఅంటే-బుడమేరు diversion వల్ల, ఉప్పుటేరుతవ్వకంవల్ల కొంతవరకు పరిష్కారంఅవుతుంది. దానిని చేయవలసిన విధానం ఇంకొకటి ఉన్నది. కొల్లేటి ప్రాంతములో ఉన్న భూములకు సరియైన సాగుకు తీసుకొని రావలసిన బాధ్యత ఈ ప్రభుత్వం ప్రత్యేకంగా తీసుకోవాలి. అదిమాత్రం ఎక్కడా తీసుకొనబడలేదు. ఇది ముఖ్యంగా అర్థంచేసుకొని సంజీవరెడ్డిగారు కొల్లేరుకు తప్పకుండా సహాయపడుతారని ఆశిస్తున్నాను. కొల్లేరులో ముంపు తగ్గించడంవల్ల సాగు ఎక్కువ చేయవచ్చును. అందులో ఉన్న నీరు అవతలికి వెళ్ళడానికి చూడాలి. ఒక బుడమేరు, తమ్మిలేరు రామిలేరు మాత్రమే కాదు. Upland drains కూడా మాకుఉన్నవి. ఇతరంగా delta లో ఉన్న drains

కూడా ఉన్నాయి. వీటన్నిటికి కూడ సరియైన మరామత్తులు చేసి వాటిని తీసుకొని వచ్చి కొల్లేరులో పెట్టినట్లయితే అక్కడ మంచి సంచార కేంద్రాన్ని స్థాపించడానికికూడ సరియైన అవకాశాలు ఉన్నాయి. సంచార కార్యక్రమానికి మొత్తం - కొల్లేరు area 280 చదరపు మైళ్ళు - సుమారు 50 చదరపుమైళ్ళ area తీసుకొని, చుట్టూ ఒక గట్టువేసి దానిలోనికి ఈ drains అన్నీ రానిచ్చి అక్కడనుంచి ఉప్పుటేరు ద్వారా పంపించినట్లయితే మంచిది. ఈ ఏర్పాటు చేయడానికి మూడు లక్షల రూపాయలు సరిపోతుంది. అందులో వచ్చేటటువంటి చేపలు మూలంగా సంవత్సరానికి సుమారుగా 30 లక్షల రూపాయలు సంపాదించడానికి వీలువుంది. సంచార కేంద్రముగా నియమించితే అనేకదేశస్థులు వచ్చి మన ఆంధ్ర రాష్ట్రం కూడ చూడవలసిన ప్రదేశంగా ఏర్పడడానికి వీలు ఉంది. ఇటువంటి పరిస్థితులలో 30 లక్షలు ఖర్చు పెట్టితే, ముంపునష్టమే కాకుండా, దీనివల్ల హెచ్చుభూమి సాగుఅవడానికి కూడ అవకాశం వుంది. ప్రథమ పంటకు సుమారు ఒక లక్ష ఎకరములు సాగు అవుతుంది. రెండవ పంటకు ఈ చెరువులో ఉన్నటువంటి నీరు ఒక లక్ష ఎకరముల సాగుకు పనికి వస్తుంది. ఇటువంటి తేలికైన పనికి 30 లక్షల రూపాయలు ఖర్చుపెట్టితే సాగుకు వచ్చేటటువంటిది రెండులక్షలఎకరములు కనబడుతుంది. దీనివల్ల గవర్నమెంటుకు రెండుపంటలకు కూడ 20 లక్షలరూపాయిలు ప్రత్యేకంగా ఆదాయం వస్తుంది. ఇదేకాదు. ధాన్యంవల్ల చాలాఆదాయం వస్తుంది. మీరు ఖర్చుపెట్టే మొత్తం రైతులమీద వేసి ఇన్ని సంవత్సరాలలో తీర్చుకోమంటే తీర్చుకోడానికి కొల్లేరు రైతులు సిద్ధంగా వుంటారు. ఇది గవర్నమెంటుభూమి. కావలసిన ఖర్చుకుకూడ మీరు దానిని అమ్ముకోండి. అమ్ముకోనేటప్పుడు కూడ ఇపుడు భూములలో వున్నటువంటి రైతులకే, ఆ బీదలకే కొద్ది ఖరీదువేసి ఇచ్చినట్లయితే వారు కొనడానికి సిద్ధంగా ఉంటారు.

ఇంత తేలికైన స్కీము తీసుకొనడానికి ఇంత ఆలస్యం ఎందుకు జరిగిందో నాకు అర్థంకాలేదు. దీనికి ప్రకాశంగారి హయాంలో 1937 లో investigation చేశారు. ఈ విషయమయిన స్కీము తప్పకుండా సంజీవరెడ్డిగారు తీసుకొంటారని, సరియైనటువంటి చర్యలు తీసుకొంటారని నమ్ముతూ ఉన్నాను. ఎర్ర కాలవ స్కీము ప్రత్యేకంగాతీసుకొంటామని మొట్టమొదటినుంచిచెప్పుతూవచ్చారు.ఇందులో ఒకభాగముమాత్రం తీసుకొనడానికి అంగీకరించారు. కొంతవరకైనా చాల సంతోషం. దానివల్ల వచ్చేటటువంటిది లాభం ఎక్కువ. అదేకాదు. ఇపుడు సంజీవరెడ్డిగారు చెప్పినదానినిబట్టి కృష్ణా, గోదావరి, గుంటూరు జిల్లాలలో backward areas తక్కువ అని అనుకొంటున్నారు. కాదు. Backward areas ఎక్కువ ఉన్నాయి; కాని పండించేభూములు తక్కువ ఉన్నాయి, రెడ్లు పరిపాలనచేసిన ప్రదేశం అది. పంటలు పండేటటువంటి delta లో ఉండే రైతులకే హెచ్చులాభం; రెడ్డిసీమలో ఉన్నటువంటి ప్రాంతాలకు మాత్రం ఎక్కడా కూడ లాభంకలుగదు. ఇదివరకుకూడ అదిరెడ్లు పరిపాలించిన దేశం. అదికూడ మీ రెడ్లదే. కాబట్టి ఒక కన్ను వేయమని చెప్పుతున్నాను. ఇదే కాకుండా మురుగు కాల్వలు ఎక్కువగా తీసుకోక పోవడంవల్ల చాలా నష్టం వస్తున్నది. గోదావరి జిల్లాలో మురుగుకాల్వల పొడుగు ఒక వెయ్యి మైళ్ళు. రెండు వందల మైళ్ళు మాత్రం మరామత్తు చేశారు. మిగతాది మరామత్తు చేస్తే సుమారుగ 30 వేల ఎకరములకు తక్కువ కాకుండా బాగుపడుతుంది.

(Sri Ch. S. R. V. P. Murthy Raju) [21st July 1955

దీనివల్ల ప్రతి ఎకరానికికూడా అనవసరనష్టం ఎక్కువగా వస్తుంది. మురుగు కాలువల పరిస్థితి రాయలసీమలో ఉన్నవారెల్లరకు తెలియకపోవచ్చును. కాబట్టి మా డెల్టాలో ఉన్న కాలువల, మురుగువల్ల చాల నష్టపడిపోతుంటాము. ఆ మురుగు బయటికి పోవుటకు, సదుపాయములు చేస్తే తప్ప ఈ delta లు ఏమి సరిగా పండవని చెప్పుతున్నాను. ఈ delta లలో రైతులు ఒక పంటపండించుకొనగలరంటే, 'మీరు ఇంకొకపంట పండించుకోవాలి, తప్పదు' అని ఒక ప్రశ్న అంటూ ఉంటాము. (B) schedule lands ను గుర్తించి experiment చేసుకుంటాము అని ఆ ప్రదేశాలలో అన్నప్పటికికూడా, స్వాతంత్ర్యం వచ్చినప్పటికికూడా, delta లో రైతు experiment చేసుకొని, ఈ పంటపండుతుందా, లేదా అని చూచుకోడానికికూడా హక్కులేని పరిస్థితి ఈనాడు ఉంది. అనవసరనష్టం ఏ ఏ ప్రాంతములో, ఏ ఏ పంటలు, పండించుకోడానికి వీలుందో, రైతులు స్వంత ఖర్చుమీద పరిశీలన చేసుకోడానికైనా మీరు అభ్యంతరపెట్టుతున్నారంటే, మనకు స్వరాజ్యం వచ్చినదానికి అర్థంలేదని నేను అనుకొంటాను. కాబట్టి దానికి కావలసిన experimental sanctions చేయవలసి ఉంటుంది.

ఇటువంటి పరిస్థితులలో మీరందరు, అంటే ప్రభుత్వం కూడా, కొల్లేరును దృష్టిలో పెట్టుకోవలసిఉంది. పూర్వమునుంచి ఈ కొల్లేరులో వచ్చినటువంటి చేపలవల్లగాని, పండిన పంటవల్లగాని చాలమంది బ్రతికినమాట నిజం. కాని ఇపుడు 1, 2 సంవత్సరాలకు ఒకసారి పండుతుంది; ప్రథమ పంట పోతుంది. రెండవ పంటకు నీరు ఇవ్వడం లేదు. దానికి గాను కొల్లేటిలో ఉన్న భూములకు ప్రత్యేకంగా నీరు ఇవ్వాలి. వాటికి నీరు ఇచ్చిన తర్వాత, మిగతా భూములకు నీళ్ళు ఇవ్వడం అవసరం. ఎందుచేత నంటే, వరదలు ఆగస్టునెలలో రాగానే భూములు వెంటనే మునిగిపోతుంటాయి. ఈలోగా పైరు పెరిగివుండాలి. ఈ పరిస్థితికూడ అర్థంచేసుకోవాల్సిన అవసరంఉంది. ఇటువంటి పరిస్థితులలో కావలసిన సౌకర్యాలు కూడ తప్పకుండా చేస్తారని ఆశిస్తున్నాను. ఇంకొకటి. Delta లో అన్యాయములు జరుగుతున్నాయి. ప్రస్తుతం సంజీవరెడ్డిగారికి, దురదృష్టవశాత్తు, delta అనుభవం తక్కువ. అది మా దురదృష్టం. కాబట్టి వారు ఇప్పటికి అయినా అందులో జరిగే అన్యాయాలు తెలుసుకోవాలి అని నేను కోరుతూ ఉన్నాను. ఏలాగంటే ఒక అన్యాయం జరుగుతున్నది అన్నప్పుడు, వారు ప్రత్యేకంగా కొత్త project పెట్టినపుడు, ఎంత కష్టం అయినా సరే చూడడానికి ఉత్సాహం ఎలా పుట్టుతుందో ఆలాగే ఇదివరకు జరుగుతున్న అన్యాయాలు మేము చెప్పినపుడు స్వయంగా వచ్చి వారు ఒకసారి అయినా చూచినట్లయితే అర్థంకావడానికి అవకాశం ఉంది. దానిని బట్టి తప్పులున్నను వాటిని మేము అంగీకరించుటకు సిద్ధంగా ఉన్నాము. ఇంకా చాలా చెప్పవలసిన విషయాలు ఉన్నాయి. ఎక్కువకాలం తీసుకొనుటకు ఇష్టంలేదు. ఈ demand ను బలపరుస్తున్నాను. ఇంత తక్కువ time లో మాట్లాడడం కష్టం. ఇక ముందైనా, ఎక్కువగా మాట్లాడే వారికి, నాకు ఇవ్వకపోయినప్పటికీ, సరియైన కాలం ఇచ్చి సహకారం చేస్తారని ఆశిస్తున్నాను.

Sri P. NARASIMHAPPARAO :— అధ్యక్షా, ఈ బడ్జెటును గురించి, ఇరిగేషన్ డిమాండును గురించి కొద్దిగా మాట్లాడదలచుకొన్నాను. ఇంతసేపు మన Deputy Chief Minister సంజీవరెడ్డిగారు చెప్పినది చాలా బాగాఉంది. వారిని. నాకు

21st July 1955] (Sri P. Narasimha Appa Rao)

చాలకాలంనుంచి తెలుసును. వారుకూడా చాలా మంచివారు. పనులు చాలా చురుకుతనముగా చేస్తారు. కాని ఇప్పుడు కొన్ని కారణాలచేత, ఈ ఐక్యకాంగ్రెసుచేత అనుకొంటాను, కొంత పరిస్థితి మారింది. అది ముఖ్యమైన విషయం. కారణం ఏమంటే, ఇదివరకు Madras లో మంత్రిగ వారు ఉన్నపుడు అందరిని సమదృష్టితో చూసేవారు. సంజీవరెడ్డిగారు పునాదివేశారు అని అంటే, పని అయిపోయిందిరా అనే రకంలో ఉండేది. కృష్ణుడుకి బలరాముడు ఏమో స్తరుగా సహాయంగా ఉండేవాడో, ఆయన నాగలి పట్టుకుంటే, బలరాముడు ఎంతవరకు వెళ్ళితే, అంతవరకు కాడి వెళ్ళిపోతుండేదట. అదే మోస్తరుగ గోపాలరెడ్డిగారికి వీరుకూడ, సోదరుడుగ ఉండి పూర్తిగ నాగలి పట్టుకొని ఆంధ్రరాష్ట్రం అంతటికికూడ పునాదివేసిపనిచేస్తారని చాల మట్టుకు ఆశించాం. కాని ఐక్య కాంగ్రెసులో కలిసిన కారణంచేత కొద్దిగా మనస్సు మారినది అని అనుకోవలసి వస్తున్నది.

ప్రభుత్వము తాలూకు irrigation పనులు చాలా అధ్వాన్నంగా జరుగుతున్నాయి. సుమారు వందలాది సంవత్సరములనుంచి ఇదివరకు మరమ్మతు పనులు జరుగకుండా ఉండే పరిస్థితులున్నాయి. ఇది ప్రభుత్వ దృష్టికి వచ్చినట్లు కన్పించదు. దీనికి కారణము Irrigation డిపార్టుమెంటులో ఉన్నది. ఆ డిపార్టుమెంటులో ఉన్న లోపాలచేతనే ఇది జరుగుతున్నదని చెప్పకతప్పదు.

ఫలానా పని చేయాలి, ఫలానాపనికి మరమ్మతుచేయాలి అని మినిస్టరు నోటీసుకు గాని Departmental Head యొక్క నోటీసుకుగాని, ఆ డిపార్టుమెంటువారుతీసుకొని వస్తే వారికది తెలుస్తుంది. లేకపోతేవారికది ఎంతమాత్రం జ్ఞాపకం ఉండదు. ఈ పాత పనులను వారి దృష్టికి తీసుక రాకపోవడానికి ఒక కారణమున్నది. కొత్తపనులు వచ్చాయంటే వాటిలో కొంత దుబారా ఖర్చుకు కావలసిన అవకాశం ఉంటుంది. పాత వాటిలో అటువంటి అవకాశం ఉండదు. ఎక్కడైనా కొత్తగా ఒక మనిషి వచ్చినట్లయితే ఆ మనిషినే బాగ చూస్తాము కాని పాతమనిషిని చూసేదిలేదు. కనుక పూర్వంనుంచి ఉన్నటువంటి పనులు ఇప్పుడు చూడడంలేదు. ఉదాహరణకు, సుమారు మూడు సంవత్సరముల క్రిందట పాలకొండ తాలూకాల్లో సుమారు 44 గ్రామాలకు ఉపయోగపడేటటువంటి వాయన్నబట్టె అనేది బొబ్బిలి ఎస్టేటు క్రింద ఉన్నప్పుడు కట్టబడింది. ఈ 44 గ్రామాలకు కాక సిరిపురం ఎస్టేటు, విజయనగరం ఎస్టేటు, కొన్ని అగ్రహారాలు ఇంకా గవర్నమెంటు జిరాయితీలకు కూడ ఈ కాలువ పారుతూ ఉంటుంది. బొబ్బిలి ఎస్టేటు hand over చేయకముందు, వాళ్ళే నీరు సప్లయిచేస్తూ ఉండేవారు. వాళ్ళ తాలూకు Departmental Head ను ఆ channel దగ్గర పెట్టి వాళ్ళచేత పని చేయిస్తూ ఉండేవారు. ఎప్పుడైనా నీరు రాదు అన్నట్లయితే, ఆ గంటలోనే ఆ డిపార్టుమెంటు అక్కడ పనిచేస్తూ ఇన్ని గ్రామాలకు నీరు సక్రమంగా సప్లయిచేస్తూ ఉండేది. ఇప్పుడు దానినుండి గవర్నమెంటుకు 2 లక్షలు రూపాయలు శిస్తు వస్తుంది. కాని ఎస్టేటు hand over అయినది లాగాయితు ఇప్పటి వరకు ఆ బట్టెను ఎవరు చూసే దిక్కులేదు. దాన్ని గురించి కలెక్టరుతో చెప్పామంటే ఎస్టేటు మేనేజరు దగ్గరకు పొమ్మంటారు, ఎస్టేటు మేనేజరు P. W. D. దగ్గరకు పొమ్మంటారు. P. W. D.వారు Grow More Food Department వారి దగ్గరకు పొమ్మంటారు అంటారు. ఈ విధముగా Departments మాత్రం పెరుగుతున్నాయి గాని పని మాత్రము జరుగడంలేదు.

పోనీ శిస్తులు వసూలు మానేస్తారా అంటే, రెండు పంటలకూ రివిన్యూ వసూలు చేస్తున్నారు. కాంగ్రెసు గవర్నమెంటు వచ్చింది. ఈ ఎస్టేటునుంచి వదులుకొని బాగుపడతాము గదా అని రైతులు చాలా సంతోషించారు. కాని అసలు మొత్తానికే లేకుండా పోయింది. రెండవ పంటకు నీరు లేదు సరికదా, మొదటిపంటకైనా నీరు వస్తుందా అంటే అసలే లేకుండా పోతున్నది. కనుక ఈ విషయాన్ని మంత్రిగారి దృష్టికి తెస్తూ ఈ పని తొందరగా చేయించవలెనని కోరుతున్నాను. రెండవది పాలకొండ తాలూకాలో నందివాడ అని ఒకటి ఉన్నది. నాగావళి వద్దకాదు, నందివాడ వద్ద ఆనకట్ట కట్టాలని representation వచ్చిందని మంత్రిగారు సెలవిచ్చారు. నారాయణపురము ఆనకట్ట గురించి మేము అడివద్దనలేదు. అది తప్పకుండా కట్టవలసిందే. అది శ్రీకాకుళం తాలూకాలో కొంతవరకు పారుతుంది. పాలకొండ, చీపురుపల్లె తాలూకాలకు నందివాడ వద్ద ప్రాజెక్టు కట్టేందువల్ల ఎక్కువగా నీరు పారుతుంది. నందివాడవద్ద ఆనకట్ట, ఒక regulator కట్టినట్లయితే సుమారు 50 వేల ఎకరాల మెట్టభూమి కలిసివస్తుంది. చీపురుపల్లి, పాలకొండ తాలూకాలలో ఉన్న ప్రజలు సుఖిస్తారని మనవిచేస్తున్నాను. [illegible] కట్ట కట్టినట్లయితే,ఇది వేరుగా కట్టనవసరంలేదు. అది అంతటికికూడా సరిపోతుందని మంత్రిగారికి మనవిచేస్తున్నాను.

అంతేకాక, బొబ్బిలిఎస్టేటులో ఇప్పుడు చాలా అగ్రహారాలు, చెరువులు చాలాచెడిపోయినవి. మా పాలకొండ తాలూకాలో అగ్రహారలన్నీ పోయిన సంవత్సరం చాలాచెడిపోయినవి. వాటిని మరమ్మతులు చేయవలసిందని కలెక్టరుకు petition పెట్టుకొన్నప్పటికి ఏమిజరగలేదు. వెంటనేగనుక మరమ్మతు చేసిఉండినట్లయితే 2, 3 వందలరూపాయలతో ఆ పని సరిపోయి ఉండేది. కాని ఇదివరకు చేయలేదు. ఇప్పుడు కాలువలు వచ్చి, వర్షాలు వచ్చి పరిస్థితి ఇంకా అధ్వాన్నం అయిపోయింది. ఇప్పుడు మరమ్మతు చేయవలెనంటే రెండువేల రూపాయలు అవుతుంది. ఈ విధంగా అశ్రద్ధ చేసినందువల్ల చాలా ఎక్కువ డబ్బు ఖర్చు చేయవలసి ఉంటుంది. కనుక అటువంటి emergency work ను P. W. Department వెంటనే తీసుకొని చేయవలసి యుంటుంది. లేకున్న రూపాయతో అయ్యేపనికి వందరూపాయలు అవుతుంది. కనుక అటువంటి emergency పనులు వెంటనే చేయించడానికి Revenue Officers కు powers ఇవ్వవలెనని కోరుతున్నాను. ఆ విధంగా చేయకపోతే, మామూలుగా వాటికి estimates pass అయి, కావలసిన కార్యక్రమము అంతా జరిగి కాగితాలు క్రిందనుంచి పైకి పోయి, sanction అయ్యేపాటికి, ఆ పని అంతా పాడైపోతుంది. దానివల్ల ప్రజలకు ఎక్కువ నష్టము సంభవిస్తుంది. కనుక ఇటువంటి emergency పనులు వెంటనే చేయించేటట్లు Revenue అధికారులకు powers ఇవ్వవలెనని కోరుతున్నాను. ఈ irrigation కొరకు ఖర్చు పెట్టే సందర్భంలో జిల్లావారిగా ప్రతి జిల్లాకు ఇంత అని ఆ మొత్తాన్ని సర్దుబాటు చేస్తే బాగుంటుందని మనవి చేస్తాను. చాలా మందికి ఆ విధమైన అపోహ, అభిప్రాయము ఉన్నది.

క్రిష్ణా, గుంటూరు ఈ రెండు జిల్లాలవారిని చూస్తే ప్రభుత్వానికి భయము. కనుకనే ఆ రెండు జిల్లాలను బాగా చూస్తారు అని ఆ రకంగా అనుకొంటున్నారు. మా జిల్లాకు అటువంటి బలములేదు. లచ్చన్నగారు ఉన్నారంటే, వారు మొన్ననే [illegible] పోయ్యారు. కనుక అధికారంలో ఉన్నవారు తమ జిల్లాల సంగతి మాత్రం చూసుకుంటే

ఇతర ప్రదేశాలు కనుక వస్తాయి కాబట్టి ప్రాంతీయ అభిమానాలు మట్టుకు పూర్తిగా విడిచిపెట్టి అందరిని, అన్ని ప్రాంతాలవారిని సమానదృష్టితో చూడవలసిందని ప్రార్థిస్తున్నాను. ఇప్పుడు నందికొండ ప్రారంభిస్తున్నారంటే మాకేమి సంతోషమేమి లేదు. అది ఆ జిల్లాలవారికి గాని మాకేమి కాదు. మేము దానివల్ల తినేదేమి లేదు. ఈ ప్రాంతీయాభిమానాలు ఎవరికి పట్టుకు వారు చూచుకొంటున్నారంటే, మాకు కూడ మా ప్రాంతాలనుగురించి కొంత సర్దా ఉన్నది. మా ప్రాంతములో కూడ సంజీవరెడ్డిగారు ఒక కాలువను ప్రవ్వించారంటే, మేము, ఆ ప్రజా ప్రతినిధులు అయినందుకు, మా కర్తవ్యం నెరవేర్చిన వాళ్ళవుతాము. తరువాత మేము ఉన్నా లేకపోయినా, రేపు ప్రొద్దున ఎన్నికలు వచ్చినా రాకపోయినా పరవాలేదు. పని మాత్రం అయిపోతుంది. ఆ పేరు ఉంటుంది. ప్రజలు బాగుంటారు. విశాఖపట్నం, శ్రీకాకుళం ఇవి వెనుకబడ్డ జిల్లాలు, వీటికి లక్షలకొలది డబ్బుపెట్టి మధ్యరకపు ప్రాజెక్టులుకూడ కట్టనక్కరలేదు. కొన్ని వేలు ఖర్చుపెట్టి చిన్నచిన్న ప్రాజెక్టులు కడితే చాలును. నందివాడవద్ద ఆనకట్టకు, 30, 40 వేలు అయితే సరిపోతుంది. దానివల్ల 50 వేల ఎకరాలు అవసరంగా కలసివస్తుంది. దానివల్ల కొన్ని అగ్రహారాలు కూడ కలసివస్తుంది. గవర్నమెంటుకుకూడ శిస్తు పెరుగుతుంది. బొబ్బిలి ఎస్టేటు ఉండేటప్పుడు, వాళ్ళు నీళ్ళు ఇచ్చి నెత్తిమీద గుద్ది శిస్తు వసూలు చేసేవాళ్ళు. ఇప్పుడు శిస్తులు మట్టుకు వసూలుచేస్తున్నారుగాని నీరు ఇవ్వడం లేదు. అమ్మ పెట్టదు, అడుక్కొని తిన్నివ్వదు అన్నట్లున్నది. కనుక ఇటువంటి విషయాలలో ప్రభుత్వము ప్రాంతీయాభిమానాలు విడిచిపెట్టి అన్ని ప్రాంతాలకు సహాయం చేయవలెనని కోరుతున్నాను. ఈ ఐక్య కాంగ్రెస్ అనేది మరచి పోయి అందరిని ఒకే దృష్టితో చూడవలెనని మనవి చేస్తూ, ఈ డిమాండును బలపరుస్తున్నాను.

Mr. Speaker :—We shall meet again at 2-30 p.m. to-day. We are cutting short the lunch hour by half an hour.

The House adjourned for lunch to meet again at 2-30 p.m.

(After Lunch—2-30 p.m.)

Sri P. BAPAYYA :—అధ్యక్షా, నూటికి 85 మంది వ్యవసాయకులు కలిగినటువంటి మన ఆంధ్రదేశములో ఈ ఇరిగేషను బడ్జెటు విషయములో ఎవరికి ఆక్షేపణ వుండదని నా అభిప్రాయము. ఎందుచేతనంటే వ్యవసాయకులకు ఇరిగేషన్ బడ్జెటు చాలా ముఖ్యమైనది. అందువల్ల 1 కోటి 34 లక్షల రూపాయిలే కాదు యింకా 2 కోట్లు పెంచి నప్పటికి సంతోషిస్తారు. దీనికి సందేహము లేదు. దీంట్లో దక్షిణ భారతదేశంలో కెల్లా చాలా పెద్దదైన ఆంధ్రుల ఆశాజ్యోతి, నందికొండ ప్రాజెక్టు కూడా వుంది. నందికొండ ప్రాజెక్టు వల్ల 20 లక్షల ఎకరాలు సాగు అవుతుందని మన ముఖ్యమంత్రి గారు వారి బడ్జెటు వుపన్యాసంలో చెప్పారు. 20 లక్షల ఎకరాలే కాకుండా యింకా 30 లక్షల ఎకరాలు కూడా సాగులోకి తీసుకురావడమునకు అవకాశము వుందని తెలుపుతున్నాను. హైదరాబాదు వైపున ఎడమకాలువ ఇదివరకు మున్నేరువరకు ఒక స్టేజిలో వుందని, మరియొక స్టేజిలో కట్టలేరు వరకు వుందని చెప్పబడింది. ఇది గోదావరి నదివరకు పెంచవచ్చునని చెప్పుచున్నారు కొందరు. అట్లా పెంచినట్లయితే నంధిగామ తాలూకా, తిరువూరు తాలూకా, నూజివీడు తాలూకా, పశ్చిమ గోదావరి జిల్లాలో చింతలపూడి తాలూకా ఇంకా మరికొన్ని తాలూకాలు కూడా ఈ నందికొండ ప్రాజెక్టు క్రిందకు రావడానికి అవకాశమువుంది. అప్పుడు దాదాపు ఈ ఘోషఘకాలువవల్ల ఆంధ్ర

దేశంలో 20 లక్షల ఎకరాలవరకు అదనంగా సాగవడానికి అవకాశము వుంది. ఈ 20 లక్షల ఎకరాలు అదనం సాగవాలంటే మన మంత్రివర్గము కొంచెము ఆలోచనతో పని చేయవలసివుంది. ఇది ఏ మున్నేరు వరకో ఆగిపోతుందని ఏ కట్టలేరు వరకో ఆగిపోతుందని అంతవరకే యీ ఎడమ కాలువకు టనల్సు, ఆక్విడేట్సు, సైఫన్సు తయారుచేసి అక్కడవరకే నీరు సప్లయి అయేటట్లు తయారు చేసినట్లయితే తిరువాత వానిని పెంచడానికి అవకాశము లేకుండా పోతుంది. కాబట్టి పెద్ద కాలువలకు అవకాశము కలిగేటట్టుగా ఆ టనల్సు సైఫన్సు ఇవన్నీ ఇప్పుడే తయారు చేసేట్లుగా మన ఉప ముఖ్య మంత్రిగారు చూడాలి. ఈ నందికొండ కాలువ వస్తున్నందుకు చాలా సంతోషము. నేను సంతోషములో కొంత విచారము కూడ తెలియచేస్తున్నాను. ఈ నందికొండ వస్తున్నదనే కారణముచేత నా నియోజకవర్గమునకు సంబంధించి నటువంటి తిరువూరు తాలూకాలో కొన్ని చిన్న స్కీములు ఆపివేయబడినవి. ఈ స్కీములు ఆపివేయడము వల్ల అక్కడి రైతులు చాలా బాధ పడుతున్నారు. సామాన్యముగా నందికొండవంటి పెద్దస్కీము రావడము, ఆ ప్రాంతము అంతా డెల్టా కావడము చాలా సంతోషముతో కూడుకున్న విషయము. ముఖ్యంగా తిరువూరుకు సంబంధించి పడమటి వాగు అని ఒక చిన్న స్కీము వుంది. ఆ స్కీము తిరువూరు గ్రామంలో వున్నటువంటి 7 చెఱువులకు నీరు అందచేస్తున్నది. 1950 వరకు 150 ఎకరాలు మాత్రం ఈ 7 చెరువులక్రింద సాగు అవుతున్నది. ఇక్కడ పాతరాకట్టు ఒకటి వుంది. రైతులందరూ దాని సహాయముతో 40 వేల రూపాయిలు ఖర్చు పెట్టుకొని పడమటి వాగునుంచి ఒక కాలువను త్రవ్వించుకొని ఈ 7 చెఱువులకు నీరు పెట్టుకుంటున్నారు. దానివల్ల ఈ 150 ఎకరాలే కాకుండా అదనంగా 1025 ఎకరాలు సాగులోకి తెచ్చుకున్నారు. 4, 5 సంవత్సరాల నుంచి ప్రతి సంవత్సరము కూడా గవర్నమెంటు వారు డాము కట్టుతారని ఆశపడుతున్నారు. ఎందుచేతనంటే మన గవర్నమెంటు వారు అక్కడ రాకట్టు అనే డాము కట్టే విషయములో హైదరాబాదు గవర్నమెంటుకున్నూ మన గవర్నమెంటుకున్నూ సంప్రదింపులు జరిగినవి. రెండు గవర్నమెంటుల ఇంజనీర్లు కూడా డాము సైటు అంతా పరీక్ష చేశారు. ఒక ఎగ్రిమెంటుకు కూడా వచ్చారని తెలిసింది. అందువల్ల తప్పకుండా డాము కట్టెదరనే వుద్దేశ్యంలో ఇంత ఖర్చు పెట్టుకొని కాలువ త్రవ్వించుకొన్నారు. సాగుబడి కూడా అధికము చేసుకొని ప్రతి సంవత్సరము 5 సంవత్సరములనుంచి గవర్నమెంటు వారికి అధిక సిస్తు వాటరు సెస్సు కూడా ఇచ్చు కుంటున్నారు. ఇప్పుడు ఈ నందికొండ ప్రాజెక్టు కట్టుతున్నారనే కారణముచే ఈ పడమటి వాగు స్కీము ఆపుచేయ బడింనని చెప్పి ఒక ప్రకటన చేయబడింది. అందువల్ల అక్కడి ప్రజలు చాలా నిరాశ చెందుతున్నారు. ప్రభుత్వం యీ పడమర వాగుకు డాము కట్టించుతారనే నమ్మకముతో ఇంత డబ్బు ఖర్చుపెట్టుకొని కాలువ త్రవ్వుకొని హెచ్చు సాగు చేస్తున్నారే తప్ప ఈ డాము కట్టేదిలేదు అంటే ఈ 40 వేల రూపాయలు ఖర్చు పెట్టడము కాని ఇంత భూమి సాగులోకి తీసుకు రావడము కాని జరిగి యుండేదేకాదు. నందికొండవస్తే సంతోషమే కాని ఎప్పుడో 10 సంవత్సరాలకు నందికొండ ఫలితములోకి వస్తే అంతవరకు ఈ 1025 ఎకరాలుకూడా ఎందుకు పనికి రాకుండా పోతుంది. రైతులు ఇంతవరకు పెట్టినఖర్చు అంతా వృధాఅయి, వారు తిరిగి మెట్ట వ్యవసాయము చేసుకోవలసి వస్తుంది. గనుక ఉపముఖ్య మంత్రిగారు మన ఇంజనీరుళతోటి ఆలోచించి నందికొండ వుపయోగములోకి వచ్చేంతవరకు తాత్కాలి

కంగానైనా తిరువూరు గ్రామంలో వుండేటటువంటి ఈ 7 చెఱువులకు నీరువచ్చేమార్గాన్ని ఏర్పాటుచేసి, వాటిక్రిందయుండే 1025 ఎకరాలు నందికొండ వచ్చేవరకు సాగుఅయ్యే దానికి వెంటనే తగు చర్య తీసుకోవలయును.

బుడమేరు డైవర్షను స్కీము వస్తోందని మన ఉపముఖ్యమంత్రిగారు చెప్పారు. చాల సంతోషించవలసిన విషయము. దీనికొఱకు చాలా పట్టుదలగా పనిచేయాలి. ప్రతి రెండు సంవత్సరాలకు ఒకసారి ఆ బుడమేరు ముంపురావడము 60 వేల ఎకరాలు ముంచడము జరుగుతున్నది. దీనిని శ్రద్ధగా ఆలోచించవలయునని కోరుతున్నాను. మరి యొక విషయం. ఈసంవత్సరం జూన్‌లో 10, 15 తేదీలమధ్యలో బాగా వర్షాలు కురిసిన కారణముచేత చెఱువులన్నీ తెగిపోయినాయి. ఇంతవరకు తిరిగి ఆ చెఱువులను మరమ్మతు చెయలేదు. మరమ్మతు చేయడానికి వుద్యోగస్తులు ఇంతవరకు ప్రయత్నమే చేయుటలేదు. ఇప్పుడు వర్షాలు కురిసినప్పటికి కూడా ఆ తెగినటువంటి చెఱువులలో నీళ్ళు నిలవడానికి అవకాశం లేకుండా పోతున్నది. అవి ఇప్పుడు వుపయోగించుకో డానికి వీల్లేని పరిస్థితిలోవున్నారు. వెంటనే మరమ్మతులు చేయించడానికి ఆర్డర్లు యిప్పించవలసిందిగా కోరుతున్నాను.

Sri V. KODANDARAMI REDDI :— అధ్యక్షా! ప్రభుత్వ పాలనములో పేద జనులకు అందరకు శ్రేయోభివృద్ధి కలగవలెననిన వారలకు irrigation సౌకర్యములు కలుగజేయవలెను. నా ఉద్దేశ్యము ప్రభుత్వమును విమర్శించ కుండా వారికి constructive criticism యిచ్చి వాటిని ఆచరణలో పెట్టించడమే అని నేను మనవిచేస్తున్నాను. ఇటీవల బడ్జెటు సమావేశములో K. C. Canal ను గురించి నేను చర్చ చేశాను. నేను ముందుగా K. C. Canal విషయమును ఇటీవల రాజధాని ఇక్కడకు వచ్చినదిలగాయితు మాటలవల్ల తెలుసుకొన్నాను. కాని లోగడ ఈ K. C. Canal నుంచి మానెల్లూరు పెన్నకు కూడా నీటి వసతి కలుగచేయుటకు అవకాశము ఉన్నదని చెప్పిఉన్నారు. అయితే ఇక్కడ తుంగభద్రలో నీరు వదలినగాని పెన్నకు నీరు వచ్చుటకు అవకాశములేదు. K. C. Canal అభివృద్ధి విషయములో అక్కడ ఉండే రైతులు ప్రభుత్వమునకు ఎక్కువ ప్రోత్సాహ మిచ్చెదరని అనుకుంటున్నాను. కాని దీని అభివృద్ధికి మూడు కోట్లు రూపాయలు sanction చేశారు. ఆ మూడుకోట్ల రూపాయలను ఏ విధముగా ఖర్చుపెట్టిన ఎక్కువ మందికి నీరు ఉపయోగపడ గలదోనను విషయమును చూచుకొనవలెను. 3 కోట్లతో కాలువఅంతా cement plasting చేస్తే కాలువలో నీరు యింకిపోకుండా ఉండు నుగదా అని అనుకొనవచ్చు, కాని కాలువను cement plastering చేయకుండా యింకొక ప్రాంతానికి నీరు ఉపయోగపడునట్లు చేసినఎడల బాగుండునని నా ఉద్దేశము. కనుక ఈ విషయమును మంత్రిగారు ఆలోచించవలసినదిగా కోరుతున్నాను. కాని ఖోస్లా కమిటీ రిపోర్టులో తుంగభద్రనుంచి 6000 క్యూసెక్కులనీరు తీసి నెల్లూరుజిల్లా కణుపూరు కావలికాలువలకు కూడా నీరుసప్లయి అగునని ఇచ్చిఉన్నారు. కాబట్టి దానిని ఆ విధంగా ఆచరణలో పెట్టవలెనని కోరుచున్నాను. నెల్లూరుజిల్లా 2 లక్షల ఎకరములు గలిగిన డెల్టా. కాని ఈ 2 లక్షల ఎకరములు పెన్నకు నీరువచ్చినప్పుడే సాగు అగును.

ఈ రోజుకు ఈ 2 లక్షల ఎకరములలో నారు నీరు లేక ఎండిపోవుచున్నది. ఇంకా చాలాచోట్ల నారు తీతలు పూర్తికాలేదు. కృష్ణా, గోదావరి డెల్టాలలో చాల

వరకు నాకు తీరలు పూర్తిఅయినవి. అటువంటి మా జిల్లా సుభిక్షముగా నున్నదనుకొనుట ధర్మముకాదు. నెల్లూరు జిల్లాలో 13 తాలూకాలు ఉన్నవి. 13 తాలూకాలలో కొవ్వూరు తాలూకా తప్ప మిగత తాలూకాలు డెల్టాకు సంబంధించినవి కావు. మా నెల్లూరు తాలూకాకు సంబంధించినవి 3 స్కీములు ఉన్నవి. అవి సోమశిల ప్రాజెక్టు, కనుపూరు, కావలి కాలువలు. సోమశిల ప్రాజెక్టు విషయములో, నందికొండ ప్రాజెక్టు 2 వ దశలో దానికి నీరు వచ్చునని నాకు మంత్రిగారు సెలవిచ్చినారు. కాని కనుపూరు, కావలి కాలువలకు చాలా చిన్న మొత్తములు చాలుననుకొనుచున్నాను. ఆ ప్రాంతములను affected areas క్రింద చేర్చుకొన్న బాగుండునని భావిస్తున్నాను. కాని వాటి క్రింద 30 వేల ఎకరములు సాగుఅయ్యే వీలున్నది. అదీగాక ఇప్పుడు irrigation conference అని 6 మాసాల కొక పర్యాయము జరుగుచున్నవి. ఆ కాన్ఫరెన్సులకు కలెక్టర్లు, ఇంజనీర్లు మొదలగువారు చేరుకుంటారు. అట్లా కాకుండా ప్రతి District కు ఒక Advisory Board, Statutory Board ను ఏర్పాటుచేసి ఆ district కు సంబంధించిన వారినే కనీసము మాసమునకు లేక 2 మాసములకు ఒకసారి సమావేశపరచ గలందులకు ప్రార్థించుచున్నాను. ఆ బోర్డులో M. L. As' ను, యితర officials ను కూడా వేసి ఇవి సమగ్రంగా జరుగుతున్నదా లేదా అని ప్రభుత్వము అజమాయిషీ చేసుకోవాలని నేను కోరుతున్నాను.

*Sri M. RANGAYYA :—అధ్యక్షా ! ఈ ఇర్రిగేషను డిమాండును నేను బలపరుస్తున్నాను. ఈ irrigation scheme లను ప్రాజెక్టులను గురించి సంజీవరెడ్డి గారు చాలా పాటుపడి కృషిచేస్తున్నందుకు నేను హృదయపూర్వకముగా అభినందించు చున్నాను. అంతే కాకుండా minor projects అని, medium projects అని, లేక flood control schemes అని కేంద్ర ప్రభుత్వం వారితో చెప్పి అక్కడ నుంచి డబ్బుపట్టుకొని వచ్చి మన రాష్ట్రములో ఖర్చు పెడుతున్నందుకు వారిని చాలా అభినందించవలసి యున్నది. ఇప్పుడు బాపయ్యగారు చెప్పినట్లు 120 కోట్లు ఖర్చుపెట్టి నందికొండను నిర్మిస్తున్నప్పుడు దాని లాభము పశ్చిమగోదావరికి కూడా చేరేటట్లు చూడాలని మనవి చేస్తున్నాను. నందికొండ left canal ను widen చేసి deepen చేసి extend చేసినట్లయిన అది కృష్ణా జిల్లాలో తిరువూరు, నూజివీడు ప్రాంతములకే గాక చింతలపూడి, కొవ్వూరు, తాడేపల్లిగూడెం తాలూకాలకు కూడా ఉపయోగపడి మరికొన్ని ఎకరములుకూడా సాగు క్రిందకు రాగలదని మనవి చేస్తున్నాను. ఆంధ్ర రాష్ట్రములో జీవనదులైన కృష్ణా, గోదావరి, నదీజలాలవల్ల ఏలూరు తాలూకా భూములు సాగు అవుచున్నవి. కాని గోదావరీ, కృష్ణా కాలువల చివరి భాగమందున్న రైతులు ఇప్పుడు నీరు దొరకక అవస్థపడుచున్నారు. నారు ముదిరిపోయినది. ముఖ్యముగా కొవ్వలి, పోతునూరు, దెందులూరు, గుండుగొలను, చాటపర్రు మొదలగు గ్రామాల వారు అవస్థ పడుచున్నారు. నదులలోని మట్టిని సకాలములో clean చేయకపోవడము వల్ల ఈ విధముగా జరుగుచున్నది. దీని విషయమై P. W. Department కు తెలియపరిచితిమి. కాని P. W. D. higher authorities కు సహాయము చేయ వలెనని ఉన్నప్పటికి subordinates దగ్గరకు వచ్చేటప్పటికి సహాయము వ్యర్థమై పోవుచున్నది. అదీ కాకుండా గోదావరి కాలువను navigation కు ఎక్కువగా ఉపయోగిస్తున్నారు కాని irrigation కు ఉపయోగపడేట్లు చేయడము లేదు

21st July 1955] (Sri M. Rangayya)

గుండుగొల్లు, ఏలూరు మధ్య 400 పడవలున్నవి. అక్కడి నీరును store చేసి తూములు కట్టి ఆపడవలను నడుపుచున్నారుగాని వ్యవసాయదారుల పొలములకు నీరు వదలుట లేదు. కాన అది ప్రభుత్వ దృష్టికి ఈ విషయం తీసుకువచ్చితిని.

అందులో ఇప్పుడు గోదావరి కెనాలులో నీరు లేదు సరికదా, నీరు కావాలంటే కృష్ణా కెనాలునుంచి సప్లయిచేయాలి. అట్లా చేయాలని మమ్ములను కోరారు. కృష్ణా కెనాలునుంచి సీతంపేట ఛానలు పోతుంది. దానికి 9 అడుగుల నీరు వుంటేనేగాని దానిక్రిందవుండే గ్రామాదులు సాగులోనికి రావు. అందుచేత 9 అడుగుల నీటిని అక్కడ వుంచి, మిగతా నీటినిమాత్రం గోదావరి కెనాలుకు సప్లయి చేయవలసిందిగా ఈనియోజక వర్గంలోని రైతులు కోరుతున్నారు. వ్యవసాయ కరణం అయిపోతోంది. ఆకు పాడై పోతోంది. కాబట్టి ఈ విషయం ప్రత్యేకించి మీ దృష్టికి తీసుకు రావలచుకున్నాను. అక్కడవుండే పరిస్థితి "water, water every where but not a drop for irrigation" అన్నట్లుగా వున్నది. ఇటువంటి పరిస్థితి అక్కడ వున్నది కాబట్టే, ఈ విషయం మీ దృష్టికి తీసుకువచ్చి వెంటనే దానికి తగ్గరీతిగా orders ఇవ్వాలని కోరుతూ, ఇతర విషయాలలో మీరుచేసిన సహాయానికి, చూపిన శ్రద్ధకు అభినందిస్తూ విరమిస్తున్నాను.

Sri P. SATYANARAYANA :— అధ్యక్షా, ఇరిగేషను మంత్రిగారు ప్రారంభోపన్యాసంలో ఎక్కడైనా నియోజకవర్గాలలో చిన్న చిన్న పనుల విషయంలో కొన్ని లోపాలు జరుగుతున్నాయనే టటువంటి remarks వుంటే వుండవచ్చును గాని general గా ఆంధ్ర రాష్ట్రములో ఇరిగేషనుకు సంబంధించినంతవరకు సరిగ్గా వుందని అంగీకరిస్తారని అన్నారు. స్థానిక దృష్టితోనే కాకుండా కొన్ని ముఖ్యమైన సూత్రాలు అమలుజరగడం లేదనేటటువంటి charge మాత్రం ఒకటి వున్నది. ఇపుడు అనేక వందల సంవత్సరాలనుంచి మా గ్రామానికి నీరు రావడంలేదు. స్వరాజ్యం వచ్చి 8 సంవత్సరాలయినా ఇప్పటికీ రావడంలేదు. పంచవర్ష ప్రణాళిక వచ్చి నాలుగు సంవత్సరాలైనది. ఇప్పటికీ రావడంలేదనే charge కాదు. కాని గ్రామాలు పేటలు మునిగి పోతున్నాయి. భార్యా పిల్లలతో కొంపలు వదలి గ్రామాలు గ్రామాలు వెళ్ళి పోవలసి వస్తోంది. ఈ రకమైన ముంపులను నివారణచేయలేక పోయినావనే charge సూత్రాలపై చేసే charge కాని స్థానిక అవసరాలను బట్టికాదు. నేను ఒక విషయం మనవి చేస్తాను. మా నియోజకవర్గంలో పిఠాపురం తాలూకాలో రవణక్కపేట, నాగులాపల్లి అనే గ్రామాల్లో సాధారణంగా ప్రతి 5సంవత్సరాలకు 3 సంవత్సరాలైనా ఏలేరు ముంపు రావడం, తుని పైపునుండి వచ్చే ముగ్గురు కాలువలు ఒక point లో కలవడం, వచ్చి మొత్తం అంతా ముంచి వేయడం. గ్రామం అంతా కొన్ని వందల కుటుంబాలు ముఖ్యంగా హరిజనుల పేటల్లో కొన్ని మాసాలపాటు మరొక చోటికి పోవడం, చెట్ల క్రింద బస చేసుకోవడం, ఈ రకమైన బాధలు పడుతున్నారు. ఇది కేవలం స్థానిక సమస్యకాదు. ఇరిగేషను పద్ధతి క్రింద చేసే ఖర్చు ఏ సూత్రం ప్రకారం, ఏ priority ప్రకారం, దేనికి ఇవ్వాలి అనే విషయానికి సంబంధించింది కనుక దానికి ముఖ్యంగా ప్రాధాన్యతఇచ్చి దానిని సవరణ చేయాలని నేను కోరుతున్నాను. అక్కడ 200 ఎకరాలు కలిగిన ఒక భూస్వామి తనకుటుంబానికి [illegible] వుంది వున్న అన్ని కుటుంబానికి కావలసిన ధాన్యాన్ని గత సం॥రం బజారులో కొనుక్కోవలసి వచ్చింది. ఒక 1½ మైళ్ళ

స్థలం పూర్తిగా మునిగి పోయింది. అందుచేత ఈ విషయములో పూర్తి శ్రద్ధ వహించాలని కోరుతున్నాను. దానికి అక్కడ ఈ రెండూ కలిసే point దగ్గర ప్రత్యేకంగా ఒక తూము కట్టి drain off కావడానికి సదుపాయాలు చేయాలని కోరుతున్నాను. ఇదివరకు జమీందారీలు abolition గొడవ ఎప్పుడైతే వచ్చిందో 10, 12 సంవత్సరాల నుంచి జమీందారులు జాగ్రత్తపడి మరమ్మత్తులు వగైరా పనులన్నిటిని అశ్రద్ధ చేశారు. చివరికి జమీందారీలు ఏదో ఒక రకంగా abolish అయిపోయినాయి, ప్రభుత్వము వాటిని స్వాధీనం చేసుకొన్నారు. అప్పటినుంచి యింతవరకు 10, 12 సంవత్సరాలనుంచి కాలవలకు మరమ్మతులు లేవు. కాకినాడ తాలూకా ఉండూరు గ్రామంలో చుట్టు ప్రక్కలవుండే 4, 5 గ్రామాలలో ఇదివరకు వుండే తూములు కప్పబడి నీరు పైనుంచి పూర్తిగా గ్రామాలను ముంచి వేస్తుంది. అక్కడ కూడా వందలకొద్ది కుటుంబాలు బైటకు పోవడం జరుగుతోంది. అందుచేత transition period లో సరి అయిన అజమాయిషీ వుందో లేదో తెలియదు కాని కాలవలకు ప్రక్కన వుండే భూస్వాములు కూడా encroach అయి కాలువలు కుంచపరచేసినారు. అవి బాగా overflow అయి పోతున్నాయి. దాన్వారాకూడా గ్రామాలు మునిగిపోతున్నాయి. ఉండూరు చుట్టు ప్రక్కలవుండే గ్రామాల రక్షణకు encroachmentsను మళ్ళీ సవరణ చేయించ వలసి వున్నది. తరువాత ఒకటి రెండు చోట్ల చిన్న కుడుసొళ్ళ కట్ట వలసిన అవసరము వున్నది. ఆ కాలువను కాస్త లోతు చేయడం చాలా ముఖ్యం. మరొక ప్రధానమైన సమస్య ఏమిటంటే పిఠాపురం తాలూకాలో తూర్పు వైపున సుమారు 35, 45 వరకు గ్రామాలు వున్నాయి. వీటన్నిటికి drainage లేదు. నీరు వచ్చేటటువంటి సదుపాయం లేనందువల్ల ఇంచు మించుగా ఒక 25% ప్రతి సంవత్సరం గత 5 సంవత్సరాలుగా నష్టపోతోందని లెక్కలు తెలిసిన అనుభవం గలిగిన రైతులు చెప్పారు. అందుచేత ఈ ప్రాంతాలలో drainage సదుపాయాలు చేయించాలని కోరుచున్నాను. అన్ని గ్రామాలలో వుండే పెద్ద సమస్యఏమిటంటే వున్న సదుపాయాలన్నీ న్యాయం ప్రకారం, ధర్మంప్రకారం ప్రజాస్వామికంగా సర్దుబాటు కాకుండా పెద్ద భూస్వాముల జబర్దస్తీకిలోనై చిన్న రైతులు అందరూ ఆహుతి అయిపోతున్నారు. ఈ సమస్య విషయమై ప్రభుత్వం ప్రత్యేకంగా శ్రద్ధ వహించి దానికి సంబంధించిన రూల్సును కొంతవరకు alter చేసి తగిన బందోబస్తు చేయకపోతే ఏ విధమైన సదుపాయం వాళ్ళు పొందలేక పోతారు. కొన్ని రూల్సు, సాంప్రదాయాలు, రివాజులు వున్నాయి. వీటిని వేటినీ పెద్ద భూస్వామి పాటించడు. మునసబు, కరణాలకు కబురు పంపిస్తే ఆ మునసబు చాలా చోట్ల భూస్వామి అయి వుంటాడు. భూస్వామి కాకపోతే; భూస్వామికి వ్యతిరేకంగా పేద రైతాంగం తరఫున మాట్లాడ్డానికి ఏవిధమైన ఆస్కారం వుండదు. ఆ భూస్వామి జేబులోనికి వెళ్ళిపోతాడు. ఈ రకమైన బాధలు గ్రామాల్లో చాలా వున్నాయి. అందుచేత నీటిపారుదలకు సంబంధించిన, అజమాయిషీ గ్రామాలలో వుండే పంచాయితీ బోర్డులకు దఖలు చేస్తే ఇప్పుడు వుండే న్యాయంకంటె ఎక్కువ న్యాయం కలుగడానికి అవకాశం ఉంటుందని సూచన చేస్తూ నేను సెలవు తీసుకుంటున్నాను.

*Sri B. V. SIVAYYA:—అధ్యక్షా! ఉప ముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టిన బడ్జెటులో ఆంధ్రదేశానికి బహుళార్థక ప్రయోజనాలు కలిగించే నందికొండ ప్రాజెక్టు

21st July 1955] (Sri B. V. Sivayya)

చేర్చడం చాల సంతోషించ తగిన విషయం. ఆంధ్రదేశంలోనే కాకుండా భారతదేశంలో నున్నటువంటి అన్ని వర్గాలవారు కూడా చాల సంతోషిస్తారని ఆశిస్తున్నాను. అది కేవలం ఒక రైతాంగానికి మాత్రమే నీటి వసరులు కూర్చే ప్రాజెక్టుకాదు. పరిశ్రమలను కూడా అన్నివిధాలా అభివృద్ధి చెందించే ప్రాజెక్టు కాబట్టి అన్ని వర్గాలవారు సంతోషిస్తారని అనుకుంటున్నాను. కాని యీ అవకాశం ఉపయోగించుకొని నేను కృష్ణా Western Division లో ముఖ్యమైన విషయాన్ని మంత్రిగారి దృష్టికి తేదలచుకున్నాను. Krishna Western Division లో పెద నందిపాడు High Level Channel కొఱకు క్రిందటి 20, 30 సంవత్సరాలుగా గుంటూరు మెట్ట ప్రాంతాల వారు చాల ఆందోళన చేస్తున్నారు. Investigation లు ఒకసారి కాదు, రెండుసార్లు కాదు, హెచ్చుసార్లు జరిగినవి. 1951 సంవత్సరంలో చివరిసారిగా చూచి 60 లక్షల రూపాయల estimate తోటి 27 వేల ఎకరాలు సాగవుతుందని యింజనీర్లు అంతా సిఫార్సు చేశారు. కాని యిది చాల చౌకబారయిన scheme. ఎవరూ Barrage కట్ట నక్కరలేదు. కాలువ మాత్రం త్రవ్వినట్లయితే కొద్ది ఖర్చుతో, ఎకరమునకు 200, 210 రూపాయలతో, నీటి వసరులు కల్గించే సౌకర్యంవున్నది. తరువాత యీ స్కీము వేసినటువంటి ప్రాంతంలో మంచినీళ్ళున్న గ్రామం ఒకటికూడా లేదు. అన్నీ చెరువుల మీద ఆధారపడి వున్నవి. సంవత్సరం కాలంలో సుమారు 4, 5 నెలలు వ్యవసాయదారులు, కూలీలు 4, 3 మైళ్ళదూరం పోయి మంచినీళ్ళు తెచ్చుకొనుటకు నానా అవస్థలు పడుతున్నారు. ఆ స్కీము అమలుజరుపుటకు కావలసినటువంటి డబ్బులో మూడవ వంతు 4, 3 వాయిదాలలో మేము చెల్లించుటకు సిద్ధంగా వున్నామని చెప్పి రైతులందరూ కూడా ఆయా కలెక్టర్లు, తహసీల్దారులు, గ్రామాలలో విచారణకు వచ్చినపుడు వారి యొక్క అభిలాషను వ్రాతపూర్వకంగా తెలియజేసుకున్నారు. మాకు నీటి వసరులు ఉపయోగంలోకి రాకుండావున్నాయి, మంచినీరు చాలక అవస్థ పడుతున్నాం యీ బాధ పడలేక 3 వ వంతు యిచ్చుకుంటాం అని వ్రాతపూర్వకంగా వ్రాసియిచ్చారు. ఈ ప్రాంతాలలో మంచినీరు కూడా లేని యీ ఊళ్ళను పూర్వం శూర్పణఖ తిరిగిన రాజ్యంఅని అంటూవుంటారు. కాబట్టి యీ పెదనందిపాడు High Level Channel స్కీమును పెద్ద ప్రాజెక్టులకు, యితర ప్రాజెక్టులకు ముడిపెట్టకుండా సాధ్యమైనంత త్వరలో అమలు చేయవలసినదని నేను విజ్ఞప్తి చేస్తూ శలవు తీసుకుంటున్నాను.

Sri M. HARISCHANDRA PRASAD :— అధ్యక్షా, ఇప్పుడు మన ప్రభుత్వం తలపెట్టినటువంటి ప్రణాళికల, స్కీముల విషయంలో సంతోషిస్తున్నాను, వారిని అభినందిస్తున్నాను. అయితే మన సోదరసభ్యులు చెప్పినట్లు యీ నదులతోపాటు యిదివరలో అసలులో నున్నటువంటి ముఖ్యమైనటువంటి నది అయిన గోదావరిపైన అవసరమైనటువంటి ప్రాజెక్టులు కట్టే విషయం తలపెట్టినందుకు విచారం తెలియపరచవలసి యున్నది. ఆంధ్రదేశంలో హిందూదేశంలో గోదావరినదిపైన ఉత్పత్తి అయ్యే పంట చెప్పుతన్నది. అటువంటిది యీ రోజున సకాలంలో జూన్ నెలలో సాగుబడి కావలసినది ఆగస్టు నెలలోనైనా సాగుబడికాకపోవడం రెండవపంటకు ఆడికావలసిన సమయంలో నీరు దొరకకపోవడంవల్ల సాగుబడి అయినవికూడా నిరర్థకమైపోవడం, రైతులకు చాలనష్టం రావడం అందరికి తెలిసినదే. రైతులు నష్టపోవడమే కాకుండా remission వల్ల గవర్నమెంటుకు ఆదాయంకూడ తగ్గిపోతుందని చెప్పవలసియున్నది. అందువల్ల తప్పనిసరిగా శబరి రిజర్వాయరు కట్టి చింతూరు దగ్గర dam కట్టినట్లయితే కొంత నీటి

ముంపును అరికట్టినట్లయితే ఆవిధంగా మళ్ళా రెండోపంటకు నీటి సదుపాయం వుంటుందని కొంతమంది చెబుతున్నారు. అందుచేత ఆ సదుపాయం చేయడానికి పూనుకోవలసినదిగా కోరుతున్నాను. అదేవిధంగా ఎఱ్ఱకాలువ విషయంలో కూడా కొంత శ్రద్ధ అవసరం. ఎఱ్ఱకాలువ నీటి ముంపు విషయం పశ్చిమ గోదావరిలో నష్టపడినవారందరికి తెలుసును. దీనిని అరికట్టినట్లయితే పంటలు అపారంగా నష్టపోతవి. అందుచేత అదికూడా ప్రభుత్వదృష్టిలో వుంచుకోవలసినదిగా మనవిచేస్తున్నాను. తరువాత నందికొండ విషయంలో కొంతమంది పెద్దలు చెబుతూ ఆ స్కీములో పశ్చిమ గోదావరి జిల్లాలో వెనుకబడిన ప్రాంతాలైన చింతలపూడి తాలూకా, పోలవరం తాలూకా, కొవ్వూరు తాలూకా, తాడేపల్లిగూడెం తాలూకాల ప్రసక్తి లేదని చెప్పారు. ప్రభుత్వంవారు జాగ్రత్తగా ఆలోచించి సాధ్యమైతే తప్పనిసరిగా ఆ వెనుకబడిన ప్రాంతాలను చేర్చవలసినదిగా కోరుతున్నాను. మురుగుకాలువల విషయం కూడా చాలా అశ్రద్ధచేస్తున్నారని చెప్పారు. సాగుబడికి నీరు సప్లయిచేయడం ఎంత అవసరమో మురుగుకాలువ సౌకర్యం కలుగచేయడము అంతకన్న ఎక్కువ ముఖ్యమని గమనించవలసినదిగా కోరుచున్నాను. మా డెల్టా ప్రాంతములలో మురుగుకాలువ సౌకర్యం కలిగించకపోతే చాల పంట నష్టం అవుతుంది. మురుగునీటి సౌకర్యం చేసినట్లయితే percentage of yieldపొదుపు చేయవచ్చు అని మీ దృష్టికి తెస్తున్నాను. పంటను పొదుపుచేయడం వల్ల remssion యిచ్చుటలో ప్రభుత్వానికి నష్టం లేక ఆదాయం వృద్ధి చేసుకోవచ్చు అని మనవిచేస్తున్నాను. తరువాత localization సంవత్సరంలో గోదావరి మీద 1934 ప్రాంతాల్లో కొంతపని జరిగింది. మరల పునర్విమర్శ జరుగలేదు. పశ్చిమగోదావరిజిల్లాలో మేము అనుభవించిన యిబ్బందులుతమదృష్టికితీసుకువస్తున్నాను. తణుకులో పంచదారఫ్యాక్టరీ పెట్టడంకోసం 1934 లో localization చేయడంవల్ల అప్పుడు కొన్నిప్రాంతాలు తెలియక localization B షెడ్యూలులో చేర్చడం, కొంతభాగం C షెడ్యూలులో చేర్చడం జరిగింది.

ఈ B షెడ్యూలులోను, C షెడ్యూలులోను వున్న రైతులు గిట్టుబాటయ్యే ధరకు చెఱకు తోటలు వేస్తున్నారు. వేసినట్లయితే Revenue Department వారు 10 రూపాయలనుంచి 25 రూపాయలవరకు penalty లు వేయగా, ప్రభుత్వ దృష్టికి చాలాసార్లు తీసుకురాగా, ప్రభుత్వం లోగడ stay order యిచ్చారు. ఆ stay order ను vacate చేయడమువల్ల 3 నెలలనుంచి రైతులు సొమ్మంతా ఒకేసారి కట్టడానికి చాల యిబ్బంది పడుతున్నారు. ఆ యిబ్బంది లేకుండా ముందు యీ Localization scheme కు ప్రత్యేకంగా సిబ్బంది వేసి స్కీములు నెరవేర్చవలసినదనీ, ప్రత్యేకంగా industries కి సంబంధం వున్న కొన్ని ముఖ్యమైన ప్రాంతాలలో యిబ్బంది లేకుండా చూడవలసినదిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను. తరువాత sources of irrigation— ఇదివరకు జలాధారాలు వున్నటువంటి వాటిలో ayacut చాల కాలం క్రిందట చేసినది, వాటికి తూములు, తూరలు, improvements చేయుటకు శ్రద్ధ వహించవలసినదిగా కోరుతున్నాను. ఇంతటితో నేను విరమిస్తున్నాను.

*Sri C. SUBBARAYUDU :— అధ్యక్షా ! ఇంతకుముందే మిత్రులు ఆంధ్ర దేశం కేవలం వ్యవసాయ దేశమని అన్నారు. కాని ఇది వ్యవసాయ దేశమైనప్పటికి కూడా

వర్షాలు తక్కువగా ఉండడంవల్ల కరువుకాటకాలతో బాధపడుతూ ఉండే ప్రాంతములో కొన్ని వరదలలో మునిగిపొయ్యే టటువంటి ప్రాంతాలు కొన్ని ఉండడం మనకు తటస్థించినవి. కనుక వ్యవసాయదార్లు అభివృద్ధి కావాలంటే, ఈ రెండు బాధలనుంచి ప్రజలను తప్పించవలసిన కర్తవ్యం ప్రభుత్వంమీద ప్రధానంగా ఉంది. అటువంటప్పుడు ఆంధ్ర దేశంలో ఉండే నదులు ఏవి, మనకు ఉండే జలాధారాలు యేమిటి, అందులో మన భాగం ఏమిటి, దానిని ఏ విధంగా వినియోగించితే యీ రెండు ప్రాంతాల ప్రజలను ఆ బాధలనుంచి తప్పించడానికి వీలు ఉంటుంది అనే దృక్పథంతో ప్రభుత్వం మనకు ఉన్నటువంటి నీటి వనరులను సక్రమంగా ఉపయోగించినట్లయితే, ఆంధ్రదేశం సుఖపడడానికి అవకాశం ఉంటుంది. ఆ ప్రయత్నంతోనే ఆంధ్రరాష్ట్రం వచ్చినతర్వాత ఆంధ్రప్రభుత్వం గట్టిగాను పట్టుదలతోను పనిచేస్తున్నది అనేదానికి ఏవిధమైన సందేహం లేదు. కాని ఇప్పుడు ఉన్నటువంటి పథకాలనుబట్టి చూస్తే ముఖ్యంగా ఈ కరువుతో బాధపడేటటువంటి ప్రాంతాలలో క్రిష్ణనీటినే పారుదల చేయడానికి ఎంతో అవకాశము వున్నది. అంటే అందులో తుంగభద్ర నీరుకూడ కలిసిఉంది. మనకు ఇంకా ఉపయోగించుకోడానికి అవకాశం ఉండే నీరు 475 units అయినపుడు, ఆ ప్రాంతాలకు కావలసిన నీరు, ఏ కాలువగుండా అయితే పారించుటకు వీలు ఉందో ఆ కాలువగుండా ఎంతవరకు వీలు ఉంటే అంతవరకు పారబెట్టడం లేదనిమాత్రం చెప్పక తప్పదు. కర్నూలు, కడప, అనంతపురం జిల్లాలలో క్రిష్ణనీరు పారుదల కానట్టి ప్రాంతాలుకూడ ఉన్నాయి. కర్నూలుజిల్లాలో ఎక్కువ భాగము ఉంది. మొత్తం అనంతపురం జిల్లాలో ఉంది. కడప జిల్లా పులివెందల, జమ్మలమడుగు ప్రాంతాలలో గూడా వుంది అటువంటి ప్రాంతాలకు కొద్ది భాగమైనటువంటి ఈ తుంగభద్ర నీటిని, దిగువ కాలువకు పోగా మిగిలిన దానిని, వీలైనంతవరకు ఎగువ కాలవగుండా ఉపయోగ పెట్టినట్లయితే, ఎక్కువ ప్రాంతమును యీ కరువునుంచి నివారణ చేయడానికి వీలు అవుతుంది. అయితే అది మరి ఏ కారణంచేతనో గాని, సంజీవరెడ్డిగారికి అటువంటి ఉద్దేశం లేదనేది ఎవరుకూడ శంకించడంలేదు. అయినా ఇపుడు ఆ ఎగువ కాలువయందు కూడ capacity నిర్ణయ మందుచూస్తే 4 వేల క్యూసెక్కుల నీరు వచ్చే canal పెట్టడం తటస్థించింది. అందులో ఆరు నెలలు మాత్రమే ఆ ఎగువ కాలవగుండా నీళ్ళు రావడానికి వీలు ఉందని ఇంజనీర్లుకూడా చెప్పుతున్నారు. ఈ అయిదు నెలల్లో, 4 మాసాలులోనే reservoir నిండి క్రిందికి పొర్లిపోవడం తటస్థించింది.

ఖోస్లా కమిటీవారు ఎగువ కాలవ ప్రసక్తి ఎత్తుకోకుండా ఈ reservoir capacityని మాత్రంతీసుకొని, low level canal requirements గా Hyderabad భాగములో 65 units పెట్టుకొని మిగిలిన దానిని surplus గా treat చేసి యీ K.C. Canal ను widen చేసి ఆరువేల క్యూసెక్కులు కావాలని, కనుపూరు కెనాల్ లోకి పారేటట్లు చేయవలెనని వారు చెప్పారు. వారు డాములు చూచారు. ఎగువ కాలవ తూములు చూచారు. ఏ కారణంచేత ఆవిధంగా చేశారో మనకు కొంచెము కూడ అర్థము అగుటలేదు. ఇపుడు ఉండేటటువంటి కాలువలో, నిజంగానే నీరు విపరీతంగా ఇంకి పోతున్నది అనేసంగతిగురించి 1900లో investigation చేశారు, అప్పుడు వెడల్పు చేయ

దానికి ప్రయత్నం చేసినపుడు, ఇది దండుగ, సంఘమేశ్వరం దగ్గర కట్టడం మంచిది అని ఇంజినీర్లు సలహాలు ఇచ్చారు. అయినా ఇపుడు మూడువేల క్యూసెక్కులకు వెడల్పు చేసి, మూడు లక్షల ఎకరాలను ఆయకట్టు క్రిందికి తీసుకొస్తా మంటున్నారు. దానికి మేము ఎవరుకూడా కాదనము. అయితే ఈ lining చేయడం అనేది 73 మైళ్ళ వరకు కూడ చేయండితే, రేపు పొద్దున సిద్ధేశ్వరం కూడా వచ్చినట్లయితే తుంగభద్ర dam site దగ్గర ఉండే నీటిని సంపూర్ణంగా, ఎగువ కాలవ, దిగువకాలువకు, పార పెట్టినట్లయితే, ఆ పొద్దు ఈ K. C. canal లో నీరు 3 వేలు క్యూసెక్కులకుగాని, 4 వేల క్యూసెక్కులకు పైగా గాని ఉండడానికి వీలు ఉంటుందా అనే సందేహం నాకు కూడా ఉంది. అందువల్లనే మొదటనుంచీ కూడ K. C. canal ను 73, 75 మైళ్ళవరకు వెడల్పు చేయడం అనేది సిద్ధేశ్వరం వస్తున్నప్పుడు, అవసరము వుండదు గనుక ఈ తుంగభద్ర నీరు, క్రిష్ణ నీరుతో పారుదల కాని ప్రాంతానికి, ఉపయోగ పెట్టితే, ఎక్కువ భాగము కరవునుంచి రక్షించడానికి వీలు ఉంటుంది. కనుక ఇది సమగ్రమైన పథకంగా ఉంటుందనే దృష్టితో K. C. canal ను widen చేయడం 4 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టడం దండుగ అనేది నా అభిప్రాయమని తెలియచ్చేస్తూనే వస్తున్నాను. గనుక ప్రభుత్వము దీన్ని తాత్కాలికంగా చేస్తారని అంటారా, నిర్దిష్టంగా చెప్పండి. అలాఅయితే నీరు ఎక్కువైతేయింకిపోతుందో అక్కడ lining చేయండిదానికి ఎవరమూ కాదనము. అందువల్ల ఇక్కడ మాత్రం K. C. canal కు అసలంగా రెండు లక్షల ఎకరాలకు నీరు ఇస్తూ, ఈ క్రిష్ణ నీరుతో పారుదల అయ్యే గండికోట ప్రాజెక్టు క్రింద commandable area ఒక లక్ష ఎకరాలకు ఇస్తూ, పైనున్నటువంటి భాగాలకు ఏ నీటి వసరులేని ప్రాంతాలకు నీరు లేదని చెప్పడం అనేటువంటిది, సమగ్రమైన దృక్పథముకాదు, పథకముకాదు. ఈ విధంగా చేసినట్లయితే శాశ్వతంగా చాల భాగములు కరవునుంచి బాధపడవలసి వస్తుంది. అదే విధంగా మద్రాసు రాష్ట్రంపైకి ఏ ప్రాంతములో అయితే వర్షపాతం తక్కువగ ఉందో, ఆ యాడికి ప్రాంతము 50, 60 వేల ఎకరాలు పారుదల, ఆయకట్టు చేయడానికి వీలు ఉండే ప్రాంతం యీనాడు ఎగువ కాలవ క్రిందికి రావడంలేదు. అదే మోస్తరుగా ముద్దనూరు ప్రాంత్యంలో గూడా పారుదల కావడానికి వీలుండేటటువంటి ప్రాంత్యం ముందుకు రావడానికి వీలు లేకుండా పోతుంది. అదేవిధంగా ఆలూరు తాలూకాలో త్రాగటానికి నీళ్ళులేని ప్రాంత్యాలు, యీ ఎగువ కాలవక్రిందకు రాకుండా పోతున్నాయి మద్రాసురాష్ట్రంపైకి వర్షపాతం తక్కువగ ఉండే ధర్మవరం, అనంతపురం తాలూకాలలో అందులో poor soil గా ఉండే ప్రాంత్యములో తుంగభద్ర నీరును సమగ్రంగా ఉపయోగించక పోతే ఎందుకు ఈ project లు అన్నీ కట్టడం ? ఏమి సార్థకం ? ఆ ప్రాంతాలలో ఉండేవాండ్లు బాధ పడుతున్నారంటే అది వాస్తవ మంటారా, కాదంటారా ? అదేవిధంగా కరవు కాటకాలతో ఎల్లప్పుడూ కూడా వాళ్ళు బాధపడేటట్లే చేయదలచారా ? లేకపోతే రాష్ట్రములో ప్రాజెక్టులు కడుతున్నాం, ఒకచోట పండింది పంట, ఆ పంట మనకు చాలు, రాష్ట్రము స్వయంపోషకము అవుతుంది, ఆహారకొరతకూడ లేదు, ఇపుడు surplus area లో ఉన్నాము అని ప్రభుత్వము అనుకుంటే ఎందుకు యిప్పుడు ప్రాజెక్టులు కట్టుతున్నాము ? రాష్ట్రం మొత్తంపైన ఉత్పత్తే కాకుండా, ఒక్క ప్రాంతంలో కావలసిన అవసరాలనుకూడ, అక్కడ ఉండే బాధను అంతాచూచి నప్పుడే మానవునికి body లో అన్ని అంగాలు ఎలా develop అయితే భాగా

ఉంటుందో, అదేవిధంగా రాష్ట్రం అంతా బాగుగ ఉండుటకు అవకాశములు కలుగ తుంది. కనుక ప్రభుత్వమువారు తలపెట్టిన పథకాలు చూచినట్లయితే, ప్రజలకు చాలా మట్టుకు ఆశాభంగము కలుగుతుంది. ఇక మేము ఏదైనా అడిగితే నీళ్ళులేవు అంటారు. నీళ్ళు లేవన్నప్పుడు, ఎంత నీరు ఉంది, ఎంత ఖర్చుచేశారు అని ప్రభుత్వాన్ని అడుగక తప్పదు. ఇక Sanjeeva Reddi గారిని అడిగితే, మాకు ఆ technicalities ఏవీ తెలియవు అని అంటారు. ఇదిఅంతా చూస్తే, చాల బాధాకరంగా ఉంది. ప్లానింగు కమిటీవారికి 8 లక్షల ఎకరాలను గురించి పథకాలను ఎట్లా పంపించారు? ఏ ఆధారం పైన పంపించారు ? పూర్వం investigation చేసిన date పెట్టుకొని, authorities పెట్టుకొని కదా 20 లక్షల రూపాయల ఖర్చుతో 4 లక్షల యకరాలకు పథకాలు ప్లానింగుకమిషనుకు పంపించారు ? ఈనాడు Investigation Divisions కూడా ఏర్పాటుచేశారు. ఆ డివిజన్ను వేసినప్పుడు, ఏ ఏ ప్రాంతాలలో నీరు సంపూర్ణంగా పారటానికివీలువున్నదో పరిశీలించవలసివున్నది. డామువద్దర వున్నటువంటి నీరును ప్రభు త్వముసంపూర్ణముగా దిగువ కాలువద్వారా పారుదలచేసి వుపయోగపెట్టుతున్నారాఅంటే లేదని ఖచ్చితంగా చెప్పక తప్పదు. దానికి K. C. కెనాల్ requirements తీసి పెట్టుతున్నారు. క్రిష్ణా delta క్రింద requirements తీసిపెట్టుతున్నారు. రేపు ప్రొద్దున నందికొండ కట్టినతర్వాత, క్రిష్ణాడెల్టా అవసరంకూడా తీరిపోతుంది. అదే విధంగా ఈనాడు K. C. canal కు తాత్కాలికంగా కావలసిన నీరు వచ్చినా, లక్షా చిల్లర ఆయకట్టుకు కావలసినంత మట్టుకు నీరు వచ్చినా, అదనంగా ఏ 20, 30 యూనిట్లో నీరును యిక్కడ ఉపయోగపెట్టదలచుకొని, అక్కడ నీళ్ళు లేకనడంలో అర్థంలేదు, ఈనాడు నందికొండ నుంచి పులిచింతల ఆయకట్టుకు, కావలి, కనుపూరు కెనాలుద్వారా నీరును ఏ విధంగా సప్లయిచేస్తున్నారో అదేవిధంగా K. C. canal ఆయకట్టుకు రెండులక్షల ఎకరాలకు అదనంగా ఇచ్చేటటువంటినీరు గండికోటక్రింద పారుదలఅయ్యే ప్రాంతానికి ఇవ్వాలి. ఎగువకాలవగుండా పారుదల అయ్యే ఏ ప్రాంతాలయితే ఉన్నాయో వాటికికూడా కెనాల్ alignment విష యంలో investigate చేసి కెనాల్ alignment కూడా చేసినట్లయితే, ఆయకట్టు develop కావటానికి యింకా 10, 15 సంవత్సరాలు పట్టుతుంది. అప్పటికి సిద్దేశ్వరం నుంచి కూడా నీరు తీసుకోండి.

అంతేకాదు. ఇది lined అయినప్పటికి గూడా unlined canal కు ఖర్చు పెట్టినట్లయితే నీరు వృధా అవుతుంది. కాలవకు లైనింగు చేసినట్లయితే నీరు మిగులుతుంది. ఆ ప్రాంత్యాలలో వర్షాలు తక్కువగా వున్నప్పుడు పెన్నలో నుంచి ఒక రిజర్వాయరును ఏర్పాటు చేసుకొని దానిద్వారా నీరును ఆ యా ప్రాంతాలకు supplement చేసుకొనటానికి అవకాశము వుంటుంది గదా ! అదే విధంగా ధర్మవరంతాలూకాలో లక్షముప్పైవేల యకరాలకు నీరుపారుదల కాకుండా పెట్టిన ప్రాంతమునకు ఎప్పుడు అయితే నీరు యిస్తారో అప్పుడే అనంతపురం జిల్లాలో వున్న బుక్క పట్టణము చెరువుకు గూడా నీరు యివ్వటానికి, alternative source చూపించటానికి వీలు అవుతుందిగదా ! Upper Pennar reservoir level ను యింతో అంతో పెంచి అక్కడనుంచి నీరును ధర్మవరం ప్రాంతాలకు సప్లయిచేయాలని అనుకున్నట్లుగా వింటున్నాము. అక్కడ ఏ మాత్రమైనా surplus నీరువుంటే

అనంతపురం జిల్లాలోనే కుంటిపుద్ది నాగసముద్రము చెరువులు వున్నవి. రామగిరి మీదుగా నీరు యితరత్రా పారుదల కోసటువంటి ప్రాంతాలను యీ ఎగువ కాలవగుండా నీరు పారుదల చేయించి నట్లయితే అక్కడ శాశ్వతంగా అక్కడ ప్రజలను కరువుకాటకాలవల్ల బాధపడకుండా శాశ్వతంగా రక్షించినవారు అవుతారు. అదేవిధంగా బైరవాని తిప్ప దగ్గరకూడా ఒక రిజర్వాయరు కట్టినట్లయితే, అక్కడ చుట్టు ప్రక్కల ప్రాంతాలకు నీరు సప్లయికావడానికి వీలు వుంటుంది. నిజంగా ప్రజలను శాశ్వతంగా కరువుకాటకాలనుండి బాధపడకుండా రక్షించాలని ప్రభుత్వము తలంచి నట్లయితే ఒక సమగ్రమైన దృష్టితో సహాయము చేయండి. ఏదో యిప్పుడు తాత్కాలికంగా ఏర్పాటులు చేస్తున్నామని అనుకుంటే ఆ విధంగా ప్రజలకు చెప్పండి. అదే మాదిరిగా సోమశిల కానివ్వండి. గోదావరి రిజర్వాయరు విషయము కానివ్వండి. ఈ కరువనేది క్షయవ్యాధితో సమానమైనది కాబట్టి యీ ఏర్పాట్లు చేసేటప్పుడు ఏదిముందు ఏది వెనుక అనేది ఆలోచించి ముందు అవసరమైనది ముందు తీసుకొని ఏర్పాట్లు చేయండి. క్రిందటి దఫా వచ్చిన కరువు నివారణ కోసము ఒక కోటి యాభై లక్షల రూపాయలు ఒక్క అనంతపురం జిల్లాలోనే ప్రభుత్వము ఖర్చు పెట్టారంటే నిజమే. అయితే అప్పుడు ప్రజలు పడిన బాధలు ఆ దృశ్యాలు అన్నీ చూచివున్నట్లయితే, నిజముగా కళ్ళనీరు పెట్టనివారు వుండరు. అయినా అప్పుడు ఆ ప్రజలను చూచినవారు ఎవ్వరు లేకుండా పోయినారు.

కనుక అటువంటిది తిరిగి సంభవించ కుండా మనము చేయాలంటే ఈ నాటికి కూడా ప్రభుత్వం ఒకవిధానం ఇవ్వలేదు. ప్రతిసంవత్సరం దినగండం ఆయుస్సు మాదిరిగా ఉండేటటు వంటి పరిస్థితి అయింది. అందుచేత ఎంత తొందరగా వీలు అయితే అంత త్వరగా వారికి రక్షణ కల్పించ డానికి ప్రయత్నం చేయవలెనని ఈ దృష్టితోనే మేము అడుగుతూ ఉంటామని, ఈ విషయములో ఏలాటి దురభిప్రాయము పెట్టుకోకూడదని మనవి చేస్తూ విరమిస్తున్నాను.

Sri C. V. SURYANARAYANA RAJU:— అధ్యక్షా! ఈ Irrigation Demand ను మంత్రిగారు ఈ సభముందు పెట్టినప్పుడు, విశాఖపట్నం జిల్లాగురించి కొన్ని ముఖ్యమైన విషయాలు వారి దృష్టికి తీసుకొనిరావడం న్యాయమని తీసుకొనివస్తున్నాను.

విశాఖ జిల్లాలో సాగుబడి కావలసిన భూమి 9 లక్షల ఎకరాలు అయివుండగా, నీటి సదుపాయము 2 లక్షల ఎకరాలకే చేసినారు. విశాఖ జిల్లాలో అయిదు నదులు పారుతున్నవి. ఈ అయిదు నదులకు 1924 సంవత్సరం మొదలుకొని 1951 వరకు పది ప్రాజెక్టులకు investigation చేసినారు. ఆ విధంగా investigation చేసినప్పటికి మొట్టమొదట 1924 సంవత్సరంలో జమీందార్లు వారి వంతు ఇవ్వలేదని, అప్పుడు ఈ ప్రాజెక్టులను మానివేశారు. తరువాత 1930 సంవత్సరంలో investigation చేసినపుడు, దానికి జమీందార్లు contribution ఇవ్వలేదంటే, అప్పుడు మానివేశారు. ఆ విధంగా కూడ 9 లక్షల ఎకరాల భూమి సాగుకు రావలసియుండగా, నూటికి 50 వంతైనా సాగులోకి రాకుండా ఉన్నది. దానికి నీరు అందకుండా ఉన్నది. Floods వచ్చినప్పుడు, జిల్లా కలెక్టరుకూడ గవర్నమెంటుకు రిపోర్టు పంపించారు, అది చదువుతున్నాను.

21st July 1955] (Sri C. V. Suryanarayana Raju)

" The river Varaha is more of the nature of a hill stream than a river. It flows in torrents in flood time. The flood fall is very steep. Consequently, it is not possible for the water to reach ayacut land at the tail end of the channels which are four or six miles in length unless, the stream is continuosly flowing for a number of days which is not often likely. "

తరువాత,

" Further, owing to the rapidity of the current and the large volume of water which has to be drained in a short time, there have been breaches in the various places in the banks resulting in the sanding of large areas of wet land, not to speak of the loss of life among men and cattle."

అని వారు ప్రతిసారి flood వచ్చినప్పుడు చెప్పుతున్నారు. విశాఖ జిల్లాలోని, 1941 మొదలుకొని 1951 వరకు లెక్కలు తీసుకుంటే, 1943 లోను, 1945 లోను, 1949 లోను గొప్ప floods వచ్చి చాలాభాగము ఇసుక మేటలు వేసింది. చాలా మంది చనిపోయారు కూడ. Floods ను అరికట్టవలసినంతని లేకపోతే చాల నష్టం వస్తుందని ప్రతి సంవత్సరం కలెక్టర్లు ఎప్పటికప్పుడు రిపోర్టు చేస్తూనే ఉన్నారు. అయినప్పటికి floods ఆగలేదు. మాకు రెండు అనర్థాలు వచ్చాయి. South-west monsoon లో 28 అంగుళాలు వర్షము పడుతుంది. North-east monsoon లో 12 అంగుళాలు వర్షము పడుతుంది. South-west monsoon లో వర్షము పడినప్పుడు, కలెక్టరుగారు వ్రాసినట్లు, నీరంతా క్రిందికి పోతుంది. నీళ్ళులేక చాలా బాధ పడుతున్నారు. ఒక్క యలమంచిలి తాలూకా, గవర్నమెంటు తాలూకా కాబట్టి 43 వేల రూపాయలు 1949 సంవత్సరంలో remission ఇచ్చారు. 1949 సంవత్సరంలో 42 అంగుళముల వర్షము వచ్చినప్పటికి 43 వేల రూపాయలు remission ఇచ్చారు. అంతేకాకుండా 1954 అక్టోబరులో flood వచ్చింది. అప్పుడుకూడ అన్ని నదుల గట్లు ఇరుగగొట్టుకు పోయాయి. చాల ప్రాంతాలు మునిగిపోయాయి. మొన్న మే నెలలో 1, 2 తేదీలు 50 వేలు రూపాయలు ఇచ్చి ఇవన్నీ పూర్తి చేశారు. ఇవన్నీ మరల ఒక order లో పెట్టినతరువాత మే 6, 7 తారీఖులలో మళ్ళీ floods వచ్చాయి. మళ్ళీ గవర్నమెంటువారు మూడులక్షలు ఇచ్చి మరమ్మత్తు చేయిస్తున్నారు. కాని, 20 అడుగుల floods వచ్చినప్పుడు, flood banks ఏమో 16 అడుగులు, 17 అడుగులే ఉన్నందువలన, ప్రతిసంవత్సరము floods వచ్చినప్పుడు flood bank ఏమో పోతూ ఉండడమే, భూములు మునిగిపోతూ ఉండడమే జరుగుతున్నది. తరువాత ఒక్కొక్కప్పుడు వర్షాలులేకుండా పోతున్నాయి. వర్షాలు వస్తే ఈవిధంగా floods వల్ల బాధపడుతున్నారు. వర్షాలురాకపోతే మరోవిధంగా బాధ పడుతున్నారు. ఈ జిల్లాలో అయిదునదులు ఉన్నప్పటికి, 9 లక్షలు ఎకరాలు సాగు అయ్యే భూమి ఉన్నప్పటికి, రెండు లక్షలకు మాత్రమే నీరు supply చేస్తున్నారు.

అంటే చాలా విచారకరంగా యున్నది. ఇప్పుడు జమీందారీలుపోయాయి కాబట్టి, మీరు తలపెట్టిన రెండవ పంచవర్ష ప్రణాళికలో, ఒక్కొక్క సంవత్సరం, ఈ నదుల క్రిందఉన్న 10 స్కీములలో 1, 2 తీసుకొని 1960 లోగా పూర్తిచేస్తే బాగుంటుందని మనవి చేస్తున్నాను. అంతేకాకుండా వరాహానది క్రింద 1926 లో ఒకసారి investigate చేశారు. మళ్ళీ 1928 లో investigate చేశారు. మరల 1933 లోను, 1946 లోను చేశారు. 1946 లో investigate చేసినప్పుడు, "రామపాదసాగరు investigation అవుతూంది, కనుక యలమంచిలి, అనకాపల్లి, విశాఖ తాలూకాలవారు కొంచెము ఆగండని చెప్పారు. ఆవిధంగా చెప్పినందువల్ల మేము ఆందోళనచేయకుండా ఇప్పటివరకుఆగాము. మంత్రిగారు ఇచ్చిన statement లో గోదావరినది floods అరికట్టడానికి 28 కోట్ల రూపాయలు పెట్టి ఈపూరిపక్క ఏదో ఒక ఆనకట్ట కట్టిస్తాము అని అన్నారు. కాని గోదావరి నీరు ఆశ మాకు లేదు. అందుచేత ఈ జిల్లాస్కీములనుమట్టుకు రెండవ పంచవర్ష ప్రణాళికలో వేసి, నదికి ఒకటి రెండు స్కీముల ప్రకారం వేసుకొని ఈ జిల్లాకు సంబంధించిన స్కీములను పూర్తిచేయవలసిందని మనవిచేస్తున్నాను.

తరువాత, మా జిల్లాలో 9 తాలూకాలున్నాయి. అందులో రెండు తాలూకాలు గవర్నమెంటు తాలూకాలు. మిగిలినవన్నీ జమీందారీ తాలూకాలు. జమీందారీలలో ఉండే చెరువులు, కాలువలు, వాటన్నిటికి జమీందారులు hand over చేసింది మొదలు ఇంతవరకు, సరిగా మరమ్మతులులేవు. ఏ కాలువకుగాని, ఏ చెరువుకుగాని పూర్తి మరమ్మతు చేయడంలేదు. అంతేకాకుండా, మాకు కుడి మరమ్మతు అని ఉన్నది. దాన్ని P. W. D. వారు చేయమంటే చేయరు. ఏ రైతైనా ఎవరైనా అది చేస్తే వారికి penalties వేసి వసూలు చేస్తున్నారు. మీరేవచ్చి మరమ్మతు చేయండి అంటే, మాకు staff లేదు మేము మరమ్మతు చేయలేమని అంటారు. ఎవరైనా చేస్తామంటే object చేస్తున్నారు. తరువాత ఈ నదులేవీ జీవనదులు కావు. కాకపోయినప్పటికి, యలమంచిలి తాలూకాలో, కూరలుసిస్టం అని పెట్టారు. ఈ నదులలో నీరు గంటా గంటన్నర లేనప్పటికి ఆ సిస్టమ్ ఎట్లా work చేస్తుందో నాకు అర్థంకావడంలేదు. దీనిని గురించి 1950 వ సంవత్సరములో represent చేసిన ఫలితంగా అప్పుడు తీసివేశారు. కాని ఇప్పుడు మరల దానిని తీసుకువచ్చి పెట్టారు. కనుక దానిని గురించి మరల ఆలోచించవలసిందని ప్రభుత్వమును కోరుతూ విరమిస్తున్నాను.

Srimathi B. RUKMINI DEVI:— అధ్యక్షా! ఇరిగేషన్ శాఖామాత్యులు ప్రవేశపెట్టిన యీ Irrigation Demand ను బలపరుస్తూ నాకు తోచిన కొన్ని మాటలు చెప్పుచున్నాను. రాయలసీమలో అనంతపురం జిల్లా వెనుకబడిన జిల్లా అని సాధారణముగా అందరికి తెలిసిన విషయమే. కాని యీ జిల్లాలో కుముద్వతి ప్రాజెక్టు వల్ల హిందూపురము తాలూకాలోని కొన్ని ప్రాంతాలకును, పేరూరు ప్రాజెక్టు వల్ల ధర్మవరం తాలూకాలోని కొన్ని ప్రాంతాలకునూ, నీటి సౌకర్యాలు లభిస్తున్నవి. భైరవానితిప్ప ప్రాజెక్టువల్ల కళ్యాణదుర్గము తాలూకాకు కూడా నీరు లభించబోవుచున్నది. ఉదయము ఇరిగేషను శాఖామాత్యులు వారి ఉపన్యాసములో రాయదుర్గము, కళ్యాణదుర్గము, ఉరవకొండ, తాడిపత్రి తాలూకాలలో కొంతవరకు నీటి సౌకర్యాలు కలుగబోతున్నవని చెప్పినారే కాని, అన్నివిధములుగా వెనుకబడిన పెనుగొండ,

మడకసిర తాలూకాలలోని ప్రాంతాల విషయము, వారి ఉపన్యాసములో సూచనగానైనా రాలేదు. ఈ తాలూకాలలోని ప్రాంతములు ఎంత వెనుకబడి వున్నవో అందరికి తెలుసు. మడకసిర తాలూకాలో వర్షాలు సాధారణంగా చాలా తక్కువ. ఉన్న వర్షాలయినా అకాల వర్షాలుగా వుంటాయి. అందువల్ల శూన్య వర్షమనే చెప్పాలి. ఈ తాలూకా మైసూరు రాష్ట్ర సరిహద్దులలో నున్నది. జిల్లా హెడ్ క్వార్టర్సుకు చాలా దూరముగా వుండడమువల్ల అక్కడ ఏదైనా ప్రజోపయోగకరమైన కార్యక్రమము నిర్ణయించుకొని, కలెక్టరును ఎప్పుడైన ఆహ్వానిస్తే, ఆయన అంతదూరము రాలేను అని చెప్పి తన క్రింద పనిచేస్తున్న తహశీల్దారునో, సబ్ కలెక్టరునో పంపుతాను; ఆ కార్యక్రమము కొనసాగించుకోండి అని జవాబు చెబుతారు. దాన్నిబట్టి యీ తాలూకా ఎంత వెనుకబడిన ప్రాంతమో గ్రహించవచ్చు. ఈ తాలూకా ప్రభుత్వోద్యోగులకు కూడా నిరాదరణ తాలూకా అయిపోయింది. ఇంతగా సహృదయము, విశాలదృష్టి ప్రదర్శించిన యీ మంత్రివర్యులు కూడా తన budget speech లో యీ తాలూకాను గురించి కొంతవరకైనా ప్రసంగిస్తారని ఆశించితిని. కాని దాని ప్రసక్తేరాలేదు. శూన్యవర్షమునకు తోడు అధికారుల నిరాదరణ పొందిన యీ తాలూకాలో పంటలుకూడా పండకుండా వున్న అక్కడి భూములు కూడా యీనాడు తక్కావి అప్పుల క్రింద వుంటున్నవని ప్రభుత్వమునకు తెలుసు. అందువల్ల యీ తాలూకాలో దరిద్రదేవత స్థిరంగా నివాసము ఏర్పరచుకున్నది. అందువల్ల మన ఇరిగేషను శాఖామాత్యులు యీ తాలూకా విషయములో భగీరథ ప్రయత్నాలు అయినా చేసి స్థిరనివాసి అయిన దరిద్ర దేవతను యీ తాలూకానుంచి వెళ్ళగొట్టే ప్రయత్నము చేస్తారని ఆశిస్తూ, అధ్యక్షుల వారు నాకు యీ అవకాశం యిచ్చినందులకు వారికి నా అభివందనాలను అర్పిస్తూ విరమిస్తున్నాను.

Sri D. KONDAYYA CHOWDARY :— అధ్యక్షా ! నేను ముఖ్యంగా యీ యిరిగేషన్ శాఖకు సంబంధించిన పద్దును ఆమోదిస్తున్నాను. అయితే దీనిలో ఇరిగేషను మంత్రిగారిని అది చేయలేదు, యిది చేయలేదు, అది కావాలి, యిది కావాలి అని నేను చెప్పటానికి రాలేదు. కాని ప్రభుత్వము తరఫున చేయదలచిన పనులు మాత్రం సంపూర్ణముగాను, సమగ్రముగానూ చేయమని వారికి నేను మనవి చేస్తున్నాను. ఎక్కడ చూచినా ప్రతి యిరిగేషను ప్రాజెక్టులోనూ, ప్రయత్నము చేసేది, మొదలు పెట్టేది, ముప్పాతిక భాగము పూర్తిచేసేది, చివరకు అది పూర్తిచేయకుండా పోవడమువల్ల దానికిగాను యిచ్చిన పైకము పూర్తిగా ఖర్చు అయిపోయినప్పటికినీ, దానియొక్క పూర్తి ఫలితము ప్రజలు పొందలేకపోతున్నారు. ఇప్పుడు తుంగభద్ర ప్రాజెక్టు విషయం చూడండి. ఆ ప్రాజెక్టు కట్టినప్పటికి high level channel స్కీము క్రింద ఒక భాగము మాత్రమే కట్టారు. కాని అది పూర్తిచేయలేకపోవడమువల్ల కొన్ని చిక్కులు ఏర్పడ్డవి. అదే విధంగా ప్రతి విషయములోను కూడా సంపూర్ణముగా ఫలితము అందకపోగా, పెట్టిన డబ్బుకు వడ్డీ అయినా గిట్టుబాటు లేకపోవడము; ప్రజలు మాత్రము అది పూర్తికాలేదని నిరుత్సాహపడడము, చేసిన పనినికూడా సంపూర్ణముగా ముగించలేకపోవడము జరుగుచున్నది. మా తాలూకాలోని విషయము ప్రభుత్వము దృష్టికి పదేపదే తీసుకొని వచ్చాను. మరల మంత్రిగారి దృష్టికి తెస్తున్నాను. ఈ విషయము వారు గమనిస్తారని ఆశిస్తున్నాను. మా తాలూకాలో చుండి అనే గ్రామానికి ఒక పెద్ద చెరువు వున్నది. దానికి కట్టలు తెగిపోయి యున్నందున మూడు లక్షలు పెట్టి యీ చెరువును బాగుచేశారు. కాని అక్కడే నీటి అడుగుననున్న భూమట్టమునకు సరిగా కట్ట వేయనందువల్ల నీరు నిలవకుండా

పోతున్నది. ఇంజనీరుగారిని అడిగితే, అలుగు ఎత్తు ఎక్కించితే ప్రక్కనవున్న రోడ్డు మునిగిపోతుందని అభిప్రాయమిస్తూ, అది అంతకన్న ఎత్తు కట్టరాదని చెప్పారు. ఆ రోడ్డుకు బ్రిడ్జి కట్టాలని చెబుతున్నారు. ఈ రకంగా యిప్పటికి నాలుగు సంవత్సరముల క్రితము పూర్తి అయిన పని, ఆ రోడ్డుకు బ్రిడ్జి కట్టకపోవడమువల్ల నిలిచి పోయింది. ఈ నాలుగు సంవత్సరముల నుంచిగూడా యీ మూడు లక్షల రూపాయలుకు వడ్డీ ఎంత అయిందో లెక్కచూస్తే, నష్టమెంతో తెలుస్తుంది. ప్రజలకు దాని ఫలితము రాకపోవడము, అటు ప్రభుత్వానికి, యిటు ప్రజలకు ఎంత నష్టము కలుగుతున్నదో గుర్తించాలి. అందువల్ల మంత్రిగారిని వారు ఏ పని చేసినప్పటికినీ, దాన్ని సంపూర్ణముగా చేసి, అటు పిమ్మట యింకొక క్రొత్త పని తలపెట్టవలసిందిగా కోరుచున్నాను. పోపూరు చెరువుకు కూడా యిదేమాదిరి జరిగింది. ఈ చెరువుకు 70 వేలు పెట్టి ఒక కాలువ త్రవ్వారు. కాలవ త్రవ్వారేకాని, ఏటిలోని నీరు యీ కాలవలోకి పోవడము లేదు. కాని కాలవలోని నీరు మరల ఏటిలోనికే పోతున్నది. దీనికి కారణము యేమిటంటే; ఆ ఏటికి ఒక చిన్న మొత్తము అంటే సుమారు 20 వేల రూపాయలు ఖర్చుపెట్టి ఒక ఆనకట్ట కట్టకపోవడమువలన యీ మూడు సంవత్సరాలనుంచి గూడా దాని క్రింద సాగు ఆయ్యే వెయ్యి ఎకరాల భూమి పాడైపోతున్నది. ఆ చెరువు క్రింద ఖర్చుపెట్టిన 70 వేల రూపాయల పెట్టుబడి, దానికి అయిన వడ్డీ అంతయు నష్టమనే చెప్పాలి. ఈ మూడు సంవత్సరాలనుంచి ప్రభుత్వానికి రావలసిన శిస్తు ఎంత నష్టమయిపోతున్నదో ప్రభుత్వమువారే గుర్తించాలి. ఇలాంటి అసంపూర్ణ పనులు చేయవద్దని పదేపదే చెబుతున్నాను. ఎందుకంటే, ఏదైనా చేస్తే, దానికి పరిపూర్ణ ఫలితము పొందితే, ఫలితము పొందినవారైనా మంత్రిగారిని దీవిస్తారేమోగాని యిటువంటి అసంపూర్తి పనికి ఎవరూ ఆమోదించరని గుర్తించాలి. ఇది మాత్రం చాలా శోచనీయమైన పరిస్థితి అని అనకతప్పదు. అలాగే నందికొండ గురించి కూడా ఒక విషయము చెప్పదలచాను.

ఇప్పుడు ఇరిగేషను శాఖామాత్యులుగా సంజీవరెడ్డిగారు వచ్చారు. వారు మాబోటి వారికి, యింకను వెనుకబడిన ప్రాంతాల వారికి తగు రక్షణ యిస్తారని వారియందు ప్రజలకు దృఢ విశ్వాసము వున్నది. ఇది వారు విశ్వసిస్తారని అనుకుంటాను. నందికొండ విషయములో యింకను వారు పని begin చేయకముందే వారికి ఒక విషయము చెప్ప దలచాను. మా నెల్లూరు జిల్లాలో కందుకూరు డివిజను ప్రత్యేకంగా వెనుకబడినది. ఈ నాలుగు అయిదు తాలూకాలూనూ, రాయలసీమలోకన్న వెనుక బడిన తాలూకాలని అంటున్నారు. నందికొండ ప్రాజెక్టుకు ప్రథమ దశలో 75 కోట్లు రూపాయలు వరకూ ఖర్చుచేస్తే గుండ్లకమ్మ వరకే నీరు వస్తుంది. అటుపైన వెనుకబడిన ప్రాంతాలకు యేమీ వుండదు అని అక్కడి ప్రజలకు భయము కలుగుచున్నది. అంతే కాకుండా సోమశిల ప్రాజెక్టు కావలసినవారు కూడా, ఇది రెండవ దశలోగాని ప్రారంభము చేయరు. అందువల్ల యీ నందికొండ మనకు యిప్పట్లో రాదు. కాబట్టి యిది యిక మన జిల్లాకు రాదు, దీనివల్ల ప్రయోజనములేదని ప్రచారం చేస్తున్నారు. ఈ రెండు కారణములవల్ల దాదాపు 7, 8 లక్షల జనాభాగల యీ కందుకూరు డివిజన్ లోని వారికి అందరికి కూడా మిక్కిలి భయము కలుగుచున్నది. రెండవ దశ దాకా రాదేమో అనుకుంటున్నారు. యీ ప్రాజెక్టు ప్రథమ దశతోనే అంతరిస్తుందేమో అని ప్రజలు భయపడుచున్నారని మంత్రిగారికి మాచ్చరిక చేస్తున్నాను. తరువాత

రెండవ దశ ప్రథమపంచశ అని రెండు దశలలో యీ ప్రాజెక్టును కట్టకుండా యిప్పటి తుంగభద్ర హైలెవెల్ ఛానల్ మాదిరి రెంటాలు లేకుండా ఒకటే దశలో యావత్తు ప్రాజెక్టు పూర్తిచేయమని కోరుతున్నాను. రెండవ దశలో పూర్తి చేసేటట్టయితే అట్లా చేస్తారని ప్రజలకు హామీయిస్తే నిజంగా అక్కడి ప్రజలు మంత్రిగారిని దీవిస్తారని, ఆశీర్వదిస్తారని చెబుతున్నాను.

Sri B. RAMAKRISHNA REDDI :— అధ్యక్షా ! ఇరిగేషను డిమాండును నేను బలపరుస్తున్నాను. అయితే దీని విషయములో ముఖ్యంగా ఒక విషయం చెప్పవలసియున్నది. అదేమిటంటే, దీనిలో ప్రభుత్వమువారి పాలసీ కూడా కొంత మార్చవలసి యున్నది. Long range schemes మీదనే ప్రభుత్వము ఎక్కువ డబ్బు ఖర్చుచేస్తున్నారు. కాని చిన్న స్కీములమీద ఎక్కువ ఖర్చుచేసేటట్లు లేదు. Small schemes మీద పెట్టే ఖర్చుమాత్రం చాలా తక్కువగా వున్నది. అయితే మన ఆంధ్ర దేశములో ముఖ్యమైన చాలా small schemes వున్నవి. ఈ రోజున నందికొండ ప్రాజెక్టు కట్టినప్పటికి అది అంతా ఒకే ప్రాంతానికి ఉపయోగపడుచున్నది. దానికి 125 కోట్లు ఖర్చు పెట్టితే, ఒక గుంటూరు, నెల్లూరు జిల్లాలవరకే ఉపయోగపడుతుంది. కాని small schemes మీద వుపయోగించినట్లయితే, అది అన్ని constituencies లో కూడా ఉపయోగపడును. 10 లక్షలు, 20 లక్షలతో తయారయ్యే చిన్న చిన్న schemes కొన్ని యిదివరకు ఏర్పాటు అయినవి వున్నవి. ఆవిధంగా ఏర్పాటు అయిన స్కీములు అన్నీ ప్రభుత్వం ఎందుకు తలపెట్టకూడదు? అని అడిగితే, financial stringency వల్ల ఆ ప్రకారంగా ఏర్పాటు చేయలేకపోతున్నామని అంటున్నారు. ఇదివరకున్న బ్రిటిషు పరిపాలన కాలంలో యీ చిన్న స్కీములు ఏవిధంగా వున్నాయో, యిప్పుడు కూడా అదే ప్రకారంగా వుంటున్నవి. అవన్నీ ఆరంభిస్తే వెనుకబడిన ప్రాంతములలో కొంతవరకు యిరిగేషను సౌకర్యం కలుగుతుందని నా అభిప్రాయము. వెనుకబడిన ప్రదేశాలలో వున్న రైతాంగము అంతా కూడా ప్రభుత్వము యీ ప్రకారము చేస్తుందని ఎదురుచూస్తున్నారు. యీ నందికొండ ప్రాజెక్టు ఆంధ్ర దేశములో ఏదో ఒక ప్రక్కన ఉపయోగిస్తుందే గాని, దేశం అంతటా వుపయోగించదు గదా, అందువల్ల యీ చిన్న చిన్న స్కీములు తీసుకొని వెనుకబడిన ప్రాంతములలో ఎందుకు అసలు పనిచేయకూడదు? అని ఆందోళ చేస్తున్నారు. అక్కడ ప్రజలు 'మీరు యీ విషయములో ఎందుకు వూరుకున్నారు? ఎసెంబ్లీలో ఎందుకు ఆందోళన చేయకూడదు' అని ప్రజాప్రతినిధినైన నన్ను అడుగుతున్నారు. అయితే అది మాత్రము ఒక్కొక్కదానికి ఒక కోటిగాని, పది కోట్లు గాని ఖర్చు అయినప్పటికినీ యీ డబ్బు మన ఆంధ్రదేశము అంతా కూడా అభివృద్ధిచెందునిమిత్తము ప్రభుత్వము ఏర్పాటు చేయవచ్చు. ఆ ప్రకారం నెరవేర్చకుండా ఉండడమువల్ల యీ విషయము ముఖ్యంగా కొంత దీనావస్థలో పడిందని నేను అనుకుంటున్నాను. మా constituency లో ఒక కాలవను ఏర్పాటు చేశారు. దీనిని కావలి కాలువ అని అంటారు. ఇది జరిగి సుమారు పది సంవత్సరాలయింది. అప్పటినుంచి అది ఆ ప్రకారంగానే వుంచబడింది. దాన్ని పూర్తిగా నెరవేర్చబడకుండా ఉన్నారు. దాన్ని పూర్తిచేయమని అడిగితే ప్రభుత్వానికి డబ్బు అనేది ప్రధాన సమస్యగా వున్నదని అంటారు.

ఈ ప్రాజెక్టుల కోసం యెన్నో కోట్లు కావలసి వున్నది? డబ్బు వుండేనా ప్రభుత్వము యీ ప్రాజెక్టులు కట్టిస్తున్నారు? అప్పుచేసి ప్రాజెక్టులు కట్టించుచున్నప్పుడు దీనికి గూడా మరొక పది కోట్ల రూపాయలు అప్పు తీసుకొని రాగూడదా? అది రాష్ట్రం దానికి ప్రజలమీద betterment tax వేస్తారు గదా! అది వసూలు చేస్తున్నప్పుడు, యీ పది కోట్లున్ను అప్పుగా తెచ్చినను పది సంవత్సరాలలో ఆ అప్పు తీర్చే విధానము తీసుకొని రావచ్చునుగదా! అవసరమైతే ప్రజలవద్ద డబ్బు సేకరించండి. వాళ్ళు యిస్తామని గూడా ముందుకు వస్తున్నారు. ప్రజలనుంచి రూపాయలు collect చేయడము మొదలు పెట్టితే పదికోట్లేకాదు, ఇంక ఎంతైనా త్వరలో వసూలు అవుతుంది. వాళ్ళు యిస్తామని సిద్ధంగా వున్నప్పుడు అది ప్రభుత్వము త్వరలో వసూలుచేసి యీ పని ముగిస్తే మంచిది. ఈ ఖర్చు ఎంత అయినా వాళ్ళుభరిస్తామని అంటున్నారు. గనుక యీ డబ్బు ఎంత అవుతుందోచూచి వసూలు చేయడానికి ప్రభుత్వము ప్రారంభిస్తే యీ చిన్న చిన్న స్కీములు పూర్తి చేయటానికి వీలు అవుతుంది. ఇప్పుడు మా స్కీముకు రైతాంగము మీద betterment వేసినప్పటికి కూడా, యింకా ఎక్కువ కావలెనంటే గూడా, వాళ్ళు భరిస్తామని, యిస్తామని అంటున్నారు. నేను మా నియోజక వర్గములో పర్యటన చేస్తున్నప్పుడు నన్ను ప్రజలు అడగడము సాగించారు. 'మీరు యీ మూడు సంవత్సరాలనుంచి ఎసెంబ్లీలో ఏమిచేస్తూ వచ్చారు? ప్రభుత్వముపై వత్తిడిచేసి ఈ పని ఎందుకు సాధించలేక పోతున్నారని' అడుగుతున్నారు. నేను ప్రజలకు సమాధానము చెప్పలేక పోతున్నాను. నేను యీ పని సాధించలేక పోతున్నానని చెప్పవలసి వస్తున్నది. కనుక ప్రభుత్వము యీ స్కీమును నెరవేర్చటానికి ప్రయత్నము చేస్తే డబ్బు అనేది మాత్రం వస్తుందని నేను నమ్మకముగా చెప్పగలను. అందువల్లనే నేను మనవి చేస్తున్నాను. మా జిల్లాలో గూడూరు, రాపూరు ప్రాంతాలలో పదిలక్షలకు, ఇరవై లక్షలకు స్కీములున్నవి. ఈ స్కీములన్నీ గూడా నెరవేర్చటానికి ప్రయత్నిస్తే మన ఆంధ్రదేశము అంతటను irrigation స్కీములు పూర్తిచేశామని చెప్పటానికి వీలు ఏర్పడుతుంది. ప్రభుత్వము దీన్ని ప్రధాన విషయముగా తీసుకోవలసి ఉంటుంది. మొన్నటిరోజున ఖన్సార్ సేన కమిటీ వచ్చినప్పుడు పెన్నకు మూడువేల క్యూసెక్కుల వరకు నీరు పంపుతామని అన్నారు. ఆ ప్రకారము పంపించి నట్లయితే పెన్నక్రింద ప్రస్తుతమున్న డెల్టాయేగాక కనుపూరు, కావలి కాల్వలకు నీరు సరిపోతుంది. రిజర్వాయరు క్రిందవున్న భూమి కంతకూ సరిపోతుంది. ఇది కాకుండా పెన్న పైభాగంలో కూడా కొంతనీరు వృధాగా పోతున్నది. ఆ ప్రకారము నీరు వృధాగా పోకుండా సంగంవద్ద ఒక barrage కట్టితే ప్రక్కనవున్న కనుపూరు కావలి కాల్వలకు గూడా కొంత వరకు నీటి పారుదలకు యేర్పాటుచేసినట్లు అవుతుంది. డాము యేర్పాటు చేస్తే పది కోట్లు కావాలన్నారుగాని, అవసరము వుండదనుకుంటాను. పది లక్షలతో పూర్తి అవుతుంది. దీన్ని ప్రభుత్వమువారు నెరవేరుస్తారని ఆశిస్తున్నాను.

*Sri G. SURYANARAYANA :— అధ్యక్షా: ఈ నాడు ఇరిగేషను డిమాండుమీద చర్చ జరుగుతున్నది. మన ఆంధ్రదేశంలో ఆహారపంటలు, వర్తక వ్యాపార పంటలు విస్తారంగా పండుతాయి. ఈ పంటలకు నీటివసతులు చాలా అవసరము. నీటి సౌకర్యాలు సరిగాలేక రైతులు అనేక కష్టాలకు గురిఅవుతున్నారు. నీటి వసతులకొరకు మనము ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో వున్నప్పటినుంచీ కూడా

శాసనసభలలో తర్జనభర్జనలు చేసుకొంటున్నాము. ఆహారసమస్య గురించి యింత కాలమునుంచి రైతులు ఎటువంటికృషి సల్పుతున్నారో మనము ఒక్కసారికూడా గుర్తించలేదు. ప్రభుత్వమువారు ఎప్పుడు చూచినను ప్రాజెక్టులు ప్రారంభిస్తున్నామని, అన్ని స్కీములు ఏర్పాటు చేస్తున్నామని చెప్పడమేగాని, ఇంతవరకు ఏ ఒకకార్యము కూడా నెరవేర్చినట్లు కన్పించడములేదు. వెంటనే ప్రభుత్వము తగినశ్రద్ధ తీసుకొని రైతులకు ఇరిగేషన్ సదుపాయాలు కల్పిస్తారని ఆశిస్తున్నాను.

ఈ నాటి వరకుకూడా మన ఆంధ్రరాష్ట్రంలో విశాఖపట్టణంజిల్లా అనేది వున్నట్లు ప్రభుత్వ దృష్టిలో కన్పించడములేదు. విశాఖపట్టణంజిల్లా ఈ నాడు చాలా వెనుకబడివున్నది. ఈ జిల్లాలో చిన్న చిన్న వాగులు చాలా యున్నవి. ఈ వాగుల మీద డాములునిర్మిస్తే ఈ జిల్లా ఆహారకొఱత తీరిపోతుంది. విజయనగరం తాలూకాలో చంపావతి అనే నది ఒకటి వున్నది. దానిమీద చిన్న డాముకు ఏర్పాటుచేస్తే విజయనగరం తాలూకా, భీమునిపట్టణం తాలూకా, చీపురుపల్లి తాలూకాలో చాలా భూములు సాగులోకివస్తాయి. ప్రస్తుతం ఆ నదిలోవున్న నీరు అంతా కూడా సముద్రములోకి పోయి ఆ నదియొక్క వుపయోగమే ప్రజలకు లేకుండా పోతున్నది. విజయనగరం తాలూకాలో జగన్నాథపురం అనే గ్రామం వున్నది. అక్కడ ఒక డాము నిర్మిస్తే 25,000 ఎకరాలభూమి సాగులోకివచ్చి అచ్చటి ప్రజల ఆహారకొఱత తీరుతుంది. దీనినిగురించి విశాఖపట్టణంలో జరిగిన శాసనసభ సమావేశ కాలములో మంత్రిగారికి ప్రజాసోషలిస్టు పార్టీ ఆధ్వర్యాన ఒక నివేదిక సమర్పించబడింది. ఇంత వరకు దానిని గురించి ఎటువంటి శ్రద్ధ తీసుకున్నట్లు గోచరించడములేదు. శాసనసభా దృష్టికి కూడా ఇంతవరకు రాలేదు. బడ్జెటు లెక్కలలోకి అయినా కూడా రాలేదు. విశాఖపట్టణం జిల్లాలో వున్న ప్రజానీకం అంతా కూడా చాలా బీదవారు. సామాన్య రైతులే. భూఖామందులు అస్సలే లేరు. మా సోషలిస్టు సిద్ధాంతం ప్రకారం భూఖామందు అనే పదము లేదు. పేద ప్రజానీకముయొక్క ఆహారకొఱత తీర్చడానికి ఈ ప్రభుత్వం ఎటువంటి చర్య తీసుకోకపోవడమునకు చాలా విచారిస్తున్నాను. ఇటుపైన అయినా ఆంధ్రమంత్రివర్గమువారు విశాఖపట్టణ జిల్లాయొక్క పురోభివృద్ధికి తగు శ్రద్ధ తీసుకోవలయును. మాకు లక్షలు, కోట్లు ఖర్చుపెట్టనక్కరలేదు. కనీసం జగన్నాథపురం స్కీము అయినా అమలుజరిపితే 1 లక్ష 60 వేలు కంటె ఎక్కువ వ్యయము కాదని ఇంజనీర్లు అంచనాలు వేసినారు. ఈ విషయం ఇంజనీర్లను అడిగితే "మేము ఏమి చెయ్యము, మీరు శాసనసభ్యులు అయివుండి శాసనసభలో ఎందుకు మాట్లాడకూడదు? మీరు శాసనసభలో తీర్మానము చేస్తేగాని మేము పనిచేయడానికి వీలు లేదు. ప్రభుత్వము మాకు డబ్బు యివ్వలేదు. అనేక చెఱువులకు కాలువలకు ప్రభుత్వమునకు అంచనాలు పంపాము, నమూనాలు పంపాము, ప్రభుత్వం యింతవరకు మాకు ఏమీ డబ్బు యివ్వలేదు. మేము ఏమిచేయగలము?" అంటున్నారు. ఇరిగేషన్ స్కీములను పరిశోధించేందుకు కొంతమంది వుద్యోగులనువేశారు. వారు జీప్‌లమీద తిరగడము తప్ప ప్రజల కష్టసుఖములు తెలుసుకొని ఆ స్కీముల విషయంలో తగిన శ్రద్ధ తీసుకోవడములేదు. ఇకనుంచి అయినా విశాఖపట్టణం జిల్లాను దృష్టిలో వుంచుకొని అక్కడి పేద ప్రజానీకముయొక్క పురోభివృద్ధికి, ఆహారకొఱత తీర్చడానికి తగిన కృషి చేయాలని నేను ప్రార్థిస్తూ యింతటితో విరమిస్తున్నాను.

*Sri P. RAMACHARLU :— అధ్యక్షా! నేను అనంతపురం జిల్లా నుండి వచ్చినవాడను. అనంతపురమును ఇంగ్లీషులో అనంతపూర్ (Anantapur) అన్నారు. అనగా అనంతమైన పావర్టీ, అనగా దారిద్ర్యము గలదనుట. ఇది ఆంధ్ర దేశములోకెల్లా మెట్ట ప్రదేశము. ఇటు ఈశాన్య పవనములుగాని, అటు నైరుతి పవనములుగాని మాకు చాలినంత వర్షమును ఇవ్వలేవు. ఇటీవల మూడేండ్లుగా మాకు వర్షము లేదు. పూర్వులు త్రవ్వించిన చెరువులు, కుంటలు ఒట్టివిగా నున్నవి.

మాకు తుంగభద్రా ప్రాజెక్టు వలన తప్ప వేరురీతిగా మోక్షము లేదని మూడు తరములుగా కలువరించినాము. కాని అది నేటికి సంప్రాప్తమైనది. కాని లాభమేమి? దరిద్రునికి సముద్రము చేరినను అరికాలు తడవవన్నట్లు మా దౌర్భాగ్యపు చక్రము మా మీద ఎన్ని ప్రాజెక్టులైనను నీరు ఒడిసి పోవుచున్నవి గాని మాకు తడి తగలదు. ఎన్నో ప్రాజెక్టు లేర్పడుచున్నవి గాని మా జిల్లావారికి త్రాగు నీరుగూడ లేకున్నది. కావున మా జిల్లా ప్రజలు ఎంతో ఆశాభంగము కలిగినది.

ఈ నీటి పారుదల సమస్యను ప్రాంతీయ దృష్టితో చూడవలదని, ఎక్కడ పండినా అందరు తృప్తిపడవలెనని చాల ఉదారముగా ఉపన్యసించిరి డిప్యూటీ చీఫ్ మినిష్టరుగారు.

దత్త మండలములలో ముఖ్యముగా అనంతపురం జిల్లా దుర్భర క్షామపీడితమై యున్నదనియే మహానుభావుడు శ్రీ కాటన్ దొర 1850 లోనే ఈ తుంగభద్ర ప్రాజెక్టును సంకల్పించెను. కాని ఇప్పుడున్న ఏర్పాటులో మాకు తప్ప తక్కినవారి కందరికి నీరు లభించునట్లున్నది.

మాకు ప్రతి రెండవ సంవత్సరము కఱవు వచ్చుచున్నది. కఱవులలో రిమీషన్ ఇచ్చిన మొత్తము, కఱవు నివారణ పనులకు ఖర్చు పెట్టిన మొత్తము కలిపినయెడల ఏనాడో తుంగభద్ర ప్రాజెక్టు నిర్మాణమైయుండేది. తకావు లిమ్మని, తకావికంతులు కో-ఆపరేటివ్ బాకీ కంతులువాయిదాలిమ్మని, శిస్తు రెమీషన్ ఇమ్మని ఏటాఏటా మేము గవర్నమెంటును కోరుచున్నాము. అది వారికిని బాధగా నున్నది. దీనికై ఇంకెంత ఖర్చగునో తెలియదు. తుంగభద్ర ఎగువ కాల్వ మా దారిద్ర్యమును ధ్వంసముచేయునని ఎంతో ఆశతో నుంటిమి. కాని ఇరిగేషన్ మంత్రి దీనిని ఆ జిల్లాలో కొంతభాగమునకు ఈ జిల్లాలో కొంతభాగమునకు పంచిపెట్టెదమని సెలవిచ్చినారు. అన్నిచోట్లకంటె మా జిల్లాకు తక్కువ వర్షము. కావుననే కాటకము బాధ మరీ హెచ్చు. కావున మా జిల్లాలో సాధ్యమైనంత ప్రదేశమునకు ఎగువ కాల్వనీటినిచ్చి తర్వాత తక్కిన ప్రాంతములకు తీసికోవచ్చునని మా జిల్లావారు కోరుచున్నారు. ఈ నీటిని మా జిల్లా మెట్టతాలూకాలకు తీసుకొనిపో సాధ్యమనియే ఇంజనీర్లు అభిప్రాయపడుచున్నారు. కాని 2 కోట్లు ఖర్చగు ననుచున్నారు. ఒక లక్ష ఎకరములు కరవు ప్రాంతములలో సాగయినప్పుడు ఈ మొత్తము ఖర్చు పెట్టుటకు ప్రభుత్వము సంకోచింపరాదు. ఏలన, ఇతరచోట్ల ప్రాజెక్టులక్రింద ఎకరమునకు రు. 300 దామాషాతో ఖర్చగుచున్నది. ఇది రు. 200 లే అగుచున్నది. ఇప్పుడు అనంతపురములో నున్న పరిశీలన సిబ్బందిని, ఎగువకాల్వను మెట్టతాలూకాలలో ఎంతవరకు తీసికొనిపోవచ్చునో విచారించుటకు ప్రభుత్వము వెంటనే ఉత్తర్వు చేయ గోరుచున్నాను.

నిరంతర క్షామముచే క్రుంగి కృశించుచున్న మా జిల్లా ప్రజలను మరవకూడదని ఈ సభ్యులను, మంత్రివర్గమువారిని కోరుచున్నాను. ఆంధ్రదేశమున అనంతపురం ఒక బ్లాక్ స్పాట్ గా ఉండినయెడల ప్రభుత్వము ఏటా ఏటా కరవు నివారణకు విశేషముగా ఖర్చు పెట్టవలసియుండును గావున ఇది ఆంధ్ర దేశమునకు ఒక గుదిబండగా నుండగలదని హెచ్చరించుచు, ఇది ఆవేశముతో చెప్పినదని భావించక మంత్రిగారును, ఈ సభవారును కర్తవ్యమును నిర్వహింపగలరని నమ్ముచున్నాను.

Sri R. NATHAMUNI REDDI :— అధ్యక్షా! ప్రస్తుతం మన ప్రభుత్వమువారు యీ గొప్ప గొప్ప irrigation projects నిర్మించుచున్నందులకు ఆనందము హర్షించుచున్నాము. కాని మెట్ట ప్రాంతములలో కొన్ని సంవత్సరములుగా ఈ స్కీములన్ని investigate చేసి కొద్ది లక్షల రూపాయిలతో పూర్తయ్యే ప్రాజెక్టులను మాత్రమే తీసుకొనుటవల్ల వాటిని జరపకుండాపోతారనే ఆందోళన మెట్టప్రాంతంలోని ప్రజల్లో వున్నది. 1947 వ సంవత్సరములో కళ్యాణి reservior scheme ను ఉమ్మడి రాష్ట్రములోనే budget లో provide చేసినారు. (అప్పట్లో మంత్రిగా భక్తవత్సలం గారు వుండిరి, తరువాత రంగారెడ్డిగారు వుండిరి.) కాని యింతవరకు దాని సమాచారము ఈ ప్రభుత్వమువారు బడ్జెట్టులో ఏమీ తలపెట్టినట్లు లేదు. ముఖ్యముగా యీ ప్రాజెక్టు పని పూర్తి అయినట్లయిన, తిరుపతి దాని పరిసర ప్రాంతములకు నీరు సమృద్ధిగా లభించును. అందులో ఇప్పుడు తిరుపతి వెంకటేశ్వర విద్యాలయము general hospital ఏర్పాటు చేయాలనే ప్రయత్నములో వున్నది. ఇటువంటిదానికి కూడా నీటి వసతి అనుకూలించును. విద్యుచ్ఛక్తి ద్వారా అక్కడి మెట్టపొలములకు నీరు పారించుకొనుచున్నాము.

ఈ ప్రాజెక్టు నిర్మించినచో spring channels లో indirect benefit బాగా ఉండును. బావులలో కూడా నీరు బాగా వుండి మా భూములన్నింటికి కూడ నీరు బాగా సప్లయి అవుతుంది. కనుక యీ స్కీమును తప్పక ప్రభుత్వమువారు త్వరలో జరిపెదరని కోరుచున్నాను. మరియు మూలపల్లి రిజర్వాయరు స్కీము ఉంది. అది కూడ భక్తవత్సలంగారు మంత్రిగా వున్నప్పుడు వచ్చింది. వారు ఈ స్కీమును త్వరలో తీసుకుంటామని చెప్పి వాగ్దానము కూడా చేసివున్నారు. కాని ఇంతవరకు అది ఏమైనదో తెలియకుండా వున్నది. ఈ స్కీము చాలా ముఖ్యమైనది. ఆ ప్రదేశం వేరే నీటి ఆధారములేని స్థలము కావట్టి ముఖ్యంగా ఈ స్కీమును కూడా తీసుకోవాలని కోరుతున్నాను. ఇదివరకు ప్రభుత్వం తమపాకం దగ్గర ఒక స్కీముకు investigation చేసి ఉన్నారు. దానికిగాను betterment levy కూడా ఇస్తామని ప్రజలు చెప్పినారు. దాని సమాచారాలు కూడా ఇంతవరకు తెలియలేదు. విద్యుచ్ఛక్తివల్ల మాజిల్లాలో వ్యవసాయము జరుగుచున్నది. కాని రేట్లు అధికంగా చేసినారు. దానివిషయం ఇదివరకే మనవిచేశాను.

ఇప్పుడు నందికొండ మొదలగు ప్రాజెక్టులు కట్టుచున్నారు. ఎన్నో కోట్లు ఖర్చుపెట్టుతున్నారు. దానికి గాను ధనం వడ్డీకి ఎవరిదగ్గరనుంచి వసూలు చేస్తున్నారో తెలియదు. కాని, విద్యుచ్ఛక్తి సరఫరా చేయు విషయంలో మాత్రము ఎన్నో కోట్లు ఖర్చు పెట్టుచున్నారు. ఇప్పుడు consumers దగ్గర వారు డబ్బు వసూలుచేస్తున్నామని

చెబుతున్నారు. ఇది న్యాయంకాదు. ముఖ్యంగా వ్యవసాయదారులకు రేట్లు అనుకూలంగా చేస్తారని కోరుతున్నాను. ముఖ్యంగా మన శాసనసభ్యులందరికి, సెంట్రలు గవర్నమెంటు వారు ఇచ్చినట్లు రైల్వే టిక్కెట్లు కూడా ఇచ్చి ఈ ప్రాజెక్టులు అన్నీ కూడా మన సభ్యులు చూచేదానికి ఏర్పాటు చేయాలని కోరుతున్నాను.

Sri T. LAKSMINARAYANA REDDI:— అధ్యక్షా, ఆంధ్రదేశం ముఖ్యంగా వ్యవసాయికదేశం అని, మనకు చాలా నదులు వున్నాయని, వాటికి ఆనకట్టలు కడుతున్నాం అని, ఈ వ్యవహారం అందరికి తెలుసును. కట్టబోయే ఆనకట్టలు గాని, త్రవ్వించే కాలువలు కాని ఎక్కువగా కంట్రాక్టర్లద్వారా చేయించడం తద్వారా చాలా విలంబనజరగడం, డబ్బు waste అవడం, జరుగుతోంది. ఈవిషయాన్ని గుర్తించి మొన్న శ్రీనగర్‌లో జరిగిన All India Engineers Conference వారు National Construction Organisation అనే దానిని ఏర్పాటుచేసి తద్వారా పనులను technical and skilled labour ద్వారా చేయిస్తే బాగుంటుందని ఒక ఉద్దేశానికివచ్చారు. అది బాగుంటుందని నేను అనుకుంటున్నాను. మనం కట్టబోయే ఆనకట్టలు త్రవ్వబోయే కాలవల విషయములో technical and skilled labour చేత పనులు చేయిస్తే బాగుంటుందని నేను అనుకుంటున్నాను. ఇరిగేషన్ విషయమై అనేక researches జరుగుతున్నాయి. మనకు సరియైన dessimilation లేక ఆవ్యవహారం అంతా సరిగ్గా తెలియడం లేదు. ఈ ఇరిగేషను విషయములో ఒక research section ఏర్పాటు చేయాలని నేను అనుకుంటున్నాను. మొన్న జరిగిన శ్రీనగర్ conference లో వచ్చే పంచవర్ష ప్రణాళికలో ఒక కోటిరూపాయలు ప్రత్యేకించాలని అన్నారు. ఆ విధంగా చేస్తే, ఒక స్టేషను ఆంధ్రదేశములో పెట్టేట్లు చూడాలని దానికిగాను ప్రయత్నం చేయాలని కోరుతున్నాను. ఈ dessimilation సరిగ్గాలేని కారణముచేత, soil గురించి మనం technicalగా scientificగా investigate చేసి కాలువలు త్రవ్వకపోతే, మన కె.సి. కెనాలు త్రవ్వేముందు water ఇంకిపోతుందని తద్వారా water supply చేయలేక పోతాం అని ఇంజనీర్లు గ్రహించలేక పోయారంటే హాస్యాస్పదంగా వున్నది. కె. సి. కెనాలుకు ఏర్పడిన చిక్కులు వంటివి ఏర్పడతాయి. ముందు Soil గురించి sub-soil water గురించి research చేయించి తరువాతనే పెద్ద కాలువలు త్రవ్వించడం చేయిస్తే బాగుంటుంది. కాలువల ద్వారానే కాకుండా sub-soil water tap చేస్తే filter points ద్వారా వ్యవసాయము ఎక్కువ చేయడానికి అవకాశం ఉంటుంది. అలా చేస్తున్నాం. ఈ విషయములో తూర్పు గోదావరిజిల్లాలో చాలామంది boring tube walls త్రవ్వి sub-soil water విషయములో technical knowledge సరిగా లేని కారణముచేత నీరుపడక వేలాది రూపాయలు నష్టపడినారు. ఈ వ్యవహారం విషయములో ఇప్పటినుంచైనా శ్రద్ధ తీసుకోవాలని మనవి చేస్తున్నాను. మరొక చిన్న విషయము. P.W.D. లో ఇదివరకు కంటె అవినీతి తక్కువగా వున్నదని మంత్రిగారు సెలవిచ్చారు. ఇప్పటికి కూడా గ్రామాలనుంచి రు 100, 200 లు మామూళ్ళులంచాలు అడక్కండి తీసుకోవడం సాగిపోతూనేవుంది. అందరికీ తెలుసు. దానిని అరికట్టడానికి మనం ఏకోరకమైన ప్రయత్నం చేయవలసి వుంటుంది.

21st July 1955]

Sri CHOWDARY SATYANARAYANA :— అధ్యక్షా, ఉపముఖ్య మంత్రిగారు ప్రవేశపెట్టిన ఈ ఇరిగేషను బడ్జెటును నేను బలపరుస్తూ కొన్ని విషయాలు చెప్పదలచుకున్నాను. మన గవర్నరుగారి ఉపన్యాసంలో వంశధార ప్రాజెక్టును ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో తెస్తాము అని చెప్పి వున్నారు. ఇపుడు ఈ బడ్జెటులో వంశధార ప్రాజెక్టు గురించి ఏమీ లేకపోవుటచేత జిల్లాలోని ప్రజలందరు చాలా నిరుత్సాహం చెందుతున్నారు. ఇపుడు ఉపముఖ్యమంత్రిగారి ప్రథమ ఉపన్యాసములో వంశధార ప్రాజెక్టును ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చేర్చుటనుగురించి వారు సెలవిచ్చారు. కాబట్టి వారికి మా ధన్యవాదాలు. మా శ్రీకాకుళం జిల్లా చాలా వెనుకబడినజిల్లా. ఇందులో చీపురుపల్లితాలూకా చాలా మెట్టప్రాంతం. నారాయణపురం ఆనకట్టకు ఇదివరకు foundation వేశారు. ఒకమిలా అది కొంతవరకువచ్చి ఆగిపోయియున్నది. మళ్ళీ ఇపుడు ప్రారంభిస్తున్నారు. కాబట్టి దానిని కొంచెం improve చేసి highlevel channel గా చేస్తే మా తాలూకాలో ఎక్కువ సాగు కావడానికి అవకాశం వుంటుంది. నందివాడ ప్రాజెక్టుకు కూడా ఎన్నో సంవత్సరాలనుంచి estimates తయారుగా వున్నవి. కాబట్టి ఆ ప్రాజెక్టును కూడా ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చేరిస్తే మా చుట్టుప్రక్కల పాలకొండతాలూకాలో కూడా చాలావరకు నీటివసతులకు అనుకూలిస్తుంది అని మనవిచేస్తున్నాను. మా చీపురుపల్లి తాలూకాలో ఇదివరకు మొత్తం అంతా ఎస్టేటు గ్రామాలుగా వుండడంచేత ఎస్టేట్లు పోతాయని జమీందారులు చాలావరకు చెరువులనుబాగుచేయకుండా 8 సంవత్సరాలు విడిచిపెట్టారు. 1950 లో గవర్నమెంటువారికి hand over చేసి తరువాత కూడా ఇంతవరకు చెరువులు మరమ్మతులులేక దిబ్బలుపడి హీనస్థితిలో వున్నాయి. ఇదివరకు కొన్ని చెరువులు Food Production శాఖ వారు take up చేసి estimates తయారు చేశారు. కాని మాకు grants లేవని చెబుతున్నారు. కాబట్టి సదరు division కు మా తాలూకాకు సంబంధించినంతవరకు grants ఎక్కువ చేయాలని కోరుచున్నాను. ఇదివరకు మే నెలలో అధిక వర్షాలవల్ల పడిన గండ్లు ఇంతవరకు Estate Managers పూడ్చలేదు. వర్షాకాలం సమీపిస్తున్నది. కాబట్టి నాట్లు వేయవలసిన సమయం వచ్చింది. ఇంతవరకు గండ్లు పూడ్చనపుడు వర్షాలు పడినా ఏమిలాభం ? ఈ విషయంలో ఎన్ని అర్జీలు పెట్టినా ఇంతవరకు estimates sanction కాలేదని చెప్పి ఇంతవరకూ సదరు గండ్లను పూడ్చలేదు. దానినిగూర్చి వెంటనే చర్యతీసుకోవాలని విశదం చేస్తున్నాను; ఇదివరకు Food Productionశాఖవారు మేరు మహమ్మదుపురం చెరువుకు షుమారు 80 వేల రూపాయిలువరకు ఖర్చుచేసి 2000 ఎకరాలు మెట్టభూమిని పల్లంచేయడానికి ఒక channel sanction చేసి వున్నారు. దానిని ఇంతవరకు Food Production వారు అదిగో ఇదిగో అని కాలయాపన చేస్తున్నారు. సదరు సొమ్ము ఖర్చుచేసి వారు ఇంతవరకు improvement చేయలేదు. కాబట్టి సదరు channel త్రవ్వడానికి వెంటనే order జారీచేయడానికి కోరుచున్నాను.

Sri K. VENKATARATNAM :—అధ్యక్ష మహాశయా, డిప్యూటీ ముఖ్యమంత్రిగారు ఇరిగేషను శాఖకు కోరినటువంటి డిమాండును నేను బలపరుస్తున్నాను. అయితే కొన్ని విషయాలు మాత్రం ఇందులో చెప్పవలసియున్నది. బుడమేరు ప్రాజెక్టు విషయమై మొన్న ప్రశ్నల సందర్భంలో చెప్పారు. ముందుగా మాట్లాడినపుడు డిప్యూటీ ముఖ్యమంత్రిగారు మరల బుడమేరు మళ్ళింపుస్కీము గురించి

చెప్పారు. నందిగామలో ఆనకట్టకట్టాలని, రెండవది విజయవాడ, గన్నవరం, గుడివాడ, కైకలూరు తాలూకాలలో, ఈ 4 తాలూకాల సరిహద్దులలో గ్రామాలను భూములను అన్నింటితో సహా ముంచుతోంది కనుక కరకట్టలు కట్టాలని P. W. D. వారు proposal పెట్టారు. ఇప్పుడు నందిగామదగ్గర కవులూరువద్ద diversion స్కీము ఒకటి ఉపముఖ్య మంత్రిగారు సెలవిచ్చారు. మూడూకలిసి combined గా వున్న స్కీము ఏ కారణంచేత విరమించారో తెలియదు కాని, మొత్తంమీద Government of India వారు వరద నివారణ స్కీములక్రింద sanction చేసినవి రెండే కన్పిస్తున్నాయి. కొల్లేరు గురించి చెప్పారు. నందిగామ, కవులూరులవద్ద division schemes, కరకట్లు గల ఈ స్కీము ఉపయోగం వుంటుంది కాని, రెండే చేస్తే నాలుగు తాలూకాలలో వుండే భూములు వరదల వల్ల ప్రతి సంవత్సరము మునుగుతూ నష్టం కలుగుతుంది. ఒకదానితో ఒకటి సంబంధంవున్న ఈ మూడు స్కీములు—ఇండియా గవర్నమెంటువారు వరద నివారణబోర్డులో రెండే sanction చేసినప్పటికి — P. W. D. వారి సూచన ప్రకారంగా పూర్తిగా అమలు చేయాలని మనవి చేస్తున్నాను.

పోతే రెండోది కంకిపాడు south channel. ఈ కంకిపాడు ప్రాంతంలో మురుగు నీరు పోవడానికి ఒక గ్రామం 50 వేల రూపాయలు కూడా contribution యిస్తాం అన్నారు. ఈ మురుగు నీటిని తీసుకువెళ్ళి గుండేరులో చేర్చడానికి గత 7, 8 సంవత్సరాలనుంచి కూడా petitions పెడుతున్నారు. వారు 50 వేల రూపాయలు contribution యిస్తాం అన్నప్పటికీ 6 సంవత్సరాలనుంచీ కూడా ఇంతవరకు చేయనందువల్ల ఒక సంవత్సరం 2 బస్తాలు, 3 బస్తాలు పండుతున్నది. అందుచేతనే ఎకరానికి రు 200 లు తీసుకొని గవర్నమెంటుసహాయం చేయవలసినదిగా కోరుతున్నారు. అటువంటి దానిని కూడా డిప్యూటీ ముఖ్యమంత్రిగారు ఆలోచించవలసి యున్నది. తిరువూరు తాలూకాలో కట్టలేరు, రామన్నపాలెం స్కీములు వున్నవి. ఇప్పుడు 2, 3 చోట్ల గవర్నమెంటు షరతులన్నిటికీ ఒప్పుకుని ఏవో కొన్ని bond లు కూడా వ్రాసి యిచ్చారు. ఈ నందికొండ వ్యవహారంలో అవి stop చేశారు. కాని అక్కడ వున్నటువంటి రైతుల వాదనవింటే 15 సంవత్సరాలనుంచి అన్నీ సిద్ధం చేసుకున్నాం, అవసరమైతే డబ్బు యివ్వడానికి సిద్ధంగా వున్నాం, మా స్కీములన్నీ యిప్పుడు అమలు జరపకపోతే 15 సంవత్సరాల లోపల బ్రతుకుతామో చస్తామో అనే సిద్ధాంతంలో వున్నారు. డిప్యూటీ ముఖ్య మంత్రిగారు తప్పకుండా రైతుల యొక్క గోల విచారించవలసిన అవసరం వున్నదని మనవి చేస్తున్నాను. పోతే ఒక విషయం; డిప్యూటీ ముఖ్యమంత్రిగారు P.W.D. అవినీతి సంగతికూడ చెప్పారు. దానిని ఏ పరిస్థితులలోను అంగీకరించడానికి వీలులేదు. ఖచ్చితంగా కావాలంటే వందలకొలది కేసులు తెచ్చి చూపిస్తాను. ఏమీ చేయడానికి దారిలేదు. వారంతా అవినీతి పరులని డిప్యూటీ ముఖ్య మంత్రిగారిని అనమని నేను అనను. వారిని ఉత్సాహపరచవలసినదే. నిజముగా అవినీతని కొంత కాకపోతే కొంతయినా తగ్గించే ఉపాయం చూడమని మనవి చేస్తున్నాను. గ్రామాలనుంచి complaints వస్తే వారి పొట్టగొట్టడం నా వుద్దేశం కాదు. డిప్యూటీ ముఖ్య మంత్రిగారు ఆ విధంగా మాట్లాడితే నిజము ఋజువు చేయలేరు. ఉద్యోగస్థు లెవరూ వినరు. అవసరమని తోస్తే తగిన చర్యకూడా తీసుకోమని నేను మనవి చేస్తున్నాను.

21st July 1955]

*Sri P. GUNNAYYA:— అధ్యక్షా! ఇరిగేషను బడ్జెటును నేను బలపరుస్తూ కొన్ని విషయాలు ప్రభుత్వం వారికి మనవి చేస్తున్నాను. నందికొండ, వంశధార లాంటి ప్రాజెక్టులు సంజీవరెడ్డిగారు ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చేర్చడం వల్ల భారతదేశ భవిష్యత్తు ముంపంజ వేసినదని ఆంధ్రదేశంలో ప్రజలందరూ అనేక వందనములు సమర్పిస్తున్నారు. నేను 10 వేల వందనములు సమర్పిస్తున్నాను. కాని శ్రీకాకుళం జిల్లా చాలా వెనకబడి వున్నది. శ్రీకాకుళం జిల్లా విషయంలో సంజీవరెడ్డి గారికి పట్టుకు అంతగా చెప్పనక్కరలేదు. పార్వతీపురం దగ్గర జంజావటి నది వున్నది. ఆనదికి అలమండ దగ్గర ఆనకట్ట కట్టినట్లయితే కనీసం 30 వేల ఎకరాలు, ఆ తాలూకాలో 400 గ్రామాలలో 3 పంటలకు అవకాశం కలుగుతుంది. ఇప్పటికి సుమారు 5 సంవత్సరాల నుంచి ఆంధ్ర ప్రభుత్వంకు అయితేనేమి, ఉమ్మడి మద్రాసు ప్రభుత్వం వున్నప్పుడయితేనేమి అనేక memorandum లుయిచ్చి ఆందోళనచేసినారు. ఇంతవరకు కనీసం investigation అయినా చేయించలేదు. కాబట్టి శ్రీ సంజీవరెడ్డిగారు బడ్జెటులో కొంత డబ్బు కేటాయించి అలమండ ఆనకట్ట కట్టించి ఆ తాలూకా ప్రజల నిరుత్సాహాన్ని తొలగించడానికి తగినటువంటి కృషి చేస్తారని, వారికి ప్రజల తరపున అనేక కృతజ్ఞతా వందనములు సమర్పిస్తున్నాను. తరువాత పాతపట్నం తాలూకాలో పాలవలస వద్ద కనీసం 1, 2 లక్షల రూపాయలు చేసే స్కీముపల్ల 5, 6 గ్రామాలలో 3000 ఎకరాలు వరకు మూడు పంటలు పండే అవకాశం కలుగును. అదే విధంగా దిమిలిగడ్డ వున్నది. అదికూడా 3, 4 గ్రామాలలోని వెయ్యి ఎకరాలకు నీరిస్తుంది. అదే విధంగా ఇరవాడు దగ్గర ఒక గడ్డ వున్నది. 10 గ్రామాలవారికి నీరు వస్తుంది. అందుచేత ఇలాంటి చిన్న చిన్న minor irrigation schemes ను త్వరలోనే శ్రీ ఆంధ్ర ప్రభుత్వంవారు శ్రీ సంజీవరెడ్డిగారు పూనుకొని ఆ తాలూకాలో వున్న ప్రజలకు తగిన సౌకర్యం కలుగజేస్తారని ప్రార్థిస్తున్నాను.

తరువాత పాతపట్నం తాలూకాలో వున్నటువంటి 2,000 చెరువులు మరమ్మతులు లేకుండా వున్నవి. ఆ చెరువులకు engineering staff లేదని P. W. D. వారు అనేక సార్లు వ్రాసి వున్నారు. ఆ staff యిచ్చి పాతపట్నం చెరువులన్నీ త్వరలోనే మరమ్మత్తులు చేయించాలని కోరుతున్నాను. తరువాత నెవగాము, ముగ్గలింగం, హంస,కడుంపద్ద వంశధారనది పొంగి అనేక గ్రామాలు ముంచుకొని పోతున్నాయి. ఆ flood bank కట్టడానికి 3 సంవత్సరాలయి ప్రజలు దరఖాస్తులు పెడుతున్నారు. ఇంతవరకు estimate లు తయారు చేయలేదు. కాబట్టి అక్కడ తగినటువంటి flood bank కట్టించి ఆ ప్రజల సౌకర్యానికి సంజీవరెడ్డిగారు పూను కుంటారని ఆశిస్తూ నా వందనాలు సమర్పిస్తూ, అధ్యక్షుల వారికి పదివేల నమస్కారాలు సమర్పిస్తున్నాను. నవగాముపద్ద వంశధారకు మనుష్యులు బళ్ళు రానుపోను ఒక ఆనకట్ట కట్టించి ఆ తాలూకా ప్రజల కష్టములు తొలగిస్తారని కోరుచున్నాను.

*Sri. M. PYDAYYA NAIDU:— అధ్యక్షా, విశాఖపట్నం జిల్లా, అనకాపల్లి తాలూకా estate గ్రామాల కాలువకట్టు వగైరాలకు యింతవరకు మరమ్మత్తు వగైరాలు చేయలేదు. నరసాపురం దగ్గర ఆనకట్ట ఉన్నది. 34 సంవత్సరాలుగా P. W. D. మరమ్మతులు చేయడం, ముంపు వెంటనే కొట్టివేయడం జరిగింది, మేము engineer లను అడిగితే ఎస్టిమేటు చేయించాము, Superinten-

ding Engineer గారికి పంపించాము అని తెలవిచ్చారు. ఇంతవరకు estimate రాలేదు. ఎస్టిమేటు వెంటనే తెప్పించి స్థిరమైన ఏర్పాటు చేయించమని నేను ప్రార్థిస్తున్నాను. ఆ కాలువ యింతవరకు మరమ్మత్తుచేసి యుండలేదు. ఆ కాలువ మరమ్మత్తు చేస్తారని కోరుతూ విరమిస్తున్నాను.

*Sri P. PAMIDESWARA RAO :— అధ్యక్షా! బందరు తాలూకాలో వెనుకబడిన ప్రాంతాలకు irrigation సౌకర్యాలు కలుగజేసి సుమారు 60 సంవత్సరాలు అయినది. అప్పటికి సాగుకు అనుకూలమైన భూమికి మాత్రం పంట నీటి సౌకర్యం కలుగజేసివున్నారు. ఇప్పుడు సాగుభూమి పూర్వంకంటె రెట్టింపు పెరిగినది. ఈ రెట్టింపు భూమికూడ పూర్వం ఏర్పడిన పంటనీటి సౌకర్యంవల్లనే సాగు అగుచున్నది. కాని నీటి తీరువ మాత్రం మొత్తం సాగునకు వసూలు చేయబడుచున్నది. అనగా పూర్వం 5 వేలు శిస్తు చెల్లించే గ్రామం యిప్పుడు 7,500, 10 వేలు చెల్లించవలసి వచ్చుచున్నది. నీటి సౌకర్యం మాత్రం యింతవరకు ఏ మాత్రం వృద్ధిచేయబడలేదు. అందువల్ల రైతులు సాగుచేసే భూములకు నీరు చాలక అర్థపంటమాత్రమే పండి వ్యవసాయపు ఖర్చులు కూడ కిట్టక బాధపడుచున్నారు. కాబట్టి ప్రభుత్వమువారు యీ విషయం ఆలోచించి వెనుకబడివున్న మా ప్రాంతాలకు సరైన నీటి వసతులు కలుగజేయవలసినదిగా తమ ద్వారా ప్రభుత్వమునకు తెలియజేయుచున్నాను.

తరువాత మా తాలూకాలో మెట్ట ప్రాంతముగా వున్న మల్లేశ్వరం ఫిర్కాల్లోని గొల్లపాలెం వగైరా గ్రామాలకు, నందమూరు ఫిర్కాలోని తాళ్ళపాలెం గ్రామాలకు పంట నీటి సౌకర్యం నూతనంగా కలుగజేయవలసి వున్నది. ఆ గ్రామములకు పంటనీటి సౌకర్యం కలుగజేయడానికి ప్రభుత్వానికి ఎక్కువ ఖర్చు కాదు. కాని కొన్ని వేల ఎకరములు సాగులోనికి వచ్చి ప్రభుత్వం ఖర్చుపెట్టిన సొమ్ము 3, 4 సంవత్సరాలలో తీరిపోతుంది. కాబట్టి యీ గ్రామాలలో వెంటనే పంటనీటి సౌకర్యం కలుగజేయవలసినదిగా ప్రభుత్వమును కోరుచున్నాను. తరువాత ఇప్పుడు బడ్జెటు లోటును కొంతవరకు భర్తీ చేయడానికి హెచ్చుచేసిన పన్నులను బట్టి చూస్తే వ్యవసాయమే వృత్తిగా కల్గి పూర్వం ఎప్పుడో పంటనీటి సౌకర్యాలు నామ మాత్రంగా కలుగజేయబడి పండినపంట వ్యవసాయ ఖర్చులకే చాలక బాధపడుటయేగాక పండిన కొద్ది పంటను మార్కెట్‌లోనికి తీసుకొని పోయి అమ్ముకొనుటకు మార్గ సౌకర్యములు లేక, వైద్యసౌకర్యాలు అసలే లేక.........

Mr. SPEAKER :— ఆ demand వచ్చినపుడు మరొకనాడు మట్లాడవచ్చును. ఇప్పుడు irrigation మీద మాట్లాడండి.

Sri P. PAMIDESWARA RAO :—

విద్యాసౌకర్యములు ఇప్పుడిప్పుడు నామ మాత్రముగ కల్పించబడి, వైద్య సౌకర్యాలు అసలే లేక సముద్ర ప్రాంతమున ఉన్న బందరు తాలూకా, కొల్లేటి ప్రాంతంలో వున్న కైకలూరు తాలూకాలవంటి వెనుకబడిన తాలూకాలలోని రైతులు దుర్భర జీవనము గడుపుకొనుచూ, ప్రజా ప్రభుత్వం వచ్చినతరువాత వారి కష్టములు పోవును అని పెట్టుకున్న ఆశలను కోల్పోవుటయే గాక వారి కుటుంబములను పోషించుటకు చాల బాధ పడుతున్నారు. కాబట్టి ఆలా వెనుకబడి ఉన్న ప్రాంతములోని ప్రజలు బాధ పడకుండా వాండ్ల కష్టములను తీర్చవలెనంటే, రైతులమీద పెంచిన ఈ నీటి తీరువను

తగ్గించి, ధాన్యాదుల ధరలు తగ్గి బాధపడుచున్న రైతులకు తప్పక రక్షణ కలుగచేయ వలసినదిగ నేను ప్రభుత్వంవారిని కోరుతూ, ఇంతటితో సెలవు తీసుకొంటూ ఉన్నాను.

*Sri V. VISWESWARA RAO:— అధ్యక్షా ! బడ్జెటు ఉపన్యాసంలో మంత్రి గోపాలరెడ్డిగారు సమాధానం చెప్తుతూ అదనపు పన్నులు గన్నవరం, గుడివాడ, రేపల్లె వంటి తాలూకాలకు వేయబోతున్నాము గాని మెట్ట ప్రాంతాలకు వేయపోవడం లేదని చెప్పారు. కారణం ఆ గ్రామాలన్ని సస్యశ్యామలంగా నీటి పారుదల సౌకర్యాలతో ఉన్నాయని, ఎక్కువ పంట పండించుకొంటాయి కొబట్టి వాండ్లకు వేస్తామన్నారు. ఆ తాలూకా విషయంగాని, జిల్లా విషయం గాని చూస్తే మనకు ఒక విషయం స్పష్టంగా బోధపడుతుంది. Deputy Chief Minister గారు చెప్పినటుల క్రిష్ణానది ఆనకట్ట పగిలిపోయినపుడు ప్రత్యేకించి అక్కడ ఒక national emergency అను పేరుతో మొత్తం రెండుకోట్ల రూపాయలుపైగా పనిచేయించడం జరిగింది. కొత్తగా అక్కడ barrage scheme తయారుచేయడంజరిగింది. అయితే ఈ barrage scheme క్రింద ఇదివరకు ఉండే 12 లక్షల ఎకరములు సాగుచేయడమే కాకుండా, క్రొత్తగా 2, 3 లక్షలఎకరములు సాగుఅయ్యే అవకాశం ఉందని పభుత్వం అంచనాలవల్ల తెలుస్తున్నది. అయితే వెంటనే ఈ మూడు లక్షల ఎకరములను కూడ ఈ బ్యారేజి స్కీము తయారు అయ్యేనాటికే సాగులోనికి తీసుకొని రావటానికి కొత్తగా కాలువలు త్రవ్వాలి. ఇదివరకే ఉన్న కాలువలను పొడిగించవలసిన అవసరం ఉంది. వాటికొరకు ఏమైనా చర్యలు తీసుకొంటున్నారా అంటే తీసుకోక పోవడం జరుగుతున్నది. తుంగభద్ర ఎగువ దిగువ కాలవలు అని చెప్పి 40 కోట్ల రూపాయలు పెట్టి మన dams కట్టించడం జరిగింది. కాని ఈనాడు ఇప్పుడిప్పుడే భూమిని సాగులోనికి తీసుకొని రావడానికి ప్రయత్నాలు చేయడానికి పూనుకోవడం జరుగుతున్నది. డాములుకట్టినతర్వాత కాలువలుత్రవ్వటానికి పూనుకొంటున్నారు. ఆతర్వాత వాటి నీరంతా పారించుకోడానికి చిన్న కాల్వలు, పెద్ద కాల్వలు వేరే త్రవ్వవలసిన అవసరం ఏర్పడుతుంది. Dam లతో పాటు ఈ కాల్వను కూడ త్రవ్వటకు మనము పూనుకుంటే వెంటనే ఆహారోత్పత్తికి అవకాశం ఉంది. వెంటనే ఈ dam తో పాటు కాల్వలు కూడా పూర్తిఅగుటకు అవకాశం ఉంది. ఇప్పుడు గుంటూరు జిల్లాలో పెద నందిపాడు కాలువ అనే పేరుతో ఒకటి ఉంది. ఇదివరకే ఒక 70 వేల ఎకరములు సాగులోకి తీసుకొని రావడానికి అవకాశం ఉందని చెప్పి కొన్ని estimate లు తయారు అవటం జరిగింది. దానిని ప్రత్యేకంగా తీసుకొని పూర్తి చేయవలసిన అవసరం ఉంది. కృష్ణా జిల్లాలో ఏలూరు కాల్వలో నీరు సరిపోవటంలేదని చెప్పి కృష్ణనుంచి high level కాలవ త్రవ్వవలెనని ఇదివరకే proposals ఉన్నాయి. Investigation జరుగుతున్నది అని తెలుస్తున్నది. ఆ పనిని వెంటనే పూర్తిచెయ్యాలి. ఇదేకాకుండా సముద్రపు ఒడ్డునున్నటువంటి దివి తాలూకా, కైకలూరు తాలూకా, బందరు, రేపల్లె తాలూకాలలోని కాలవలన్నీ కూడ సముద్ర ప్రాంతానికి వెంటనే extend చేయవలెను.

ఆ విధంగా చేసినపుడే మన కృష్ణా barrage scheme లో వచ్చేటటువంటి నీటిని అంతా సక్రమంగా వినియోగించుకో గలుగుతాము అనేది మనము గుర్తించవలెను. ప్రత్యేకించి సముద్రప్రాంతములో వేసంగికాలంలోగాని, మామ్మూలుగా కొన్ని సందర్భా

లలో వర్షాకాలంలోకూడ ఆ ప్రజానీకం మంచి నీళ్ళు లేక కొన్ని కొన్ని మైళ్ళదూరం వెళ్ళి మంచినీళ్ళు తెచ్చుకోవలసిన అవసరం ఉంది. వాళ్ళకి ఇందాక Doctor రంగయ్య గారు చెప్పినట్లుగా, every where water అని చెబుతూ సాగుచేయటానికి నీళ్ళు మాత్రం లేవు. అంతేగాక వాండ్లచుట్టూ నీరు ఉంటుందిగాని, త్రాగటానికి మాత్రం నీళ్ళులేని పరిస్థితులు కనబడుతాయి. కారణం ఏమంటే ఆ చోటులన్నీకూడ ఉప్పు నీటితోనే నిండిపోయి ఉండేటటువంటివి. వాటికి మంచినీళ్ళు పంపించవలసిన అవసరం ఉంది. ఇదేకాదు. కృష్ణాజిల్లా తీసుకుంటే అపారమైన మురుగు వస్తుంటుంది. మనము గత వంద సంవత్సరాలు తీసుకొన్నప్పటికి కూడ krishna ఆనకట్ట ఎంతో అభివృద్ధి చేయడం జరిగింది. కాని మురుగు నివారణ scheme లు ఇంతవరకు ఏమి చేయటం జరుగలేదు. కృష్ణాజిల్లా మధ్యలో కొల్లేరు సరస్సుఉంది. ఈ సరస్సులోకి అటు బుడమేరునుంచి, ఇంకా తమ్మిలేరునుంచి ఇంకా అనేక uplands లో బయలుదేరిన మురుగు కాలువలనుంచి మురుగునీరు వచ్చిపడుతుంది. ఆ మురుగు నీటిని ఉప్పుటేరు సముద్రంలోకి తీసుకొని వెళ్ళలేకపోవటం జరుగుతున్నది. అందువల్ల ఆ భూమి అంతా కూడ నీటి మయమై ముంపుతో నిండిపోవడం జరుగుతున్నది. ముంపు నివారణ scheme ను వెంటనే అమలు జరుపవలసిన అవసరంఉంది. అందుకొరకు బుడమేరుకు చాలా రోజులనుంచి, 50, 60 సంవత్సరాలనుంచి ఒక reservoir కావలెనని, బుడమేరు diversion scheme కావలెనని, మిగిలిన నీటిని కొల్లేటివరకు తీసుకొని వెళ్ళడానికి కట్టలు కావలెనని అనేక సంవత్సరాలుగా అందోళన చేస్తూవచ్చారు. ఈ బడ్జెటులో చూపించినప్పటికి, కేంద్రప్రభుత్వానికి వీటి విషయంలో సిఫార్సు చేశామని మంత్రిగారు చెప్పారు. అయితే దీనికి ఎప్పటికప్పుడు priority ఇవ్వడం జరిగినా పనిజరగడం లేదు. ఇది బడ్జెటులోటువల్లనో మరి ఇంకే కారణము వల్లనో వాయిదాలు వేయడం జరుగుతున్నది. క్రిష్ణా జిల్లాలో రైతాంగంపైన అదనపుపన్ను వేయవలెనని ఆలోచించినపుడుగాని, క్రిష్ణాజిల్లాలో నీరు అంతా సక్రమంగా ఎక్కువ ఇస్తున్నామని చెప్పేటప్పుడు గాని అక్కడ మురుగు నివారణ స్కీముల విషయం మాత్రం ప్రభుత్వ దృష్టిలోకి రాకపోవడం, వాటిని వెంటనే తీసుకోవాలని ఆలోచన లేకపోడం విచారకరం. అదే విధంగా తీసుకుంటే కైకలూరు తాలూకాలో పోలరాజు మురుగు కాలవ, పెద్ద కొమ్మ్రేరు మురుగు కాలవ ఇంకా అనేక చిన్న చిన్న కాలవలు ఉన్నాయి. వాటి వల్ల ఎంతో భూమి మురుగుతో నిండిపోవడం, ఆ భూమి పండకపోవడం, ఒక సంవత్సరం 3, 4 బస్తాలే పండటం ఈ విధంగా జరుగుతున్నది. ఇదే విధంగా దివి తాలూకాలో గుండేరు అని, ఐనంపూడి drain అని అనేక పేర్లతో మురుగు కాలువలు ఉన్నాయి. క్రిష్ణాజిల్లాలో ఎంతో returns వస్తుంది. క్రిష్ణా ఆనకట్టక్రింద 16.2 % returns వస్తుంది. ఇది మన భారతదేశంలో గోదావరి project మినహా ఏ ప్రాజెక్టుక్రింద ఇంత ఆదాయం రావడం లేదని, దీని మూలంగా ప్రభుత్వానికి అనేక కోట్లు ఆదాయం వచ్చిందని గుర్తించుతూ మురుగు నివారణ స్కీములు వచ్చేటప్పుడు మాత్రం వాటి విషయంలో ప్రభుత్వం ప్రత్యేక దృష్టితో చేయక పోవడం అనేది చాలా విచారకరం. అదే విధంగా క్రిష్ణాజిల్లాలో 12 లక్షల ఎకరములే కాకుండా, మెట్టతాలుకాలు చాలా ఉన్నాయి. బెజవాడ, నందిగామ, తిరువూరు, నూజివీడు మెట్ట తాలూకాలు ఉన్నాయి. వీటి విషయం ఆలోచించాలి, ఘనగ్గాల ఉంది. అది నైజాంస్టేటు మధ్య 30 గ్రామాలతో వ్యాపియున్నది. దానికి

వర్షమే ఆధారం. అక్కడ ఒక వాగు ఉన్నది. దానినుంచి కాలవత్రవ్వితే 4, 5 గ్రామాలకు నీరు పారించవచ్చును. శాశ్వతంగా నీరు సప్లయిచేయవచ్చును. ఇదివరకే జమీందారు ఒక ప్లాను వేయడం సుమారొక furlong మేర త్రవ్వడంకూడ జరిగింది. కాని జమీందారి చట్టం వస్తుందని, భూములన్నీ ప్రజలే తీసుకొంటారని భయపడి తమ స్వంత కమతాలు కూడ అమ్మివేసుకోవడం ప్రారంభించిన తరువాత దానివల్ల ఫలితం లేదని మానివేయడం జరిగింది. దాని విషయంలో ప్రభుత్వం వెంటనే చర్య తీసుకొని దానిని బాగుచేయడానికి, త్రవ్వించడానికి పూనుకుంటే ఆ వాగునుంచి 4, 5 గ్రామాలలో చాల తక్కువ పెట్టుబడితో పంటలు పండించుటకు అవకాశం ఉంటుంది. ఆ రైతులు ఇబ్బంది పడకుండా పంటలు పండించవచ్చును. అదే విధంగా విజయవాడ తీసుకుంటే కొండలమధ్య రెండు ఊళ్ళు ఉన్నాయి. గూడెం మాధవరం, దుగ్గిరాల గూడెం అని కొండలమధ్య గ్రామాలు ఉన్నాయి. వాటికి నందికొండగాని బహుశా ఏ కాలవవచ్చినాగాని నీరులభించే అవకాశం లేదని అక్కడ పరిస్థితులనుబట్టి తెలుస్తున్నది. రెండు ప్రక్కల కొండలున్నాయి. రెండు కొండలు కలిపితే గార్లకట్టచెరువు అనే పేరుతో తక్కువ ఖర్చుతో (ఒక లక్షరూపాయలతో) 3, 4 గ్రామాలకు నీళ్ళు పారించే అవకాశం ఉంది.

తరువాత అవినీతి (corruption) విషయములో, దీన్ని ప్రత్యేకించి వివరంగా చెప్పదలచుకోలేదు. కాని ఈనాడు జరుగుతున్నటువంటి contracts పద్ధతి కాకుండా labour contracts societies ద్వారానో లేక job works ద్వారానో ఎక్కువ పనులు ప్రారంభిస్తే ఆ యా స్థానిక రైతులు, ప్రజలు ఉత్సాహంతో పనిలో పాల్గొని ఎక్కువ కృషిచేయడం జరుగుతుంది. దీనివల్ల కొంతడబ్బుకూడ కలిసి రావడానికి అవకాశమున్నది. ఆ విధానాన్ని ప్రభుత్వము అనుసరించవలసిందని ఆ విధంగా చేసినప్పుడే మనకు ఈనాడు ఉన్నటువంటి డబ్బుతో ఇంకా ఎక్కువ పని చేసుకోడానికి అవకాశముంటుందని నేను అభిప్రాయ పడుతున్నాను. మొన్ననే ముఖ్యమంత్రిగారు మాట్లాడుతూ నీటితీరువా విషయంలో resettlement ఎప్పుడు జరగలేదు, నెల్లూరులో నాకు తెలిసినంతవరకు జరగలేదని అన్నారు. కాని గుంటూరు జిల్లా, కృష్ణా పశ్చిమ గోదావరి జిల్లాలకు సంబంధించినంతవరకు చూస్తేబహుశా 1929లో ఒక resettlement జరిగిందని అప్పుడు రూపాయకు మూడు అణాలు శిస్తు పెంచడం దానికి వ్యతిరేకంగా అనేకమంది కాంగ్రెసువాదులు, రైతాంగమంతా ఆనాడు దానిని వ్యతిరేకించి అప్పటికి ఉన్నటువంటి పన్నులనే మోయలేకుండా ఉంటే ఇది భరించడం సాధ్యంకాదని ఇది సరియైన పద్ధతికాదని వారంతా ఆందోళన చేశారు. నదరానాఫీజు అని 25 రూపాయలు inclusion fees అని వేసినప్పుడు వాటన్నిటినీ రైతాంగం వ్యతిరేకిస్తూ ఆందోళన చేస్తూ వచ్చింది. అయినా వీటిని దృష్టిలో తీసుకోకుండా ఎప్పటికప్పుడు ప్రభుత్వము ఆయకట్టు రూపములో నీళ్ళు ఇచ్చినా, ఇవ్వకపోయినా, అనేక విధాలుగా శిస్తుపెంచు కొంటూ వచ్చారు. పనులు మాత్రం చేయడంలేదు. అందుచేత ఈనాడు పెంచబోయే శిస్తులుగురించి తీవ్రంగా ఆలోచించవలసిన అవసరమున్నదని మనవిచేస్తూ విరమిస్తున్నాను.

Sri R. B. RAMAKRISHNA RAJU :—అధ్యక్ష మహాశయా! మనము ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో ఉన్నప్పుడు ఆంధ్రదేశానికి అభివృద్ధి కరమైన కార్యక్రమాలు జరుగడంలో మనకు తగు ప్రోత్సాహం లేదనన్ని, ముఖ్యంగా దేశాభివృద్ధికి

రైతులకు కావలసినటువంటి ఈ నీటివనరులు, irrigation విషయములలోను కార్యకలాపాలు చాలా కుంటుబడినవనిన్నీ మనము వేరు పోవడానికి ప్రయత్నము చేశాము. ఆ ప్రయత్నం సఫలమైంది. అది సఫలమైన తరువాత ఈ irrigation విషయములో మన దేశము వృద్ధికి రావలెనని మనమందరము ఆశిస్తున్నాము. ప్రభుత్వమువారు కూడ అదే ఆశతో పనిచేస్తున్నారు అని వినడానికి చాలా సంతోషంగా ఉన్నది. మనదేశములో కావలసినటువంటి irrigation ప్రణాళికలను మంత్రిగారు మూడు విధములుగా- (1) major projects, (2) medium projects and (3) minor projects- అని నిర్వచించారు. తరువాత flood control projects అనికూడా అంటున్నారు. ఈ నాలుగున్నూ జరుగవలెనని అందరు ఆశిస్తూ ఉన్నారు. కాని వాటిలో ఏదిముందు జరుగవలసింది, ఏది వెనుక జరుగవలసింది, లేక అన్నీ కలిసి జరుగవలసిందా అనేటటువంటి విషయములో మాత్రము కొంత అభిప్రాయ భేదమున్నది. ఇప్పుడు మనరాష్ట్రము విడిపడి మనకు ప్రత్యేకంగా ప్రభుత్వము ఏర్పడిన తరువాత ఈ irrigation విషయములో ప్రభుత్వము చాలా ఆదరణ, ఆశ చూపి కొన్ని కొన్ని కార్యాలు చేసిందని అందరు ఒప్పుకోవలసిందే. ఉమ్మడి రాష్ట్రములో ఉన్నప్పుడు క్రిష్ణాఆనకట్ట ఏమవుతుందో అని భయపడుతున్న కాలములో దానికి కావలసిన రక్షణ ఇవ్వడానికి కూడ అప్పుడు సాధ్యం కాకపోయినటువంటి కార్యాన్ని మన ప్రభుత్వము 1953 మొదలుకొని దాన్ని సాధించి, ఇప్పుడు పనులు జరుగుతూ ఉండడం చాలా ప్రశంశనీయమైన విషయమని చెప్పవలసి యున్నది. అదే విధంగా తుంగభద్రా dam పూర్తి అయింది. ఈ major ప్రాజెక్టులయందు మన ప్రభుత్వమువారి దృష్టి చాలా తీవ్రంగా ఉన్నది. ఈ ప్రాజెక్టులన్నీ జరుగుతూ ఉన్నాయి. దానిని గురించి నేను కూడ వారిని అభినందిస్తున్నాను. అయితే ఒక విషయములో మాత్రము ఈ ప్రభుత్వానికి నాకు చాలా ఖచ్చితమైన అభిప్రాయ భేదమున్నది. మన దేశము సర్వతో ముఖంగా అభివృద్ధి కావలెనంటే ఈ పెద పెద్ద ప్రణాళికలతోపాటు ముఖ్యంగా minor irrigation projects కావలెనని తమకు మనవి చేస్తున్నాను.

ఎందుకనగా, మిత్రులు ఇంతమంది మాట్లాడుతున్నప్పుడు, ప్రతివారుకూడా మా తాలూకాకు అది కావాలని, మా జిల్లాకు ఇది కావాలని చెప్పుచున్నారే గాని, మంత్రిగారు మాట్లాడినట్లు దేశాభివృద్ధిని దృష్టిలో పెట్టుకొని ఎక్కడో ఒక పెద్ద ప్రాజెక్టుగాని ఒక పెద్ద dam గాని కట్టించవలెనని కోరినట్లు నేను వినలేదు. కాబట్టి, ఇంతమంది కోర్కెలు ప్రభుత్వానికి తెలుస్తూ ఉండేటప్పుడు, ఈ కోర్కెల నన్నింటిని పూర్తిచేయడానికి, ప్రభుత్వము కేంద్రీకరించి ఇక్కడనే కూర్చొని మన రాష్ట్రములో వివిధ జిల్లాలలో ఉండేటటువంటి ఈ చిన్న చిన్న dams మొదలగుపనులు చేయడానికి ఇక్కడనుంచే ఉత్తరువులు పంపిస్తారా, లేకపోతే ఈ కేంద్రీకరణనుంచి తప్పించి ఆ యా జిల్లాలలో వారికి ఏదేది కావలెనో ఆ పనులు వారికే వప్పగించి, దానికి తగిన డబ్బు, సిబ్బంది ఇచ్చి, తగిన ఏర్పాటుచేసి, మీ గ్రామాలలో, మీ జిల్లాలో మీకు కావలసిన పనులు మీరే చేసుకోండి, మీకు కావలసిన సహాయం ఇస్తాము, అన్ని జిల్లాలకు సంబంధించిన పెద్ద పనులు మాత్రము మేము చేస్తామని చెప్పి, అటువంటి వికేంద్రీకరణ పద్ధతిని అనుసరిస్తారా, అని ప్రభుత్వాన్ని ప్రశ్నిస్తున్నాను. ప్రతి జిల్లాకు, ప్రతి తాలూకాకు కావలసిన పనులు ఎన్నో ఉంటాయి. నేను చెప్పగలను మా జిల్లాకు ఏవేవో కావలెనని, ఇటువంటి కార్యాలన్నీ ఇక్కడ మీ దగ్గరవచ్చి మీతో చేర్చుంచు

కానే దానికంటె, ప్రతి జిల్లాకు ఒక కోటో, రెండు కోట్లో ఈ విధంగా ఒక నిధిని ఏర్పాటుచేసి అక్కడ ఏయే పనులు అవసరమో వాటిని పరిశీలించడానికి ఒక సంఘాన్ని ఏర్పాటు చేసి, వారికి తగిన సిబ్బంది ఇవ్వండి. ఆ విధంగా చేసినట్లైతే, ఆయా ప్రజలు వారికి కావలసిన పనులలో ఉత్సాహంతో పాల్గొని వాటిని చేసుకోగలరు. ఈ విధముగా ప్రజలందరిని సంతృప్తిపరచిన వాళ్ళ మవుతాము. అట్లుగాకుండా మన మెక్కడో పెద్ద పెద్ద ప్రాజెక్టులు కడుతున్నామంటే, అవి దేశాభివృద్ధి దృష్ట్యా మంచివే కావచ్చును, కాని అంతటితో ప్రజలు తృప్తిపడరు. మేము గ్రామాలలో పోయినప్పుడు, అక్కడ ఆ ప్రజలకు ఉపన్యాసా లిస్తూంటాము. మనకు స్వరాజ్యము వచ్చింది, ఇప్పుడిది మన దేశమైంది, మన ఆంధ్ర దేశము మనకైంది, అని ఎంతో సంతోషముగా మేము చెప్పుతున్నప్పుడు, "స్వరాజ్యమంటే ఏమి, ఏమి వచ్చింది మాకు, ఆంధ్ర రాష్ట్రము వచ్చిందంటే ఏమైంది, తుంగభద్ర కాలువనేది ఎక్కడుంది, ఆ నీళ్ళు ఈ కొండ దిగి వస్తాయా, అని ఈ విధంగా అడుగుతారు. వారికి ఏమని సమాధాన మివ్వవలెనో చెప్పండి. అసలు ఈ దిగువ కాలువ అంటే ఏమో, ఎగువ కాలువ అంటే ఏమో దాంట్లో నీరు ఎక్కడనుంచి ఎక్కడకు పోతుందో, నాకే తెలియదు. కనుక ఆ కాలువలు, ఆ ఆనకట్టలు గురించి వాళ్ళేమి అనుకోగలరు. వాళ్ళు చూసేది వాళ్ళ ప్రాంతాలలో, వాళ్ళ గ్రామాలలో ఏమి చేసినారనేదే. కనుక ఆయా ప్రాంతాలలో వారికి కావలసిన చిన్న చిన్న పనులుంటాయి. వాటికి లక్షలుకూడ ఖర్చుపెట్ట నవసరం లేదు. కొన్ని వేల రూపాయలతో కట్టగలిగేటటువంటి dams చిన్న చిన్నవి ఎన్నో ఉంటాయి. ఎంతైనా ఒక లక్షా, రెండు లక్షలకు మించదు. అటువంటి పనులు ప్రతి జిల్లాలోను చేసినట్లైతే, అందరిని తృప్తిపరచినట్లవుతుంది. అందరు సంతోషిస్తారు. మా జిల్లాలో 17 లక్షల జనము ఉన్నారు. అందులో 2, 3 లక్షల జనము మా సంస్థానం నుంచి వచ్చిన వాళ్ళు. మా సంస్థానంలో ముఖ్యంగా ఈ చెరువులు, కాలువలు ఇవన్నీ ఎప్పుడు repair చేశారో మేము కని, విని ఎరుగము. అటువంటి చెరువులను, కాలువలను repair చేసి కొత్తగా నిర్మించినట్లైతే, (రెండు సంవత్సరములలో ఆ పని పూర్తి అవుతుంది) ఒకేసారి మూడు లక్షల జనము మన మంత్రిగారిని ఆశీర్వదిస్తారు, అభినందిస్తారు. ఇప్పుడు ఇంత పెద్ద dams కట్టితేకూడ మాకు వాటివల్ల ఏమి ప్రయోజనం లేదు. ఇది మంత్రిగారికి తెలుసును. కనుక నేను మనవిచేసేది, ఇప్పుడు ఈ నందికొండ ప్రాజెక్టుకు ఒక్కదానికే వంద, రెండు వందల కోట్లు పెడుతున్నారు. దానితోపాటు, ప్రతి జిల్లాకు 1, 2 కోట్లు ఇచ్చి, ఆ విధంగా 20 కోట్లు ఖర్చు పెట్టండి. ఆ విధంగా ఎందుకు చేయకూడదు ? అనుకొంటే చేయగలరు. మన మంత్రిగారు ఎన్నో విషయాలు శ్రద్ధగా చూస్తున్నారు. నాకు తెలుసు, లేదనను. మా జిల్లాలో తీసుకొన్నట్లయితే, అప్పుడే స్వర్ణముఖి వచ్చింది. అయితే ఇది 'నేను చేసింది కాదు, రాజగోపాలచారిగారు చేశారు అని మంత్రిగారు చెప్పుతున్నారు. రాజగోపాలచారిగారు దాన్ని ప్రారంభించి ఉండవచ్చును. కాని, దానికి ప్రాణమిచ్చి, జీవమిచ్చి, ప్రోత్సహించింది వీరే. మా చిత్తూరు తాలూకాలో ప్రజలు సంజీవరెడ్డి గారు వస్తే మేలు అని అనుకొంటూనే ఉండినారు. వారు అవిధంగానే వచ్చినారు. వచ్చినా, మాకేమి చేయలేదే ఇంకా, అని............

The Hon. Sri N. SANJEEVA REDDI :— అప్పుడేనా, వచ్చి ఇంకా రెండు నెలలైనా కాలేదు !

Sri R. B. RAMAKRISHNA RAJU :— ఈ బడ్జెటులో నైనా ఏదైన చూపి ఉంటే మాకు సంతోషంగా ఉండేది. ఇప్పుడు చూడండి, మా చిత్తూరు జిల్లాలో, స్వర్ణముఖి అయింది, కాళంగి అయింది, మల్లిమడుగు అయింది. ఈ మూడిటికి 30 లక్షలు పెట్టారు. ఇందులో మాకొక 10 లక్షలు పడేయరాదు! మా కాళహస్తి తాలూకాకు 20 లక్షలు పెట్టి సహాయంచేయవలెనని ప్రయత్నిస్తే, మా జిల్లాలో ఉండే టటువంటి ఇతర ప్రాంతాలవారు, మేము, ఏమి పాపం చేశాము! మేము కొండలపైన ఉన్నాము. అటువంటప్పుడు మాకు దాంట్లో 10 లక్షలైన ఖర్చుపెట్టకూడదా? ఇప్పుడేవో పెద్ద పెద్ద dams కడుతున్నారంటే, అవి పదిఏళ్ళకు గాని పూర్తికావు. తుంగభద్ర Dam చూడండి. అది ఆరంభించి 10 ఏళ్ళు అయి ఉంటుంది. ఆవిధంగానే దక్షిణ దేశములో కట్టినవాటి విషయంలోను 10 ఏళ్ళు పట్టింది. ఈ పదేళ్ళ వరకు ఎవరుంటారో ఎవరు లేదో, అప్పుడు దాన్ని మీరు చూడరు, మేము చూడము. కనుక నేను చెప్పినట్లు ప్రతీ జిల్లాకు కావలసిన చిన్నచిన్న పనులు చేసినట్లయితే, రెండు సంవత్సరములలో ఆ పనులన్నీ పూర్తిచేయవచ్చును. ప్రతి జిల్లాలో ఉండే ప్రజలు ఎంతో సుఖపడుతారు. ఎన్నో చెరువులు బాగుపడతాయి. ఎన్నో కొత్త డాములు అవుతాయి. వాటిని మనం ప్రత్యక్షంగా చూడగలము.

కాబట్టి ఏవిధంగా చూచినప్పటికినీ మీరు యీ డిమాండును ఎక్కువచేయండి. నూరు కోట్లు తెచ్చేవారు యింకా 20 కోట్లు తేగూడదా ? తలమునిగేటప్పుడు మూరెడు అయితే నేమి, బారెడు అయితేనేమి ? మీరు కుటుంబానికి యజమానులు. కాబట్టి ఎంత అయినా అప్పు తీసుకొనిరావటానికి సిద్ధంగా వున్నారు. నిజంగా మీరు చేసినది తప్పు అని చెప్పడములేదు. కాబట్టి నేను మనవిచేసేది యేమిటంటే, మీకు విసుగు వచ్చేవరకూ కూడా నేను చెబుతాను. మనము చక్కగా పరిపాలన చేయదలచుకుంటే మన దేశము సర్వత్రా సస్యశ్యామలంగా వుండాలని అంటే, దానికి కావలసిన ప్రణాళికను నేను యిస్తున్నాను. ఈ ప్రణాళికను ఖండితముగా మీరు ఆమోదించి అమలుచేయవచ్చు. పది కోట్ల రూపాయలు యీ మైనరు యిరిగేషను స్కీముల కొరకు కేటాయించారు. Five Year Plan లో పెట్టమని చెప్పియున్నారు. ఆ స్థానులో ఏమి పెట్టి యున్నారో; అది ఏమిచేస్తారో మనకు తెలియదు. బహుశ రెండవ లేది, నాల్గవ లేది ధాన్ని గురించి మాట్లాడుతాము. నందికొండ డామును గురించిన శ్రద్ధ ప్రతి గ్రామానికి ప్రభుత్వము చూపించివుంటే దాన్ని గురించి చాలవరకు మనము పూర్తిచేసి వుండవచ్చును.

ఇంకొక విషయము. నేను ఆంధ్రదేశములో కొన్ని ప్రదేశాలు చూచివచ్చాను. గోదావరి ప్రాంత్యము రెండు భాగాలుగా వున్నది. గోదావరి, కృష్ణ, నెల్లూరులోనివి అన్నీ డెల్టా ప్రాంత్యాలు. అవి అన్నీ సస్యశ్యామలంగా ఉండే ప్రాంత్యాలు. మన ప్రాంత్యాలలో యిక్కడ సస్యధ్వంసం అనేది కనబడుచున్నది. ఆ ప్రాంత్యాలకు మనము పోయినప్పుడు అక్కడ కనబడేవి అన్నీ కాలవలే. మాపైపున చూస్తే అన్నీ ఏర్లు వున్నవి. అయితే అవి అంత పెద్దవి కావు. రేలూరు వద్ద వున్న కాలువను చూస్తే అది యిక్కడ మాకు వున్న నెలయేళ్ళతోటి సమానంగా వున్నది. ఆ ప్రదేశము అంతా కాలువలు ద్వారా నీటి పారుదల అవుతున్నది. ఇక్కడ మాకు ఏర్లు ఎంత పెద్దవో అక్కడ కాలువలు గూడా అంత పెద్దవిగావుండి, నీరు పారుదల అవుతున్నది. నాకు చూచేసరికి మనస్సుకు ఎంతో సంతోషమయింది. ఒక విధంగా దుఃఖము కూడా వచ్చింది.

21st July 1955]

The Hon. Sri N. SANJEEVA REDDI:— ఇక్కడ అంతా యిసుక పారుతుంది. అక్కడ నీరు పారుతుంది.

Sri R. B. RAMAKRISHNA RAJU :— మా ప్రదేశములో ఆయిసుక కూడా చాలా తక్కువే. ఒక కవీశ్వరుడు చెప్పినట్లు—

"ఎంత తపంబు చేసి జనించినారని"

అంటే పూర్వకాలములో ఎంతో తపస్సు చేసి పుణ్యము సంపాదించుకుంటే గాని యీ గోదావరీ డెల్టా ప్రాంత్యాలలో జన్మించి యుండరు. అక్కడి నీరు చూస్తే తేటనీరు కూడా కాదు. మట్టి మట్టిగా నీరు పారుతూంటే అంతా alluvial soil తో నీరు పోతూంటే నా మనస్సు పరి పరి విధాలుగా పోయింది.

Sri Ch. S.R.V.P. MURTHI RAJU:-On a point of order, Sir, రాయలసీమలో వారంతా కష్టపడ నక్కరలేదు. మా ప్రాంత్యాలకు రమ్మని వారిని ఆహ్వానిస్తున్నాము వారు మా జిల్లాలకు వస్తే మేము ఆనందిస్తాము.

Sri R. B. RAMAKRISHNA RAJU :—మాకేమి ఆక్షేపణలేదు. కాని మా ప్రాంత్యాలు విడిచి మరొక ప్రాంత్యాలకు రమ్మంటే అది సాధ్యమయ్యే పనికాదు. మేము కోరేది యేమిటంటే వారి కాలువలు మాకు పంపించండి అని.

Sri. RAJA SAGI SURYANARAYANA RAJU :— రాజాగారు మా జిల్లాలను చూచి దుఃఖము వచ్చిందని అన్నారు. మా జిల్లాలను గురించివారు చాలా బాధపడుతున్నానని సెలవిచ్చారు. వారు మా ప్రాంతాలకు వస్తే మా మాదిరిగా సంపాదించవచ్చును. వారు మమ్ములను చూచి దుఃఖించే బదులు సంతోషించ వచ్చును గదా ?

Sri R. B. RAMAKRISHNA RAJU :—వారినిచూచి నేను బాధ పడుచున్నానని చెప్పడములో వారిని చూచికాదు. వారు పూర్వకాలములో ఎంతో మంచి పుణ్యము చేసుకున్నారు. పుణ్యభూమిలో పుట్టారు. అందుకు మేము చాలా సంతోషించుచున్నాము. అంతేకాని వారినిచూచి నేను దుఃఖించుచున్నానని నేను అనడంలో వారిని పొరపాటు భావంపడ వద్దని అంటున్నాను. వారికి వున్న కాలువలు మంచి సారవంతమైన భూములు మాకులేవు. అటువంటివి మాకు గూడా వుంటే బాగుండేదని ఆమాదిరిగా మాకు లేకపోయిననేఅని విచారమే కాని వేరు కాదు. ఇందులో వారు అపోహ పడవద్దని చెబుతున్నాను. పదివేలో, 20 వేలో, 30 వేలో ఎంతో అంత మేము అడిగేది ప్రభుత్వము యిస్తే మాకుచాలు. ఇప్పుడు ఈ ఇరిగేషన్ డిమాండు విషయములో రు. 1,34,00,000లు ప్రభుత్వమువారు కేటాయిస్తున్నారు. 'Godavari western scheme Central scheme, Godavari, Krishna, Head works, Cumbum tank; Pennar, Buckingham Canal; Polavaram tank, Nakkapalle' మొదలగు స్కీములకు ఇంతవరకు ఖర్చు చేశారు. సరే. ఇప్పుడు నాలుగు కోట్ల రూపాయలు Capital లో నుంచి తీస్తే అది scarcity ప్రాంతాలలో ఖర్చుచేయవచ్చు. ఇంకా కాళంగి, మల్లిమడుగు, స్వర్ణముఖి మొదలైనవి వున్నవి. (Interruption) అంటే మా జిల్లా విషయము మాత్రము నేను చెబుతున్నాను.

Mr. SPEAKER :— Better luck next year.

Sri R. B. RAMAKRISHNA RAJU :— I hope so. నేను చెప్పేది హాస్యంకాదు. నేను చాలా serious గానే చెబుతున్నాను. రామాచార్యులు గారుగూడ అన్నారు. అక్కడ హైదరాబాదులో ఒకరు "Damn his Dam" అని అన్నారు. నేను చెప్పేది యేమటంటే "Dam this Dam" అని అంటే ఈ డామును యింకొక డాము అడ్డము కట్టి, అటుతరవాత పని కొనసాగించాలని అంటున్నాను. మా జిల్లాలో మెట్ట ప్రదేశాలలోని స్కీములు చాలామట్టుకు ప్రభుత్వమువారు పూర్తిచేయవచ్చును. ఏ విధంగానైనా యిప్పుడు మనము పెద్ద పెద్ద ప్రాజెక్టులుకట్టి యీ చెరువులకు నీరు ఏ విధంగా తరలించుదలచుచున్నామో, అదేవిధంగా మెట్టప్రాంతాలలోకూడా నీరు లేనిచోట, అంటే నేను చెప్పేచోట్లలో, bore wells త్రవ్వించమని అంటున్నాను. ఇప్పుడు sub-soil తీసే యంత్రాలుగూడా వున్నవి. వీటితో deep గా wells త్రవించవచ్చు. కొన్ని కొన్ని చోట్ల 400 అడుగులలోతు వరకూగూడా పోయేవివుంటాయి. ఆ ప్రకారంగా ప్రభుత్వము యిటువంటి bore wells మెట్టప్రదేశాలలో వీలయినన్ని త్రవ్వించితే కొంతవరకు, electricity కూడా వస్తుందని అంటున్నారు గనుక, యీ బావులు irrigation కు వుపయోగిస్తాయని అంటున్నాను. ఈ విషయంలో ప్రభుత్వమువారు తగు శ్రద్ధ వహించాలని అంటున్నాను.

ఇంకొక విషయము. ప్రభుత్వమువారు యింతవరకు చేసింది బాగానేవుంది. కాని నేను చేసే సూచనలు కూడా ప్రభుత్వమువారు గుర్తిస్తారని ఆశిస్తున్నాను.

Sri D. RAMABRAHMAM :— అధ్యక్షా ! చిత్తూరుజిల్లాలో చాలా వెనుకబడిన ప్రాంతాలలో మొదటిది కుప్పము తాలూకా. కుప్పము తాలూకా యిదివరకు జమీందార్ల చేతులలో వుంటూ వున్నది. పూర్వము జమీందార్లు వున్నప్పుడు ఆ జమీందారీ ఏరియాలో పారుతున్న పాలారు నీటిని, పాలారు నదికి ఒడ్డుకట్టి దానినుండి కాలవల ద్వారా నీటిని మరలించుటకు ఒక స్కీము వేసియున్నారు. తరువాత ప్రకాశం మంత్రివర్గము వారు, యీ జమీందారీలను రద్దు విషయము ప్రకటించిన తరువాత జమీందారీలు పోయేటప్పుడు, యిక యీ స్కీములన్నీ అవసరముండదని మానుకున్నారు. అప్పుడు మద్రాసు రాష్ట్రములో పాలారు బేసిన్ రూల్సు వున్నందువల్ల, జమీందార్లు యే ఒక్కపని కూడా చేయుటానికి వీలుకాకుండా పోయింది. 1937 సంవత్సరమునుంచి కూడా నేటివరకు మొదటి సారిగా పార్థసారథి అయ్యంగారు election లో నిలవబడ్డప్పుడు నేను అక్కడికి వెళ్లాను. ఆ సందర్భములో యీ పాలారు బేసిన్ రూల్సు relax చేస్తాము, యీ పాలారు నీటికి అడ్డముకట్టి కాలవల ద్వారా చెరువులను మరలించుతాము అని ప్రచారము చేస్తూ వచ్చారు. తరువాత వెంకటరెడ్డిగారు ఎలెక్షనులో నిలవబడినప్పుడు కూడా అదే ప్రకారము చెప్పారు. తరువాత 1952 సంవత్సరములో మద్రాసు రాష్ట్రములో ఎన్నికలు జరిగినప్పుడు కూడా అదే ప్రచారం జరిగింది. మొన్న కూడా అదే ప్రచారము జరిగింది. అయితే ఎన్నికలలో కమ్యూనిస్టు పార్టీ సభ్యుడుతో పోటీచేసిన బి. వజ్రవేలు చెట్టియారుగారు కూడా అదే ప్రచారము చేసిన సందర్భములో కమ్యూనిస్టు పార్టీ నాయకులు ఆ ప్రాంతములో మేము ఎన్నిక అవుతాము, మా ప్రభుత్వమే వస్తుంది, సుందరయ్యాగారి మంత్రివర్గము ఏర్పడుతుంది, నేను ఆర్థిక మంత్రిని అవుతాను అని చెప్పి ప్రచారము చేస్తూ. "నవ్వులు, పువ్వులు" అనే పత్రికలను ప్రకటించుకొని, ప్రచారము చేసినందువల్ల ఆ ప్రాంతములో కాంగ్రెసువారికి ఎక్కువ

నోటు లేకుండా పోయింది; మరల ఇప్పుడు కాంగ్రెసు ప్రభుత్వము వచ్చింది. కాంగ్రెసు ప్రభుత్వం వచ్చినతరువాత శ్రీ సంజీవరెడ్డిగారే ఆ పోర్టుఫోలియో తీసుకున్నారు. ఇక మీదట సుఖముగా జరిగిపోతుంది అని అక్కడ ప్రజలు చాలా సంతోషించుచున్నారు. కనుక యిప్పటికైనా, యిప్పుడు ఆంధ్ర ప్రభుత్వము వచ్చింది గనుక దానికి కొంత మరమ్మతు చేయించి, దాని ద్వారా కాలువలు త్రవ్వించి ఆ పాలారు నదిలో పోయే నీటి ప్రవాహాన్ని మరలిస్తే ఆ ప్రాంతములో వున్న చెరువులన్నీకూడా నీటితో నింపటానికి వీలవుతుంది. ఆ విధంగా చేస్తే సుమారు 14, 15 చెరువులు భర్తీ కావటానికి అవకాశము వున్నది. గనుక ఆ పాలారు నీటిని వెంటనే మరలించటానికి ఏర్పాటు చేయాలి. ఇదివరకు సంజీవరెడ్డిగారు ఆ ప్రాంతములో పర్యటన చేసేటప్పుడు వారికి ఒక మెమొరాండం ప్రజలు సమర్పించుకున్నారు. దానిమీద ఎవరో ఇంజనీర్లు వచ్చి చూచారు. కాని, తరువాత యేమీ జరుగలేదు. ఇంతటిలో మంత్రివర్గము పడిపోయింది. ఆ స్కీము అట్లానే అడుగున పడిపోయింది. తరువాత యిప్పుడు సంజీవరెడ్డిగారిని కోరేది యేమిటంటే, దానిని మిక్కిలి శ్రద్ధవహించి దానిని investigate చేయించి, అక్కడ levels ను తీయించి, యీస్కీములుఅమలులోకితీసుకొని రావటానికి మీద్వారావారినికోరుతున్నాను.

ఆ ప్రాంతము యిదివరకు జమీందారీ ప్రాంతము కాబట్టి, అక్కడ వున్న చెరువులు మరమ్మతులేక చాలా భాగము చెడిపోయి యున్నవి. ఇప్పుడు ఆ చెరువులన్నీ మరమ్మతు చేయించవలసినఅవసరము వున్నది. ఇప్పుడు అక్కడ Minor Irrigation Department వారు ఏమి చేస్తున్నారంటే, అక్కడ వున్న ప్రజాసంస్థలుగాని, ప్రజా ప్రతినిధులు గాని చెప్పినా కూడా ఏ చెరువుకుగాని ఏ మరమ్మతు లేకుండా ప్రవర్తిస్తున్నారు. పైగా వారు, అక్కడ వున్న కంట్రాక్టర్లతో బేరాలు కుదుర్చుకొని, వారికి లాభము వున్న చోటు మరమ్మతులుచేసి లాభాలు పొందుతున్నారు. వారికి బేరాలు కుదిరిందాకా ఆగి, అటుపిమ్మట కార్యక్రమమునకు దిగుచున్నారు. కొన్నిచోట్ల యీ మరమ్మతులు చేయడములో మట్టి మాత్రము పోస్తూ, మరమ్మతులకు విలువ జాస్తిగా చూపించి లాభాలు సంపాదించుకుంటున్నారు. ఈ విధమైన మరమ్మతులు చేస్తే, తిరిగి వర్షాలు కురిసినప్పుడు, ఆమట్టి కొస్తా కారిపోయి మరల చెరువులు ఎప్పటిమాదిరిగా వుండటానికి సావకాశము కలిగేటటువంటి మరమ్మతులు చేస్తున్నారు. వారు మట్టి పోయించుతున్నారే కాని, సరియైన మరమ్మతులు చేసి తగిన కట్టడములు కట్టించడము లేదు. కాబట్టి యీ మైనరు యిరిగేషను డిపార్టుమెంటు వారు చేయించే మరమ్మతులు సరియైనవి కావు. వారు చేయించేది కట్టుదిట్టముగాలేదు. కాబట్టి ప్రభుత్వమువారు యీ మరమ్మతుల విషయములు సరిగా జరగాలంటే ప్రతి గ్రామములోను, ఒక సంఘమును, అదేవిధంగా ఇరిగేషను సంస్థ తరఫున ప్రతి తాలూకాకు ఒక సంఘమున్నూ ఏర్పాటుచేసి, ఆ తాలూకాలో వున్న M. L. A. లను గూడా అందులో మెంబర్లుగా వేసి, అక్కడవున్న తాలూకా తహశ్శీల్దారునున్నూ, ఓవరుశీరునున్నూ యిందులో ex-officio members గా చేసి, యీ సంఘాలయొక్క తీర్మానాలు అమలు జరిపించితే, యీ మరమ్మతులు సరిగా జరుగుతాయే గాని కేవలం యీ Minor Irrigation Department ను నమ్మితే, యీ పని సరిగాను, కట్టుదిట్టముగాను నడవనేరదని చెబుతున్నాను. ఈనాడు ఈ విషయము నేను ప్రభుత్వ దృష్టికి తెచ్చాను గనుక యీ విషయములో ప్రభుత్వము తగు శ్రద్ధ వహిస్తారని ఆశిస్తూ, అధ్యక్షులవారు నాకు యీ అవకాశము యిచ్చినందులకు వారికి నా అభివందనములు అర్పించుచున్నాను.

Sri A. BAPINEEDU :— అధ్యక్షా, మన సోదరులు చాలామంది ఇరిగేషను డిమాండుమీద, నందికొండ, పులిచింతల, సిద్ధేశ్వరము మొదలైన అన్ని విషయాలను గురించి మాట్లాడారు కాని ఇప్పూరు డాము గురించిగాని, గోదావరి కట్టల విషయముగాని ఏమీ సూచించినట్లు కన్పించలేదు. 1953 సంవత్సరములో గోదావరి నదికి వరదలువచ్చి కట్టలు తెగిపోయి దేశానికి ఎంతనష్టము వచ్చిందో అందరికీ తెలుసు. అప్పుడు ప్రభుత్వమువారు ఒక కమిటీని వేసింది. వారు రిపోర్టునుకూడా సమర్పించు కున్నారు. అది ఏమైనదో తెలియదు. ఈ బడ్జటులో ఏ మొత్తమును దీనిక్రింద చూపించ లేదు. అప్పుడు కేంద్రప్రభుత్వము 60 లక్షల రూపాయలు కేటాయించింది. ఆ కేటా యింపులో ఏమైనా తీసుకురాగలిగివుంటే మన సంజీవరెడ్డిగారు తీసుకువచ్చి ఆ కట్టలు మరమ్మతుచేసి, కట్టలను ఎత్తుచేసినట్లయితే అది ప్రజలకు చాలా వుపయోగపడుతుంది. ఈ కట్టలు పోసినప్పుడు ఇప్పూరు దగ్గర ఒక డామును కట్టినట్లయితే అది నందికొండవల్ల కాకుండా ఇప్పుడు జరిగే 10 లక్షల ఎకరాలు సాగుబడి అయి గోదావరి ఆనకట్టక్రింద సాగుబడి అయ్యేది కాకుండా 20 లక్షల ఎకరాలుకూడా సాగవుతుంది. అక్కడ విశాఖపట్టణము జిల్లావారికి, విశాఖపట్టణము హార్బరుకు కాలువ తీయడానికి, నావిగేషను ఏజన్సీలు పండే సరకులుకూడా అక్కడకు పోవడానికి అవకాశం వుంటుంది. కృష్ణా జిల్లావారికికూడా నీరురావడానికి అవకాశము వుంటుంది. నందికొండ ఎగువకాలువ మన కృష్ణాజిల్లాకే కాకుండా West Godavari తాలూకాలకు కూడా వస్తుందని చెబుతున్నారు. నీరు ఎంతవరకు సప్లయి అవుతోంది అన్న విషయము మాస్తే, టెక్ని కలుగా ఇంజనీర్లుయొక్క ఆలోచన తీసుకున్నట్లయితే నెల్లూరు జిల్లాకుగాని, గుంటూరు జిల్లాకుగాని వచ్చేప్పటికి సరిపోతుంది. ఇప్పూరుడాము కట్టినట్లయితే 20 లక్షల ఎకరాలు పశ్చిమగోదావరి జిల్లాలో నేకాకుండా కృష్ణాజిల్లాకుకూడా సప్లయిచేసేనీరు గోదావరినదిలో వుందన్న విషయం అందరికి తెలుసు.

సిద్ధేశ్వరముగాని, పులిచింతలగాని లేక నందికొండగాని కట్టినతరువాత వాటి నీరు పశ్చిమ గోదావరి జిల్లాకు ఏమాత్రము రాదని మీ అందరికి మనవి చేస్తున్నాను. ఇప్పూరు డాము కట్టి ఆ డామువద్దనే కాకుండా పోలవరము వద్ద బారేజి బ్రిడ్జి కట్టినట్లయితే మొత్తము తూర్పు, పడమరలలో 20 లక్షల ఎకరాలు, ఇప్పుడు సాగుఅయ్యే 10 లక్షల ఎకరాలు కాకుండా, యింకా అదనంగా సాగుఅవుతుంది. ఆ విషయాన్ని ప్రత్యేకంగా మన ఉపముఖ్యమంత్రిగారు చూపించక పోయినప్పటికి నేను మనవిచేస్తున్నాను. ఇప్పుడు వున్న గోదావరి ఆనకట్టవద్ద క్రితము సంవత్సరము కూడా ఇసుక తిన్నెలు వేసి పశ్చిమ డెల్టా దెబ్బతినిపోయింది. జనవరి, ఫిబ్రవరి నెలల్లో మొదలుపెట్టి ఇసుకతీసి వరదలు రాకుండా కాపాడేందుకు మన సబార్డినేట్సుకు తగిన instructions యిచ్చి దానికి సౌకర్యాలు కలుగచేయాలి. అందులో పశ్చిమ గోదావరి జిల్లాలో ఆనకట్టలేకాకుండా ముంపు నివారణకు ఎర్రకాలువ, అనుమల్లంక ప్రాజెక్టులుకూడా చేయవలసి యున్నది. పోలవరము తాలూకాలో రామకృష్ణరాజుగారు చెప్పినట్లు చిన్న చిన్న స్కీములు ఒక లక్షా 2 లక్షలు ఖర్చు అయ్యేవికూడా తీసుకోవలయును. కొవ్వూరులో మేము 60 లక్షలుపెట్టి పంచదారమిల్లును నిర్మించ బోతున్నాము. అచ్చట ప్రాజెక్టు కట్టడానికి, ఎకరానికి 200 రూపాయలు మేము నజరాయివ్వడానికి సంసిద్ధంగా వున్నాము. ఆ ధనము కూడా తీసుకొని మీరు ఆస్కీమును అమలు పరచినట్లయితే 30 లక్షల ఎకరాలు సాగవు

తుంది. కొవ్వూరు తాలూకాలో 30 ఎకరాలుకూడా సాగవుతుంది. అందువల్ల ఈ స్కీమును వెంటనే అసలు జరుపవలసిందిగా కోరుతున్నాను.

Sri M. PALLAM RAJU :— అధ్యక్షా ! నేను ఇరిగేషను డిమాండుమీద మాట్లాడాలని అనుకోలేదు. కాని మిత్రులు రామకృష్ణరాజుగారు గోదావరి, కృష్ణా జిల్లాలు చాలా ఫలవంతంగా, సస్యశ్యామలంగా, పుష్టిగా, తృప్తిగా వున్నాయనే అభిప్రాయం సూచించిన తరువాత కొంచెము మాట్లాడ వలసిన అవసరము కన్పించింది. మిత్రులు ఎవరు అయినా మా జిల్లాలకు వస్తున్నారంటే మేము కొంచెము బడాయి కారులము కనుక బాగా ప్రాంతాలను చూపించటము అలవాటు అయిపోయింది. అది చూచి వారు మేము భాగ్య సంపదలతో తులతూగు తున్నామని వారి అభిప్రాయము. తూర్పుగోదావరిజిల్లాలో 18 వందల గ్రామాలు వున్నాయి. అందులో ఇరిగేషను వసరులు వున్నవి 372 గ్రామాలకు మాత్రమే. ఇది మాత్రము మరచిపోవద్దు. 400 గ్రామాలు అంటే అమలాపురం, రాజోలు, కాకినాడ, రామచంద్రపురం తాలూకాలోనివి. మీరు రైలు కట్టవెంబడి ప్రయాణము చేసినప్పుడు చూస్తారు రాజమండ్రి నుండి వుత్తర ప్రాంతములో వున్నటువంటి 24 గ్రామాలు. చాలా గ్రామాలకు ఇరిగేషను సదుపాయములు లేవు. తరువాత గోదావరి ప్రాంతములో వున్నటువంటి అమలాపురం ప్రాంతాలవారికి కూడా ఎక్కడా ఇరిగేషను సదుపాయాలు లేవు. మిగిలివున్న 15 వందల గ్రామాల్లోను 14 వందల గ్రామాలకు ఏమీ ఇరిగేషను ఫెసిలిటీలు లేవు. ఇక పెద్దాపురం తాలూకా ఒక్కటే చూచినట్లయితే మా డెల్టా ఏరియా ఎంతవుందో అంత ఆతాలూకాలో వున్నప్పటికికూడా ఏమీ ఇరిగేషను ఫెసిలిటీలు లేవు. ఏదోపూర్వము స్వపరిపాలన రోజుల్లో ఆ రాజులు కట్టించినటువంటి ఏలేరు స్కీము క్రిందవున్న 56 గ్రామాలు తప్ప, పిఠాపురంలో 26 గ్రామాలు తప్ప తక్కిన గ్రామాలు అన్నీ కూడా మెట్ట ప్రాంతాలే. 14 వందల గ్రామాలు ఎప్పుడూ కరువువాతలోనే వుంటుంటాయి. ఆ సంగతి మరచి పోకుండా వుండాలని మనవి చేస్తున్నాను. మేము కూడా చాలా ఆలోచనా పరులు అనుకోని మేము 1946 లో వచ్చిన గవర్నమెంటు (సంయుక్త రాష్ట్రములో మనకు 56 కోట్ల రూపాయలు నిలువవున్నప్పుడు) రామపాద సాగర్ వచ్చేస్తుందని ఆశతో చెప్పుకోదగ్గ అభివృద్ధి స్కీములు ఏవీకూడా పెట్టుకోలేక పోయాము. అది ఎదో తెలియనివాళ్ళు అనుకున్నాను. మాకు తాండవనది, పంపానది అనే నదులు వున్నప్పటికి కూడా మంత్రిసంజీవరెడ్డిగారు ఇన్వెస్టిగేషనుకు ఇంజనీర్లను వేస్తామని కూడా చెప్పి వేయలేదు. పంపానదికి తాండవనదికి ఏమీ ఏర్పాటులు జరుగలేదు. ఇచ్చారేమో తెలియదు. మాకు ఏలేరు స్కీముకూడా 2 కోట్ల రూపాయిలు ఖర్చయ్యే టటువంటి పంచవర్ష ప్రణాళికలో చేసినప్పటికి కూడా దానికి ఇన్వెస్టిగేషను ప్రయత్నము చేసినట్టు కన్పించదు. ఇంకా చూచినట్లయితే మా డెల్టాలో చెప్పడానికి అలవి గానటువంటి మురుగుబావులు వున్నాయి.

Sri R. B. RAMAKRISHANA RAJU :— చెప్పు నవసరములేని విషయాలు చెబుతున్నారు.

Mr. SPEAKER :—He is not yielding.

[21st July 1955

Sri M. PALLAM RAJU :— యానాము ప్రాంతంలో ఒక లాకు కట్టవలసిన అవసరము వున్నది. అది కట్టకపోవడముచేతనే ప్రతి సంవత్సరం కూడా 23 వేల రూపాయలు రైతులకు రిమిషను ఇవ్వవలసి వుంటున్నది. ఆ లాకు కట్టకపోవడము ప్రభుత్వమువారి తప్పు కాదు. అప్పుడు ఫ్రెంచివారి హద్దులో లాకు కట్టుకోడానికి పర్మిషను ఇవ్వలేదు. ఇప్పుడు యానాము మనలో కలిసిపోయింది. ఆ ప్రాంతములో ఒక లాకు కట్టి అక్కడవుండే భూములకు ముంపు లేకుండా ఏర్పాటు చేసినట్లయితే బాగా వుంటుంది. యానాము ఐలండు ప్రాజెక్టు విషయంలో 23 లక్షలు రూపాయలు ఖర్చు వున్నప్పటికీకూడా ఫ్రెంచి గవర్నమెంటు కలసి రాకపోవడముచేత 17 లక్షలకు కుదించి మనము లాకు కట్టడము మానేశాము. ఇప్పుడు యానాము మనలో కలిసి వున్నది కనుక ఆ లాకు కట్టినట్లయితే ఇంతవరకు వున్నటువంటి ముంపులు లేకుండా 6 లక్షల రూపాయలలో ఆ లాకు ఏర్పాటు అవుతుంది. దానినిగురించి investigation చేయవలసిందని శ్రీ సంజీవరెడ్డిగారికి మనవి చేస్తున్నాను. ఈ తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా జిల్లాల ప్రాంతీయులు ఎక్కువగా కోరకపోవడము చేతను, వారు ఏదో పుష్టిగాను తృప్తిగాను వుంటారని అనుకోకూడదు. ఎక్కువగా ప్రభుత్వాన్ని క్రిటిసైజు చేయకపోవడమువల్ల అంతాకూడా ఆమోదిస్తూ వున్నారని అనుకోకూడదని చెబుతూ ఈ డిమాండును బలపరుస్తూ విరమిస్తున్నాను.

Sri R. B. RAMAKRISHNAM RAJU :— నేను మనవిచేసినది మా జిల్లాకు ఒక్కదానికే కాదు. అన్ని జిల్లాలలోను వున్నటువంటి మెరక భూములనుగురించి మాట్లాడాను. అందువల్ల నేను మాట్లాడింది ఎక్కడెక్కడ మెరక ప్రాంతాలు వున్నాయో వాటిన్నింటికికూడా వర్తిస్తుంది.

*Sri U. RANGA BABU :— Mr. Speaker, Sir, the Deputy Chief Minister in his introductory speech has ably dealt with the irrigation problems. But there is no mention in it of the condition of the irrigation works in the taken-over estates. It is a deplorable state there. Many of the repairs are held up there for a long time; because the zamindars took no interest in them; and as yet, the Government who now stepped in the place of the zamindars have not taken any interest in them. As a consequence, many of the tanks are silted up and instances are not wanting where the bunds have reached the ground level, and sluices and weirs are required in several places. Now, in order to take up these things there is no adequate staff, and so I request Government to put some staff in complete charge of these repairs.

With respect to Ichapur, there is the Bahuda scheme. It has been in the files of the Government for a long time. On this occasion I wish to inform Government that the neighbouring Orissa Government is contemplating constructing a

21st July 1955] (Sri U. Ranga Babu)

reservoir at Bungasay in the upper reaches of the Bahuda. This will be prejudicial to those in the lower reaches, that is, the people in our State. So I would request Government to see that our interests are protected. In this connection I would suggest also that Government should try to construct an anicut at Bodapadu, which has been promised by the Deputy Chief Minister in his recent visit to Ichchaapur. Also at Nelavanka, a flood bank and a dam are required. Sir, these are our requirements. Now there has been a clamour in this House, with respect to distribution of funds in the matter of irrigation and I join with them. Neither the Ramapadasagar nor the Nandikonda scheme would give any benefit to the people of Srikakulam. When the Government conceived these schemes they had the idea that the face of Andhra would be changed completely when these schemes materialise. I agree with them. But then, it cannot be expected to have a whole transport of population from one area to another. Therefore, in areas where there are small or medium schemes Government should have the special aptitude to develop them before giving much attention to schemes like Ramapadasagar and Nandikonda. As my time is over, I resume my seat.

*Sri RAJA SAGI SURYANARAYANA RAJU :— అధ్యక్షా ! డిప్యూటీ ఛీఫ్ మినిష్టరుగారు తెచ్చిన Irrigation Demandను నేను బలపరుస్తూ వారిని ప్రార్థించుచున్నాను. మాకు గత మే నెలలో floods వచ్చినవి. అందువల్ల కలిగిననష్టమును అరికట్టుటకు వీరుత్వరగా పనులు పూర్తిచేయించినందులకు ప్రార్థించుచున్నాము. రెండవది తాండవనది ప్రాజెక్టు క్రింద నల్లగొండమ్మవాగు రేకవానిపాలెంగడ్డ అను ఈ రెంటికి ఒక sub-division ను ఏర్పాటుచేసినందుకు వారిని అభినందించుచున్నాను. మా తాలూకాలో కళ్యాణపులోవ ప్రాజెక్టు అనునది సుమారు 10 లక్షల రూపాయలు ఖర్చుతో పూర్తి అగును. దానికి కూడా ఈ sub-division చేతనే detailed investigation చేయించవలెనని ఆశిస్తున్నాను. మన రాష్ట్రములో గవర్నమెంటువారు ప్రథమ పంచవర్ష ప్రణాళికలోని schemes క్రింద 9 కోట్ల రూపాయలు అంచనావేసి పంపించారు. మా జిల్లాలో మాత్రము 1 కోటి 20 లక్షలు రూ॥విలువగల ప్రాజక్టులు recommend చేశారు. కాని ప్రథమ పంచవర్ష ప్రణాళికలో పది లక్షల రూపాయిలు విలువగల ఒక ప్రాజక్టు తప్ప ఏదీకూడ ప్రారంభించలేదు. కారణమేమనగా, పూర్తి పరిశీలన గాకపోవుట. కనుక ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో నైనా పరిశీలనలు పూర్తి చేయించి కేంద్ర ప్రభుత్వమునకు వ్రాసి అయినా minor projects గాని medium projects గాని చేయించినట్లయితే చాలా లాభకారిగా నుండును. మాజిల్లాలో అన్నీ చిన్న నదులు : తాండవ, శారద, వరహా, గోస్థని మొదలగునవి. వీటికి ఒక్క దానికీ కూడ మంచి ప్రాజెక్టు లేకపోయినందుకు విచారిస్తున్నాను. కాని నేను చెప్పిన విషయ

ములో మంత్రిగారు తప్పక శ్రద్ధతీసుకొని చేయిస్తారని నమ్ముతున్నాను. ఇంతటితో సెలవు తీసుకొనుచున్నాను.

*Sri SHAIK MOULA SAHEB :-అధ్యక్షా ! Irrigation మంత్రిగారు యీనాడు ప్రవేశపెట్టిన demand ను బలపరుస్తున్నాను. వారు ఆంధ్ర రాష్ట్రము ఏర్పడిన తరువాత గత సంవత్సరము యీ నీటి అభివృద్ధి ప్రణాళికలు అమలు జరిపినందుకు వారికి ధన్యవాదములు అర్పించుచున్నాను. రాయలసీమతోపాటు, నెల్లూరు జిల్లాలోని మెట్ట తాలూకాలకు, మారెళ్ళసీమ యని పేరు. ఈ సీమకు సంబంధించిన పనులను కూడా శ్రద్ధగా చేయించ గోర్తాను. ఇది ఉదయగిరి, అది కనిగిరి ; ఈ నాడు గిరులకు సంబంధించిన ఈ నియోజకవర్గములో గిరిజనులను పోలిన సోదర జనులు వున్నారు. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో, అభివృద్ధి చెందిన తాలూకాలకంటె వెనుకబడ్డ తాలూకాలకు, ఎక్కువగా డబ్బును కేటాయించవలెనని కోరుచున్నాను. మా తాలూకాలో గండిపాలెం ప్రాజెక్టు కలదు. దానికి గండి పూడ్చుటకు 75 లక్షల రూపాయలు ఖర్చగునని engineers చెప్పారు. ఉదయగిరి చెరువుకు ఒక special channel త్రవ్వుటకు 2½ లక్షలు రూపాయలు ఖర్చు అగునని estimate చేసియున్నారు. ఈ పాత వాటికి కొన్ని లక్షలు పెట్టి మరమ్మతు చేయమంటున్నాను. కాని ఏ క్రొత్త కాలువను గాని, చెరువులనుగాని త్రవ్వమని పెద్దవాటిని కోరుటలేదు. ఈ వెనుకబడ్డ తాలూకాలకు యీపాటి సహాయమునైనా చేయవలెనుగాని, అభివృద్ధిచెందిన తాలూకాలలో ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో దామాషా యిచ్చుట సమంజసము కాదు. కాన మంత్రిగారు మా జిల్లా మెట్టతాలూకాల ప్రజల దారిద్ర్యమును పోగొట్టెదరని నేను ప్రార్థించుచున్నాను.

*Sri VAVILALA GOPALAKRISHNAYYA :— అధ్యక్షా, నేను నందికొండ ప్రాజెక్టు ప్రారంభోత్సవం త్వరగా జరపాలనే ప్రతిపాదన కోత తీర్మానంగా పెట్టి బలపరుస్తూ మాట్లాడుతున్నాను. దీనిని త్వరగా తీసుకు రావాలని నా ఉద్దేశము. ఇది censure గా భావించరని నేను అనుకుంటున్నాను. కున్స్వార్ సేన్ కమిటీలో కృష్ణకు ఇటు అటు వున్న తీరప్రాంతం నందికొండ ఆయకట్టులో ప్రథమంగా కలిపితే బాగుంటుంది అని వుంటే ఇరిగేషను ఇంజనీరుగారు ఈ రెండు ప్రాంతాలు కలపనక్కరలేదని చెప్పారు. ఇండియా గవర్నమెంటు 'భాగీరథ' అనే పత్రికలలో ఇది exclude చేయకుండా ప్రకటించింది అనేమాట ఒకటి చెప్పారు. Alignments ప్రత్యేకంగా తేలలేదు అంటే నేను ఏమీ మాట్లాడదలచలేదు. ఇప్పుడు alignment అయిందంటే నేను చెప్పదలచుకున్నాను. బొమ్మలో చూస్తే కొంత అనుమానం కలగడానికి అవకాశం వస్తోంది. ఈ అనుమానం తీర్చాలని కోరుతున్నాను. Works ప్రారంభించి నప్పుడు కూలీలను మోసగించే కంట్రాక్టర్లు వస్తున్నారు. వీరిని కంట్రోలు చేసే పద్ధతి చూడకపోతే తుంగభద్ర ప్రాజెక్టుకట్టినపుడు జరిగిన అనుభవము జరుగుతుంది. కడప జిల్లానుంచి మిగతా చోట్లనుంచి వెళ్ళిన కూలీలు తమకూలిడబ్బులు కూడా బడయలేకుండా తిరిగి మలేరియాతో బాధపడుతూ వెనుకకు వచ్చేవారు. అక్కడ labour boards ఏర్పరచాలి. ఇతర ప్రాంతాలనుంచి వచ్చిన కారణంగా irrigation staff లోనికి కుర్రవాళ్ళు వచ్చారని

ఉత్సాహంగా అందరును మనకు సంతోషంతో చెప్పారు. నందికొండకు వెంటనే పూర్తి యేర్పాటులు చేయాలని కోరుతున్నాను. అయితే ఆంధ్రులు చేతకాని వారని ప్రభుత్వ ఇంజనీరు అంటున్నారట. దీనివల్ల వారిలో ఉత్సాహం తగ్గుతుందనేది గుర్తించాలి.

Sri C. V. SOMAYAJULU :— మూడు నిముషాల్లో చెప్పడానికి ఏమీ వుండదండి.

Mr. SPEAKER :- విషయాలు క్లుప్తంగా చెప్పండి.

*Sri C. V. SOMAYAJULU :— ప్రస్తుతం Andhra Pattern of Socialistic Society లో మా శృంగవరపుకోట తాలూకా untouchable గా వుండిపోయింది అని చెప్ప సాహసిస్తున్నాను. మాకు వున్నవి రెండు ప్రాజెక్టులు. మంత్రిగారికి తెలుసును. మా irrigation conference కు వారు attend అయినారు. ప్రజలకుందు promise చేశారు. ఈనాడు వారిఉపన్యాసం లో కూడా శృంగవరపుకోట గురించి ఉచ్చరించలేదు. నేను కనిపిస్తుంటే అయినా చెబు తారు అనుకున్నాను. పూర్తి విషయాలు మంత్రిగారికి తెలుసు. ఇదివరకే అర్జీల ద్వారా తెలియచేసికొన్నాం. ఈ విషయం వారు ఆలోచన చేస్తారని భావిస్తున్నాను. లేక ఈరకంగానే వుండిపోతే, ప్రస్తుత ప్రభుత్వ పాలక యంత్రంలో బాధపడుతున్న రాజకీయ బాధితులిగా మాత్రం మేము మిగిలిపోవలసి వస్తుంది. మీరు రాజకీయ బాధితు లకు first preference ఇస్తాము అన్నారు. ఆ consideration తో అయినా మా తాలూకాను తీసుకొని మాకు సహాయం చేయాలని appeal చేస్తున్నాను.

Sri T. PAPA RAO :— అధ్యక్ష మహాశయా! నేను ఈ డిమాండుపై కోత తీర్మానం పెట్టడం ప్రభుత్వంచేసే ఈ డిమాండుపైన నమ్మకంలేక కాని దాన్ని ఎదిరించి ఓడించాలని కాని ఉద్దేశంతో కాదు. మా జిల్లాలకు సంబంధించినంతవరకు ఒక న్యాయాన్ని ఒక సత్యాన్ని ఒక ధర్మాన్ని పాటించాలని గౌరవ సభ్యులను ప్రభుత్వాన్ని అర్థించడానికి మాత్రమే ఈ కోత తీర్మానం పెట్టడం జరిగింది. రు. 10,34,91,300 వున్న బడ్జెటులో రు. 100 లు మాత్రమే కోతపెడుతున్నాము. మా జిల్లాకు సంబంధించినంతవరకు గత 50 సంవత్సరాలనుండి ఆందోళన చేసినప్పటికి, ఎన్నిసార్లు ప్రభుత్వంతో మనవిచేసుకున్నప్పటికి, అనేకసార్లు మన ఇరిగేషనుమంత్రిగారు అక్కడకివచ్చి అక్కడ ప్రజలతాలూకు ఆందోళనచూసి వాటికి promise చేసినాఇంత వరకు ఏ scheme ను ఈబడ్జెటులో చేర్చలేదు. అయితే ఒకదానికిమాత్రం వారిని నేను అభినందించకతప్పదు. వారిహయాంలో ఇదివరకు 50 ఏండ్లనుంచి పడివున్న వంశధారా ప్రాజెక్టును ఇప్పటికైనా తీసుకువచ్చి investigate చేయించి నందికొండ, తుంగభద్ర హైలెవెలు ఛానలు, వంశధారకూడా ఒకేసారి తీసుకురావడానికి దీక్షతో వున్నందుకు వారిని సంపూర్ణంగా అభినందిస్తున్నాను. దానిని investigate చేసి కేంద్రానికి పంపి నందుకు Chief Engineer గారిని కూడా అభినందించకతప్పదు. అయితే ఒకటి మాత్రం ఇపుడు కోరుతున్నాను. రాష్ట్రకాంగ్రెసు ప్రెశిడెంటుగా వుండిన Chief Minister గారు, Vice President గా వుండిన కళావెంకటరావుగారు ఉభయులు ఆనాడు చేసిన తీర్మానం, చేసిన promise ప్రకారం ఈ రోజున వంశధారా రిజ

ర్యాయరును రెండవ పంచవర్ష ప్రణాళికలోనైనా చేర్పించవలసియున్నది. ఈ మధ్య ఢిల్లీ వెళ్ళినపుడు Planning Commission వారితో చర్చించాలని ప్రత్యేకించి కోరుతున్నాను. మా జిల్లాకు సంబంధించినంతవరకు నారాయణపురం ప్రాజెక్టు, వేగావతి ప్రాజెక్టు, సీతానగరం ప్రాజెక్టు వున్నాయి. వెనుకబడినజిల్లావాణ్ణి కాబట్టి కొంచెం time ఇప్పించాలని కోరుతున్నాను.

Mr. SPEAKER :— చెప్పడంలో కూడా వెనుకబడతారు.

Sri T. PAPARAO :— ఇవన్నీ రెండు సంవత్సరాల్లో పూర్తి చేసుకోవాలని Duputy Chief Minister గారు చెప్పినందుకు వారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

Sri P. SUNDARAYYA :—అధ్యక్షా ! మంత్రిగారు ఇరిగేషను సమస్య మీద మాట్లాడుతూ, ఏ పార్టీఅయినా ఎవరైనా ఆంధ్రరాష్ట్ర అభివృద్ధి కొరకు, ఆంధ్ర ప్రజల అభివృద్ధికొరకు సలహాలు ఇస్తే, మేము చేసే పనుల్లో వుండే పొరపాట్లు చూపిస్తూ విమర్శలు, సలహాలు యిస్తే, జాగ్రత్తగా ఆలోచించి పొరపాట్లు దిద్దుకొని, పొరపాట్లు చేశాము అని ఒప్పుకుని, మార్చుకుంటామని చెప్పతూ ఉపన్యాసం ఆరంభించడం, హామీ ఇవ్వడం వల్ల మేము సంతోషించుచున్నాము. అదే రీతిగా బడ్జెటుపై general discussion లో కొన్ని సూచనలు చేశాము. ఆ దృష్టితోనే మరల కొన్ని వివరాలు తమ ముందు పెట్టదలుచుకున్నాను. కొంతమంది general discussion లో మనకి ఇప్పటికే ఎక్కువ ప్రాజెక్టులు వచ్చినాయి; ఇప్పటికే మనకు బియ్యం మొదలైన వాటిల్లో మిగులు వున్నది, అందుచేత ఇంకా ఎక్కువచేస్తే ధరలు పడిపోతాయి అని ప్రాజెక్టులు కొంతవరకు తగ్గించుకోవాలనే ధోరణిలో మాట్లాడారు. కాని మనం మనదేశంలో నీరు అనేదాని విషయంలో సంతృప్తికరంగా త్వరలో పరిష్కరించుకొనగలం అనుకోవడం ఆశ్చర్యకరం. నీటిని మనకందరికి అందచేయడానికి చాలాకాలం పట్టవచ్చును. ఈ ప్రాజెక్టులకు హద్దు ఇంతవరకు వున్నదని చెప్పడం ఎవటికి సాధ్యంకాదు. మనది ఎండల దేశం. మిగిలిన చలిదేశాల విషయాలలో వలెగాక, మనకు నీటి అవసరం చాలా వున్నది. అందువల్లనే అరేబియా దేశంనుంచి భూమధ్యరేఖ ప్రాంతాలవరకు నీటికి ఎక్కువ ప్రాముఖ్యత వున్నది. అమృతంక్రింద దీనిని భావించారు. ఉప్పు సముద్రం మధించి మంచినీరు సంపాదించారట ? ఆ దృష్టితో చూసినా, అనేక తాలూకాలనుంచి వచ్చిన వివిధ శాసన సభ్యులు మా తాలూకాకు నీరు రావడంలేదు, మా చిన్న చెరువుకు నీరు రావడం లేదు, పార్వతీపురం తాలూకాలో 2000 చెరువులు మరమ్మతు లేకుండా వున్నాయి అని చెప్పారు.

నిజమే, ఇవన్నీ దృష్టిలో పెట్టుకున్నప్పుడు మనముందు యింకా ఎంత పెద్ద పని వున్నదో మనం స్పష్టంగా గుర్తించాల్సి వుంటుంది. ఐతే రామకృష్ణరాజుగారు చెప్పిన దాంతో నేను ఏకీభవించడంలేదు. చిన్నచిన్న స్కీములకు కోటి రెండు కోట్లు కేటాయించి తప్పకుండా అభివృద్ధిచేయవలసినదే. 'Damn the dams' ఆనకట్టలను ఆపుచేయండి అనే నినాదంతో నేను ఏకీభవించను. మనకు ఇంకా ఎక్కువ కావాలని నేను చెబుతున్నాను. చేసినంతవరకు అభినందిస్తున్నాను. చాల సమగ్రమైన ప్రణాళిక పెట్టుకొని సాధించాలి. చిన్న చిన్న minor irrigation ప్రాజెక్టులకు కూడ ప్రాధాన్యత యివ్వాలని మనమందరము

21st July 1955] (Sri P. Sundarayya)

ఒప్పుకున్నాం. కాని వాటికి కావలసిన ధనం ఎక్కడనుంచి వస్తుంది అనే దాంట్లో మాకు కాంగ్రెసు మంత్రివర్గానికి భేదాభిప్రాయం వున్నదని యీ 15 రోజుల చర్చలలో తెలుసుకున్నాం. కడుతున్న dam లు చాలు, యికముందు అవసరంలేదని చెప్పేవారు, వాస్తవిక పరిస్థితిని గుర్తించడంలేదని చెప్పాల్సి వస్తుంది. ఎందుకంటే చిన్నచిన్న చెరువులు చాల కాలంనుంచి మరమ్మతులు లేకుండా వున్నాయి. వర్షాలు బాగాపడుతున్నా, పడక పోయినా minor irrigation ప్రాజెక్టులుకట్టిస్తే ప్రజకుపయోగముంటుంది. అందువల్ల పెద్ద ప్రాజెక్టులతో minor irrigation ప్రాజెక్టులు ముడి పెట్టకుండా రెంటినీ సమన్వయపరచి minor irrigation, major irrigation లకు ఆధారంగా వుండే టట్లు చేస్తే ఖర్చుపెట్టే డబ్బు ఉపయోగకరంగా వుంటుంది. కేవలం major irrigation ప్రాజెక్టులమీద గాని, minor irrigation project ల మీద గాని ఆధారపడ్తే లాభంలేదు. నందికొండ ప్రాజెక్టును ఆరంభించినందుకు అభినందిస్తూ, నంది కొండ గురించి యింకా అనుమానాలకు తావిస్తున్నందుకు విచారిస్తున్నాను. ఇప్పుడు అనవసరంగా ప్రజలలో కొన్నికొన్ని సందేహాలు అపోహాలు రావడానికి వీలున్నది. మంత్రిగారు వారిదగ్గరున్నటువంటి సమాచారం బైటపెట్టినప్పుడు అనవసరమైన అపోహాలు, వాగ్వాదాలు, స్థానిక తత్త్వం రెచ్చగొట్టడం జరుగదు. ఒక సమగ్రమైన ప్రణాళిక ప్రజలముందు పెట్టండి. ఆంధ్రదేశమును దృష్టిలో పెట్టుకుని, విశాలాంధ్రను దృష్టిలో పెట్టుకొని వెనుకబడిన ప్రాంతాలను దృష్టిలో పెట్టుకొని సమగ్రమైన పథకం తయారు చేయాలి. నందికొండ, తుంగభద్ర, వంశధార, యీ మూడు ప్రాజెక్టులకు ప్రాధాన్యత యివ్వడం సరైన నిర్ణయమని, ఆంధ్రదేశం దృష్టిలో వుంచుకొని, విశాలాంధ్రను దృష్టిలో నుంచుకొని మనవిచేస్తున్నాను. ఐతే నందికొండను గురించిన అనుమానాలు ఏమిటి? పులిచింతల ప్రాంతం యిందులో చేరుతుందా, చేరదా? పులిచింతల ప్రాజెక్టు ఆయకట్టు సాగవుతుందని దానిని నందికొండలోనే చేర్చమని ఒకాయన చెప్పారు. చేస్తుందో లేదో స్పష్టంగా చెప్పండి. ఇది యిప్పుడు చేరుతుందా లేదా? చేరకపోతే చేరదు అని చెప్పండి. దానిమీద controversy లేకుండా పోతుంది. చేరకపోతే దానికి కారణా లేమిటో చెప్పండి. ఇంజనీర్లు చెప్పేది యేమిటి? దానికి కాలువ త్రవ్వించి నీరు ఇచ్చేదానికి అయ్యే ఖర్చు ఎక్కువ అని. దీంట్లో ఇంకా ఎక్కువ ఆదాయం వస్తుందని ఒక సూచన చేశారు. ఆ విధంగా చెప్పి ప్రజలను convince చేస్తే లేనిపోని అనుమానాలకు తావుండదు. ఈ కాలువ తమ్మిలేరుకు మధ్యగా పోతుందని పటాలలో కనిపిస్తుంది. ఆ విషయం స్పష్టంగా చెప్పండి. ఈ కాలువ తమ్మిలేరువరకు పోతుందా లేకుంటే మున్నేరు కట్లేరువరకు వెళ్ళి ఆగిపోతుందా స్పష్టంగా చెప్పండి. మూడవది మొదటి phase రెండవ phase ల విషయం. మొదటి phase లో 9 ఏండ్ల ప్రాజెక్టు పూర్తి అయినతరువాత ఆయకట్టు అభివృద్ధికి 7 సంవత్సరాలు పడితే మొత్తం 16 సంవత్సరా లవుతుంది. కాని 2 వ phase ఎప్పుడు అమల్లో పెడతారు, ఎప్పుడు పూర్తవుతుంది అనేదాన్నిగురించి మాకిచ్చిన చిన్న పుస్తకంలో ఏమీలేదు. ఇది 16 ఏండ్లు పడితే ఎట్లా, ఈలోగా సోమశిల ప్రాంతానికి, తిరువూరు ప్రాంతానికి కాలువ వస్తుందా? స్పష్టంగా చెప్పండి. ఒక నిర్ణీత కార్యక్రమం లేక తుంగభద్ర ఎగువ కాలువ కట్టనందువల్ల ప్రాజెక్టు

పూర్తయినా నీరు అందలేదు. అటువంటి దుర్గతి నందికొండ ప్రాజెక్టుకు రాకుండా చేసుకోడానికి పూర్తిగా sanction చేయించుకోవాలి. తరువాత ప్రాజెక్టు పూర్తి నిర్మాణమునకు 9 ఏండ్లు పడుతుందో లేక మొదటి phase పూర్తికావడానికి 9 ఏండ్లు పడుతుందో చెప్పినట్లయితే యితర ప్రాజెక్టులు ప్రణాళికలో యిముడ్చుకోవడానికి వీలుఅవుతుంది. ఇంక ఖోస్లా కమిటీ యిచ్చిన alignment కు యీ పుస్తకములో ఇచ్చిన alignment కు ఎంతో భేదము వున్నది. ఎందుకోసం మార్చారు? కొన్ని ఎకరాలు సాగులోనికి రాకుండా పోతవి కనుక వివరించిచెబితే సలహాలు యివ్వడానికి వీలుంటుంది. ప్రజలకు కూడా నచ్చ చెప్పడానికి వీలుంటుంది. అందుచేత ఆ వివరాలు చెప్పమని కోరుతున్నాను. తరువాత యీ projects విషయంలో మొత్తం సమగ్ర ప్రణాళికను చూచినపుడు, యీ నందికొండ ప్రాజెక్టు చూచినపుడు, ఖోస్లా కమిటీ నందికొండ రెండవ స్టేజిలో సిద్ధేశ్వరం, సోమశిల రెండూ link up చేసినట్లు చెబుతున్నారు. ఆ రెండు 10 ఏండ్ల తరువాత వస్తవేమో? అప్పటి పరిస్థితులనుబట్టి వుంటుంది. నందికొండ వచ్చింది. తుంగభద్ర వచ్చింది. వంశధార రాబోతుంది. తుంగభద్ర ఎగువ కాలువ గురించి ఢిల్లీప్రభుత్వం అంగీకరిస్తే తీసుకుంటాం అని చెప్పారు. సిద్ధేశ్వరం, సోమశిల ప్రాజెక్టులు రానంత కాలం కర్నూలు, కడప, అనంతపురం జిల్లాలకు ప్రయోజనం ఉండదు. అందుచేత సిద్ధేశ్వరం, సోమశిల ప్రాజెక్టులు సాధించాలి. అందుచేత నేను రామకృష్ణరాజుగారితో అంగీకరించలేక పోతున్నాను. నందికొండతో సంతృప్తి పడకూడదు. ఇంక సోమశిల, సిద్దేశ్వరం ప్రాజెక్టులు కావాలి. వరుస ప్రకారం యీ పూరుదగ్గర ప్రాజెక్టు కడితే అటు విశాఖపట్నం, కొవ్వూరు, పోలవరం తాలూకాలకు నీరు ప్రవహింపజేసి, క్రిష్ణా డెల్టా అంతా నందికొండ క్రిందవచ్చి, దక్షిణాదికి నీరు తీసుకు పోవడానికి అనేక ప్రణాళికలున్నాయి. నందికొండ ప్రాజెక్టువల్ల 12 లక్షల ఎకరాలకు కరీంనగర్, ఆదిలాబాదు, నల్లగొండ, వరంగలు ఈ నాలుగు జిల్లాలలో నీటి పారుదల కలుగుతుంది కూడా. అవి కూడా తెలుగు ప్రాంతాలే. అక్కడ ప్రజలుకూడా రాయలసీమ ప్రజలవల్లెనే బాధ పడుతున్నారు. అటువంటి ప్రాంతాలకు గోదావరినీటిని పంపాలి. 3 వేలకు శతకోటి ఘనపుటడుగులు guaranteed supply వున్న నీటిని అడ్డగించి ప్రాజెక్టులు కృష్ణాపురందగ్గర కట్టుకోవాలి, యింకింపల్లి దగ్గర కట్టుకోవాలి. యీపూరుదగ్గర కట్టు కోవాలి, అని సక్రమంగా సమగ్రమైన ప్రణాళికలు వేయాలి.

వీటి అన్నిటినిగురించి మనము శ్రద్ధ తీసుకోనవలెను. ఇంతవరకు ప్రభుత్వము తీసుకొన్నది, ఆంధ్ర ప్రజానీకమంతా కోరుతున్నది, నందికొండ, తుంగభద్ర ఎగువ కాలవలు. ఈ ప్రాజెక్టులు పూర్తి అయ్యేదానికి పదిఏండ్లు పట్టుతుంది అనుకోండి, ఈ నందికొండ అంతా పూర్తి అయ్యేవరకు పెన్నలోకి నీరు వచ్చేటప్పటికి నందికొండ కాలవను 10 ఏండ్లలో పూర్తి చేస్తాం అనుకొన్నప్పటికి కూడా, రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల రైతులను నందికొండను చూచి సంతుష్టిపడండి అంటే అందరు సంతుష్టి పడరు. వాండ్లకు కాస్తో కూస్తో ఉంటే ఈ నందికొండనుగురించి గొప్పగా చెప్పుకుంటారు. ఏమిలేకుండా కడుపుమాడుస్తుంటే, వాళ్ళను ఎండబెడుతూ ఉంటే, నందికొండను చూచి సంతోషించమంటే సంతోషించరు అనే సంగతి నిజము. ఈ సందర్భంలో కొందరు మిత్రులు తిరువూరు సమస్య ఒకటి చెప్పారు. ఇంకా అనేక ప్రాంతాలగురించి చెప్పారు. పెద్ద ప్రాజెక్టు వస్తుందని చిన్న ప్రాజెక్టుల, చెరువుల మరమ్మతులు కూడా

వెనుకకు నెట్టివేస్తున్నారు. అది మన ఇంజనీర్లకు అసాధ్యమైన పనికాదు. పెద్ద ప్రాజెక్టులు వచ్చినప్పటికి కూడ, చిన్న చిన్న ప్రాజెక్టులలో వుండే నీటిని సక్రమంగా ఉపయోగించేటట్టు నిరుపయోగం కాకుండేటట్టు ప్లాను వేయడం అసంభవము కాదు. ఈ పను లన్నిటిని శ్రద్ధతో అమలు జరిపించవలెనని కోరుతున్నాను. ఈ నందికొండ ప్రవహించే టటువంటిచోట అనేక నదులు ఉన్నవి. కొన్ని నదులకు ఇపుడే reservoir లు కట్టుతున్నారు. వాటిని మున్ముందుకూడ కట్టినట్లయితే ఈ నందికొండ నీరు కొంచెము ఎక్కువగా క్రిందికి తీసుకొని పోవుటకు వీలు ఉంటుంది. అయితే ఎంత డబ్బు అవు తుందనే దానినిగురించి ఇంజనీర్లుచెప్పవలసి వుంటుంది. నందికొండ డామ్ నీరు సోమశిల పోవడానికి 10 ఏండ్లు పడుతుంది. నందికొండ నీరు అక్కడికి పోయినప్పటికి కూడ, సిద్ధేశ్వరం వస్తేనే నిజంగా సోమశిల రిజర్వాయరుకు ఉపయోగముంటుంది. ఈ రోజు కూడ పెన్నపైన గండికోట డామ్ కటినతర్వాతకూడ—అంటే సోమశిలకు గండికోటకు నేను పోటీపెట్టను—గండికోటవరకు వచ్చే నీటిని అంతాకూడ గండికోట దగ్గర పెద్ద reservoir కట్టి ఆపుచేసినతర్వాతకూడ, ఇంజనీర్లతో సంప్రతించినపుడు, ఇపుడు ఉన్న delta కు గాక మరొక రెండు లక్షల్లో యింకొ కొంచెం అదనంగానో, కనీసం రెండు లక్షలకు తక్కువ కాకుండాను, పెన్నలో నీరుంటుందని చెప్పారు. అయితే దానికి ఎంత dam కట్టవలెనన్న సంగతి అటుపెట్టండి, ఈ నదిలో ప్రవాహాలు అప్పుడప్పుడు వస్తూఉంటాయి. పెద్ద ప్రవాహాలు వచ్చే సంవత్సరాలు ఉన్నాయి. మరి ప్రవాహాలు రాని సంవత్సరాలు ఉన్నాయి. కాని ఈ పెద్ద ప్రవాహాలు వచ్చినపుడు, సంగం నెల్లూరు ఆనకట్టదగ్గర వున్నట్లే barrages నందికొండ, సోమసిలల దగ్గర కట్టితే 113 లక్షల రూపాయలు మాత్రమే ఖర్చు అవుతుంది. అక్కడనుంచి కాలవలు తీయండి.

ఆ విధంగా చేసినట్లయితే ఎన్నో చెరువులు నిండుతాయి. అందుచేత వాటిని వెంటనే ఆరంభించవచ్చు. అదేవిధముగా రాపూరు, వెంకటగిరి, గూడూరు, సూళూరుపేట తాలూకాలలోని చెరువులకు నీరు తెచ్చేందుకు ఒక కాలువ త్రవ్వినట్లయితే ప్రవాహం వచ్చినపుడు చెరువులు నిండుతాయి. ఈ కాలువలు త్రవ్వితే — 3, 4 కోట్లు కావచ్చును. - కనుపూరు barrage మొత్తం అన్నీ కలిపితే 3, 4 కోట్లుకావచ్చును. ఒక పది ఏండ్లపాటు, సిద్ధేశ్వరం, సోమశిల వచ్చేవరకు కూడ, ఈ మెట్ట తాలూకాలకు నీటి సరఫరా చేయడానికి వీలు ఉంటుంది. అందుచేత ఇటువంటి వాటి నన్నిటిని కూడ సమగ్రంగా ఆలోచించుకోవడం మంచిది. గండికోట ఈ పనులకు ఎంతమాత్రం అడ్డం రాదు, సిద్ధేశ్వరంకు అడ్డంరాదు, అక్కడ గోదావరికి అడ్డురాదు. మనము అనుకొన్న ప్రకారం అందరుకూడ సంతృప్తికరముగ ఉండే దానికి వీలు అవుతుంది. తరువాత K. C. Canal విషయానికి వచ్చినపుడు కూడ ఉన్నసంగతి స్పష్టంగా చెప్పవలెను. "కాలువ capacity ని ఆరువేల cusec లకు మార్పుచేయడానికి మేము తయారు కావడంలేదు. Delhi ప్రభుత్వం చెప్పినా, వారి కమిషన్ చెప్పినా, ఆరువేలు cusec లతో చేయడం అన్నది లాభంలేదు. దానిలో నష్టం, దానికన్నా మేము వెళ్లుతున్న పద్ధతి సరియైనది" అని చెప్పండి. నీరు ఎక్కడ ఉంది అనే సమస్య వస్తుంది. ఆసంగతి చెప్పండి. విషయాలు స్పష్టంగా ప్రజలకు చెప్పినట్లయితే ప్రాజక్టులకు పోటీ పెట్టడమనే సమస్య రాదు. అందుచేత దానిని గురించి కూడ, కొంత time తీసుకొన్నప్పటికి కూడాను, వివరించి చెప్పినట్లయితే అనుమానాలు లేకుండా, అనవసరమైన చర్చలతో ఒకరితో నొకరు పోటీ పెట్టుకొనే తత్వాలు లేకుండా అంతకము కలిసి ముందు నీరు సాగుకు ఉపయోగించుటకు

ప్రయత్నిద్దాము. ఆరకంగా భూములన్నీ కూడాను ప్రతికుటుంబానికి 5 ఎకరం అయినా గ్యారంటీ చేయగలిగితే, ఈ project ల వల్ల మీరు దేశాన్ని ఎంతో ముందుకు తీసుకొని పోయినవాండ్లు అవుతారు.

తర్వాత తుంగభద్ర ఎగువ కాలువను గురించి మరొకసారి చెప్పవలసిఉంటుంది. తుంగభద్ర ఆనకట్టక్రింద సాగుకావలసిన భూమి 75 లక్షల ఎకరములున్నది. ఇప్పుడు 4 లక్షల ఎకరములకు మాత్రమే నీరు ఇవ్వబడుతుంది. అదికూడ మూడవవంతు మాగాణి, రెండువంతులు మెట్ట. ఆ లెక్కతో 4 లక్షల ఎకరములకు మాత్రం ఇస్తున్నారు. మిగిలిన 11 లక్షలకు నీరు లేదు. ఈ సంగతి మనం గుర్తుపెట్టుకున్నపుడు సిద్ధేశ్వరం, సోమశిల లేక గోదావరి నీటినికూడ ఎంత త్వరగా ఉపయోగానికి తీసుకొని వస్తే అంత మంచిదని భావించవలసివుంది. అప్పుడు ఈ రోజు K. C. Canal క్రింద గాని, లేకుంటే low level canal నుంచిగాని వచ్చిన తుంగభద్ర నీటిని అంతా పూర్తిగ ఉపయోగించేదానికోసం కూడా వీలుఉంటుంది. ఈ లోపల ఉన్న నీటిని అందరికి కాస్తో, కూస్తో సర్ది, ఒక పూట అయినా తినమని, ఒక పిడికెడు తిండిఅయినా తిన మనే రకంగా పంచడం అనేది తప్పనిసరి అవుతుంది. ఈ తుంగభద్ర విషయంలో ఇటువంటి అడ్డంకులు లేవని మంత్రిగారు ఈ రోజు మాత్రం ఒక మాట వదిలారు. తుంగభద్రను వాయిదా వేస్తారేమో, రాకుండా చేస్తారేమో అని నాకు కొంత భయంగా ఉండింది. ఆ భయం ఉంటే స్పష్టంగా చెప్పండి. నందికొండకోసం ఏ విధంగా ఏకమై ఆంధ్రజాతి అంతా పోట్లాడిందో, అదే రీతిగా తుంగభద్రకోసం పోట్లాడుదాము. మనస్సులో ఏదో భయం ఉంది అని చెప్పేసి, మనస్సులోనే ఆ భయం పెట్టుకొని, ఆఖరుకు కొంప మునిగినతర్వాత వస్తే మాత్రం ఉపయోగం ఉండదు. అందు చేత ఉన్న భయం ఏమిటో, ఏమిచిక్కులున్నాయో స్పష్టంగా చెప్పండి. దానిని బట్టి అందరంకూడ కలిసి, తుంగభద్ర ఎగువకాలువవిషయంలో అనుమానాలు లేకుండా తేల్చుకునేందుకు వీలుంటుంది.

తర్వాత మైనరు ఇరిగేషన్ projects ను గురించి అనేకమంది చెప్పారు. వాటిని గురించి ఎక్కువ వివరాలకు నేను వెళ్ళవలసిన అవసరం లేదు. వాటిని అన్నిటినిగురించి జిల్లాకు ఇంతఅని చెప్పేసి, వెనకబడిన ప్రాంతాలకు డబ్బు కేటాయించి కొన్ని మైనరు ప్రాజెక్టులను ఇప్పటికన్నా ఎక్కువగా ఆరంభించి చేయాల్సి ఉంటుంది. ఈ సందర్భం లోనే జమీందారి ప్రాంతములో ఉన్నటువంటి చెరువులను, వాటిని తీసుకొని పది ఏండ్లు అయిపోయినప్పటికికూడ, ఇంకా మరమత్తు చేయకుండ ఉండడం జరుగుతోంది. వాటిని ఇదేరకంగా neglect చేసి, ఎప్పుడో ఈ ప్రాజెక్టు కట్టుతామని ఇంకొక 10 ఏండ్లు మీరు ఆగమంటేమాత్రం అది సరియైనదికాదు. ఆ చెరువుల మరామత్తు కోసం తగిన శ్రద్ధ తీసుకోవలసి ఉంటుంది అని మనవిచేస్తున్నాను.

తరువాత నీటి పంపకం విషయం ఉంది. అది Revenue Department క్రిందికి వస్తుందో లేక ఇరిగేషన్ క్రిందికి వస్తుందో సరిగా తెలియదు. ఇరిగేషన్ శాఖకు చెందకపోయినా రెవెన్యూ డిపార్టుమెంటువాండ్లకు చెప్పి అందరకు న్యాయము కలిగేటట్లు చేయవలసిఉంది. కాలువలుత్రవ్వుతూంటారు. Project లు కట్టుతుంటారు అక్కడ భూమి లేని వాండ్లకు మీరు ఇచ్చేదిలేదు, చేసేదిలేదు, అది వదిలేసివేయండి. కాని నీరు పెద్దచిన్న విచక్షణలేకుండా సరఫరా అయేటట్లు చూడవలసిఉంది. అక్కడకూడ పెద్ద భూస్వాములు

21st July 1955] (Sri P. Sundarayya)

ముందు మాకు పారవలెను, తరువాత ఇతరులకు అనేటటువంటిది అనేక గ్రామాలలో, స్థలాలలో జరుగుతూ ఉంటుంది. ఉదాహరణలు కావలనంటే అనేకం చెప్పగలను. ఈ విషయాలు మీకు తెలిసిందే. నాకు తెలిసిందే. అక్కడ కూర్చొన్న వారందరికి తెలిసినదే. అందుచేత, ఈ నీటిని చిన్న రైతుతోపాటు అందరికి కూడ సక్రమంగా పారేటట్లు చూడవలసిఉంది. ఇంకా చిన్నరైతులకు ముందుపారి పెద్ద రైతులకు వెనుక నీరు ఇచ్చినా ఇబ్బందిలేదు. పెద్ద రైతులకు 10 ఎకరాలు తడవకపోయినా కొండమునిగి పోయిందేమీ లేదు. చిన్న రైతులకు ముందు పారేరీతిగా, నీళ్లు వాండ్లకు సక్రమంగా అందేటట్లుగా తగినచర్యలు తీసుకోవాలి. ఏన్నో గ్రామాలలో, నీటి విషయంలో అనేక తగాదాలు, దెబ్బలాటలు, పార్టీలు, ఏర్పడుతున్న సంగతి మనకు తెలుసు. అందుచేత నీటిని సక్రమంగా పంచాలి. ఈ విధమైన తగాదాలు రావడం, కక్షలు పెరగడం అనేది చిన్న ఉద్యోగుల లంచగొండి తనంవల్ల జరుగుతుంది. Petty corruption ఎందుకు వస్తుందో దానిని మనం చర్చించుకోవచ్చు. అది కాదు సమస్య. దానిని పోగొట్టేదానికి మార్గం ఏమిటి? దానికి ముఖ్యంగా కేవలం ఉద్యోగస్తులమీద ఆధారపడకుండా ప్రజల సహకారం తీసుకొనవలెను. గ్రామంలో నీరు పంచుకోవడం మొదలైనవి గ్రామ పంచాయితీలకు స్వాధీనం చెయ్యాలి. వాండ్లచేత check-up చేయించాలి. పంచాయితీలలో ఎన్నుకోబడిన మనిషి, సక్రమంగా చేయకపోతే ప్రజలు అడుగుతూ ఉంటారు. 1, 2 ఏండ్లకు ఊడబెరికివేస్తారు. సరిగా పని చేయకపోత్తే, 'నిన్న ఎన్నుకొన్నాం, నీరైనా సక్రమంగా సరఫరా చేయనటువంటి మనిషివి ఎందుకని' ఊడబెరుకుటకు వీలు ఉంటుంది. అందుచేత ప్రజలచేత ఎన్నుకోబడిన పంచాయితీని కానివ్వండి, కాలవ కమిటీఅనిగాని, రైతాంగంచేత ఎన్నుకోబడినటువంటి ఒక సంఘాన్ని పెట్టి నీటిని సక్రమంగా, సరియైన కాలంలో అందుబాటుచేసే ఏర్పాటు చేయవలెను.

తరువాత మంత్రిగారు మన ఇంజనీర్లు ఏదో చేస్తారు, ఏదో కొత్తకొత్త ప్రాజెక్టులు త్వరగా కట్టాలని ఆదుర్దా చూపు తున్నారని వారి కృషిని ప్రశంసించారు. నిజమే తప్పకుండా అందరూ కాకపోయినా కొంతమందైనా ఉత్సాహంతో కృషి చేస్తున్నందుకు అందరు అభినందించ వలసిందే. అదేరకంగా క్రిష్ణా బారెజ్ విషయములోను రాత్రి పగలు పనిచేసి సకాలములో పూర్తిచేయడానికి పూనుకుంటున్నందుకుకూడా వారిని అభినందించ వలసి యున్నది. అంతేకాకుండా ఈ క్రిష్ణా ఆనకట్ట తెగిపోతున్నప్పుడు మన ఇంజనీరు వేపాగారు తన ప్రాణాన్ని సైతము లెక్కచేయకుండా దాన్ని అరికట్టేందుకు ప్రయత్నం చేస్తూ ప్రాణాలు అర్పించినటువంటి ఘట్టాలు మనకు తెలుసు. అటువంటి ఇంజనీర్లు మొదలగువారిని అభినందిస్తాము. అటువంటి వారిని ప్రోత్సహిస్తాము, తగిన సహాయము ఇస్తాము. అయితే అటువంటి కొద్దిమందిని మాత్రము చూచి సంతృప్తి పడడానికి వీలులేదు. ఈ departments లో అవినీతి corruption ఎక్కువ ఉన్నది. అయితే దాన్ని గురించి మేముఏమిచర్యతీసుకోలేము, వారు కోర్టుకు వెళ్ళతారుఅని చెపుతున్నారు. కోర్టుకు ఎక్కితేఎక్కవచ్చు. కాని ప్రభుత్వము లంచాలుతీసుకొనేటటువంటివారిని, సరిగాపనిచేయనివారిని పనిలోనుంచి తొలగించడం చేయకుండానే వారిప్రాణము తలనుంచి తోకకు తీసుకొని రావడానికి అనేక మార్గాలున్నాయి. ఆవిధంగా చేయవచ్చు. కాని ఆవిధంగామీరు చేయరు. మా రాజకీయ ప్రతికక్షులమీద మాత్రం ఏదేదో చేస్తూ ఉంటారు. మీ ఉద్యోగస్థులమీద చేయాలంటే మాత్రం కోర్టులు అడ్డము వస్తాయి, democracy అడ్డము వస్తుంది. అది ప్రజల గురించే చేసేదని జ్ఞప్తి ఉంచుకొంటే బాగుంటుంది. ఆచర్చ ఇప్పుడు

కాదు, Police Demand వచ్చినపుడు చర్చించుకోవచ్చు. ఇప్పుడు ఈ సందర్భంలో contracts విషయం ఆలోచిద్దాము. ఇప్పుడు అనేక ప్రాజెక్టులు కట్టుతున్నారు. ఇవి కట్టేటప్పుడు P. W. D. డిపార్టుమెంటువారు దీనిని supervise చేయడము engineering సలహాలు చెప్పడంతోనే వీరిపని పరిమితి అవుతున్నది. చిన్న చిన్న పనులైతే డిపార్టుమెంటువారే చేస్తారు. మిగిలిన పెద్దపనులన్నీకూడా కంట్రాక్టర్లకు ఇయ్యబడంజరుగుతుంది. అప్పుడు దానికి టెండర్లుపిలవడం మొదలగు తతంగంఅంతాచాలాఉన్నది. ఈ పద్ధతివల్ల కూలీలకు న్యాయం జరుగడం లేదు. ఈ కంట్రాక్టర్లు లాభాలు సగానికి సగము వేసుకొంటారు. ఏ పరిస్థితులలోనైనా మూడవ వంతుకు తక్కువ ఉండదు. అందుచేత పంచాయితీలు, కార్మిక సహకార సంఘములు ఇటువంటి ప్రజాసంఘాలచేత పని చేయిస్తే బాగుంటుంది. అయితే కార్మికులకు పని ఇవ్వడములో ప్రభుత్వానికి ఒక చిక్కు ఉండవచ్చు. కంట్రాక్టర్లు దగ్గర డబ్బు ఉంటుంది. కాబట్టి వారికి ముందుగా డబ్బు బటువాడా చేయనవసరములేకుండా ఒక వారమో, 15 రోజులో నెల రోజులో అయిన తరువాత ఇవ్వవచ్చు. కాని కార్మికులచేత ఏదైనా పని చేయించేటప్పుడు మీరు 15 రోజులవరకు డబ్బు అడుగకండీ అంటే వాళ్ళకు అంతవరకు తినడానికి లేకుండా ఉంటుంది. కనుక వీరి విషయంలో రోజు రోజు గాకపోయినా 4, 5 రోజుల కొకమారైన బట్వాడ చేసే ఏర్పాటు చేస్తే ఈ సంఘాలు ఎన్నో పనులు చేయడానికి వీలుంటుంది. అప్పుడు ఈ కంట్రాక్టర్లతో అవుసరముండదు. ఈ కంట్రాక్టర్లు విపరీతంగా లాభాలు తీసుకోవడమే కాకుండా వారుచేసే పనికూడా సంతృప్తికరముగా ఉండదు.

కనుక ఈ contract పద్ధతిని సాధ్యమైనంతవరకు తగ్గించి, ఈ ప్రజా సంఘాలను ఉపయోగించవలసిందని కోరుతున్నాను. ఆ విధంగా చేయకపోతే, పనులు సరిగా జరగివు, సంతృప్తి ఉండదు, కూలీలకు సరియైన జీతాలు ఉండవు. వారికి కూలి సరిగా ఇవ్వడములేదని, ఇచ్చే కూలి చాలదని రోజూ అలజడి చేస్తూ ఉంటారు. అప్పుడు దాన్ని గురించి ఆందోళన చేస్తే కమ్యూనిస్టులు అక్కడకూడ రెచ్చగొడుతున్నారు అనే ఒక విసురు విసరడం తప్పితే ఇంకేమీ ఉండదు. అందుచేత ఈ విషయాన్ని కొంత శ్రద్ధతో ఆలోచించి చేస్తారని ఆశిస్తున్నాను.

ఆఖరున ఒక విషయం మంత్రిగారికి చెప్పదలచుకొన్నాను. ఆంధ్రరాష్ట్రము యొక్క అభివృద్ధికొరకు ప్రాజెక్టులు కట్టేటప్పుడు, వాటిలో ఎక్కడెక్కడ పొరబాట్లున్నాయో, అవి చెప్పుతాము. కావలసిన సూచనలు చేస్తాము. వాటిని సక్రమంగా సరిగా నిర్వహించడానికోసం మేము చేయదగిన సహాయం ఎంతవరకు ఉంటే, అంతవరకు చేయడానికి సిద్ధంగా ఉన్నాము. అదే దృష్టితోనే ఈ సమస్యను చూస్తున్నాము. మంత్రిగారు కూడ అదేవిధంగానే, ఒక irrigation విషయంలోనే కాకుండా, ఇతర విషయాలన్నిటినికూడ అదే దృష్టితో చూస్తే బాగుంటుందని నేను మనవిచేస్తూ విరమిస్తున్నాను.

The Hon. Sri N. SANJEEVA REDDI :— అధ్యక్షు మహాశయా ! సుందరయ్యగారు మాట్లాడకముందు తమరు నాకెంత time కావాలని అడిగితే, 45 నిమిషాలు కావాలని చెప్పాను. కాని సభ్యులు ఇంతకుముందు చేసిన ఉపన్యాసాలకు అంతా సుందరయ్యగారే సమాధానం చెప్పారు. కాబట్టి నేను మాట్లాడ

దానికి నాకంత time అవసరంలేదేమో అనుకొంటాను. ఇప్పుడు 35 మంది సభ్యులు మాట్లాడారు. వారి ఉపన్యాసాలలో హెచ్చుభాగము controversial points ఏమి లేవనుకొంటాను. తమ తమ ప్రాంతాలలో అక్కడక్కడ చెరువులు, కాలవలు మరమ్మతులు చేయవలసిందని, చిన్న చిన్న ప్రాజెక్టులు కట్టవలసిందని వాటిని ప్రభుత్వ దృష్టికి తెచ్చారు. అది న్యాయమే. అది శాసన సభ్యుల యొక్క విధికూడ. అందుకు వారిని అభినందిస్తున్నాను. అన్నీ చేయగలుగుతామా అంటే చేయలేము. చేయలేకపోయినా, అవి ప్రభుత్వ దృష్టిలో ఉంటే ఇప్పుడు కాకపోయినా, ఇంకొకసారైనా చేస్తాము. గడచిన సంవత్సరం మనం కొన్ని స్కీములు చేశాము. ఈ సంవత్సరం కొన్ని పూర్తి అవుతున్నాయి. వచ్చే సంవత్సరం ఇంకా కొన్ని తీసుకుంటాము. ఆరకముగా చేస్తూ పోతూఉంటే, ఎప్పుడో ఒకప్పుడు అన్నీ పూర్తి అవుతాయి. కనుక అవి ప్రభుత్వ దృష్టిలో ఉండాలి. ఆరకంగా ఆయాపనులను ప్రభుత్వ దృష్టికి తీసుకొనివచ్చి వారి కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వహించినందుకు శాసనసభ్యులను అభినందిస్తున్నాను. వారు చెప్పిన విషయాలన్నీ దృష్టిలో ఉంచుకొని, పరిశీలనచేసి, వాటి record అయినా తయారుచేయించిపెడతాము. అందులో అనుమానంలేదు. పద్మనాభరాజుగారు మొదటలో మాట్లాడుతూ, విశాఖపట్టణం జిల్లాను దృష్టిలో ఉంచుకోకుండా దాన్ని మరచిపోయాగని చెప్పారు. తరువాత investigation చేయని ప్రాజెక్టులు కూడ ఎందుకు ఢిల్లీ ప్రభుత్వానికి పంపించాలని అన్నారు. అయిదుకోట్లు వాళ్ళు ఇస్తామంటె, 9 కోట్లకు ప్రాజెక్టులు ఎందుకు పంపించారు. ఇందులో ఏదో కిటుకు ఉన్నదన్నారు. ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన వెంటనే వారికి ప్రాజెక్టుల జాబితా పంపించవలసివచ్చింది. వాళ్ళు ఇన్నికోట్లు రూపాయలు ఇస్తామని మాకు చెప్పలేదు. మేము పదికోట్లు కావలెనని అడుగుతున్నాము. మనము పదికోట్లు కావలెనని అడుగుతున్నప్పుడు, 5 కోట్లకే ప్రాజెక్టులు చూపిస్తే 10 కోట్లు ఏవిధంగా ఆశించగలము? అసలు 5 కోట్లైనా ఇస్తారో లేదో అని అనుమానంగా ఉండినందువల్లనే 10 కోట్లకు స్కీములు చూపించాము. ఆవిధంగా 10 కోట్లకు స్కీములు పంపించి వొత్తిడిచేసినందువల్లనే ఇంతమట్టుకైనా వచ్చింది. మీరు చెప్పినట్లు 5 కోట్లకే స్కీములు పంపించిఉంటే మనకు రెండుకోట్లుమాత్రమే వచ్చిఉండేదేమో! మనం పంపించినవాటిలో కొన్ని తీసివేసి, కొన్ని బాగా లేవని, కొన్నిటికి investigation సరిగా లేదని ఈరకంగా చెప్పి రెండు కోట్లు మాత్రమే పంపించేవాళ్లు. కనుక మనరాష్ట్రములో ఉన్న ప్రాజెక్టులలో ఏదో ఒకదాన్ని ఒక shape లోకి తీసుకువచ్చి వెనుకబడిన జిల్లాలలో పని ప్రారంభించాలనే దృష్టితో మేము 9 కోట్లు అడిగాము. అందులో ఏది తీసివేస్తారో మాకు తెలియదు. మేము అడిగేటప్పుడు ఈ ప్రాజెక్టులలో ఏదీ అప్పుడు పూర్తి investigation కాలేదు. కొన్ని అయినాయి, కొన్ని under investigation అని అన్నారు. చీఫ్ ఇంజనీరు కొన్నింటికి percentage వేసి పెడుతున్నారని చెప్పారు. ఈరకంగా ఏదో సర్ది పంపించినా, వాళ్ళు కూడ అవి చూచి కొన్ని తీసివేశారు. ఆ తీసివేయడంలో దురదృష్టవశాత్తు ఒక్క విశాఖపట్నం జిల్లావే పోయాయి. పోనీ విశాఖపట్నం ప్రతినిధి లేకపోతే సరేలే అనుకోవచ్చును. కాని అప్పుడు విశ్వనాథంగారు ఢిల్లీకి

పోయారు. కనుక ఈ ప్రాజెక్టుల విషయంలో విశ్వనాథంగారు అక్కడికి వచ్చి ప్రయత్నించినా విశాఖపట్టణము జిల్లాకు రాలేరు అంటే, ఒక Irrigation Minister మాత్రమే ఇందుకు బాధ్యత వహించాలి అనడం న్యాయంకాదు. ఈతూరి విశాఖపట్టణం జిల్లాలో ఉన్న ప్రాజెక్టులకు special investigation divisions వేశాము. ఏలేరే కాదు, ఇంకా తాండవ, వరాహానదులకంతా కూడా divisions వేస్తున్నాము. ఈ జమీందారీ ఏరియాలలో చిన్న చిన్న చెరువులు మొదలగువాటికి మరమ్మతులు లేక పాడైపోయినవి అని చెప్పారు. ఇవన్నీ చేయుటకే special sub-divisions వేశాము. పోయినవారము cabinet meeting లో శ్రీకాకుళము జిల్లాకు రెండు Sub-Divisions, విశాఖపట్టణం జిల్లాకు రెండు Sub-divisions, అదేవిధంగా West Godavari జిల్లాలో కూడ కొన్నికొన్ని చెరువులు ఇలాంటివి ఉన్నాయి కొబట్టి అక్కడకూడ ఒక Sub-Division sanction చేశాం. ఆ ఉద్యోగస్థులు వెంటనే వచ్చి అక్కడ charge పుచ్చుకొంటారు. ఆ జమీంగారీ ఏరియాలో ఉన్న చిన్నచిన్న చెరువులపై ప్రత్యేకమైన attention ఇవ్వాలనే ఉద్దేశ్యంతోనే ఈ రెండు జిల్లాలకు ఒక్కొక్కదానికి రెండు Sub-Divisions sanction చేయబడ్డాయి.

ఇప్పటికప్పుడే రాయలసీమలో ఒక డివిజను పనిచేస్తున్నది. అందువల్లనే ఇక్కడ ప్రత్యేకంగా యింకొకటి శాంక్షను చేయవలసింది చేయలేదు. ఇక మేము investigation కోసం మాత్రమే కొత్తవిగా డివిజన్ను, బెజవాడ ప్రాంతంలో పనిచేయుటానికి, రెండు శాంక్షను చేశాము. అంటే ఇవి investigation చేయుటానికనే. కాని అవి అన్నీ తీసుకొంటామన్న వుద్దేశ్యము లేదు. ఇంజనీరు అక్కడికి investigation కు పోయేటప్పటికల్లా ప్రాజెక్టు వస్తుందని అంటున్నారే, ఇంజనీరు వచ్చారు, చూచారు, వెళ్ళిపొయ్యారే గాని, ఇంకా ఏమి చేయలేదే, అని కొందరు ఉపన్యాసాలు చేశారు. Investigation చేసినవన్నీ, ఇప్పుడు సభ్యులు ఇచ్చిన సలహాలన్నీ, ప్రభుత్వము పాటించి తీసుకొనగలిగితే, ఇండియా బడ్జటు సొమ్ము అంతా, నాలుగు సంవత్సరాలుపాటు మనకు అప్పగించినా, అప్పటికైనా ఇవన్నీ చేయుటానికి వీలు అవుతుందో, కాదో, నేను చెప్పలేను. కాని ఇవన్నీ investigate చేయించి పెట్టినట్లయితే, మనమే కాదు, ఇంకా ఎవరో వాటిని అమలులోకి తీసుకుంటారు. మనకు కొన్ని ప్రాజెక్టు స్కీములు investigate చేసినవి లేకపోవడమువల్లనే మనకు ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన వెంటనే మనకు వున్నవే ఢిల్లీ ప్రభుత్వానికి పంపించాము. కాబట్టే పద్మనాభరాజుగారు ఈనాడు అనగల్గుచున్నారు.

మీరు యీస్కీములన్నీ investigation చేయించకుండా ఢిల్లీకి పంపినారే, యిందులో ఏదోకిటుకువున్నదనీ వారుఅన్నారు. స్కీమ్సు రెడిగావుంటే, ఇప్పుడు మనము కాకపోయినా వచ్చేసంవత్సరమో ఇంకా ఆ పైసంవత్సరమో ఎవరైనా పంపుతారు. కాని మనము పంపినవన్నీ ఢిల్లీవారు ఆమోదిస్తారన్న వుద్దేశముతో కాదు ఈ investigation జరుగుతున్నది. ఇక మూర్తిరాజుగారు చెప్పిన నీటి పంపకము విషయములో నేను సరీగా అర్థము చేసుకోలేదని అన్నారు. ఆ విష

యము నేను పూర్తిగా వారితో అంగీకరిస్తున్నాను. అక్కడవున్న complications అర్థము కాకపోతే పోవచ్చును గాని నీటి పంపకము మాత్రము నాకు అర్థమవుతుంది. నీటి పంపకము విషయములో నాకు బాగా తెలుసు. ఎందుకంటే పెన్నారు రివర్ నీటి పంపకము ఇంకా అక్కడక్కడ యీ నీటి పంపకము విషయము బాగానే చూచివచ్చాను. సంవత్సరానికి ఎక్కడెక్కడ ఎన్నెన్ని ఎకరాలు సాగుచేస్తారో, ఎవరువచ్చి ఏమినిస్తరు నెత్తిన కూర్చుని ఎట్లా exrta orders తీసుకొని పోతున్నారో, ఇటువంటివి మాత్రము నాకు అర్థము కాలేదు. ఎప్పుడైనా సరే యీ ఇరిగేషను ఒక పద్ధతిలో వుండవలసిన అవసరం లేదా ? ఎవరో రావడము నేను M.L.A. ను నాకు మూడు వేల ఎకరాలు ఇస్తావా అని అడుగుతారు. ఇంకొక ఆయనవచ్చి నేను M. L. A. బావమరిదిని నాకు రెండు వేలు ఎకరాలు ఇస్తావా అని అడుగుతారు. ఈ పద్ధతిలో ఈ delta area లో రెండవ పంట ఇరిగేషను జరుగుచున్నది. ఇదంతా చూచి దీనికి ఒక పద్ధతిని ఏర్పాటు చేయాలని చూస్తున్నాను. అయితే ఈ విధంగా వచ్చిన వారందరికి ఆర్డరు ఇవ్వడానికి నేను yield కాలేదనుకోండి. M. L. A. లకు yield కాలేదు, M. L. A. ల brother-in-law కు yield కాలేదు కాబట్టే నేను యీ ప్రభుత్వములో యిక్కడ కూర్చొని గలుగుతున్నాను. ఇంతవరకు ఒక్కరికి గూడా extra water యివ్వమని ఒక్క ఆర్డరు కూడా యివ్వలేదు. వచ్చిన పిటిషను లన్నీ గూడా "Forwarded to Chief Engineer" అని వ్రాసి పంపివేశాను. తరువాత ఆయన చట్ట సమ్మతంగా ఏవిధంగానైనా చేసుకోనివ్వమని, అన్నికూడా ఆయనకు పంపి వేశాను. కాని యీ విషయములో ఏదైనా ఒక పద్ధతి చేయవలసి ఉంది. మూర్తిరాజుగారు చెప్పినట్లు, అక్కడ యిబ్బంది వున్నమాట నిజమే. అక్కడ రైతులు ప్రతిసారీ యిబ్బందులు పడుతూనేవున్నారు. పాపము అందువల్ల యీవిషయములో ఒక regular method ఏర్పాటుచేస్తే, అంటేEast Godavariలో యిన్ని వేల ఎకరాలు West Godavari లో యిన్ని వేల ఎకరాలు అని నిర్ణయించి ఏ పరిస్థితులలోనూ, యింతకన్న ఎక్కువగా యివ్వము అని ఏవైనా రూల్సు ఏర్పాటుచేస్తే బాగుంటుందేమోనని అనుకుంటున్నాను. అయినా యిదినాకు బాగా అర్థముకావడములేదు. కాబట్టి, చీఫ్‌యింజనీరు గారితో యీ విషయము బాగా పరిశీలన చేయమని చెబుదామని అనుకుంటున్నాను. ఇందులో మీ అందరి సహాయము కూడా కావలసి వుంటుంది. ఇందులో మీ అందరుకూడా మీకుతోచిన సలహాలుయిస్తే, ప్రభుత్వానికి యీ విషయములో చాలామట్టుకు బాధ తప్పిపోతుంది. అందరూకూడా ఆలోచించి ఒకరకంగా ఏర్పాటుచేస్తే రైతులు అక్కడినుంచి యింతదూరము రావటానికి అవసరములేకుండా పోతుంది. వాళ్ళకు బాధ తప్పుతుంది. మాకూ తప్పుతుంది. ఆ విధంగాచేస్తే చాలాబాగుంటుంది కాబట్టి, యీ విషయంలో త్వరలో చర్య తీసుకుంటాను.

నందివాడ ఆనకట్టను గురించి అప్పారావుగారు చెప్పారు. నారాయణపురం ఆనకట్ట 50 లక్షలు ఖర్చుపెట్టి కట్టాగడా, బాగానేవున్నది, కాని నందివాడ

(Sri N. Sanjeeva Reddi) [21st July 1955

కట్ట కట్టనందుకు విచారిస్తున్నానని అన్నారు. ఒకే నదిపైన కొన్ని మైళ్ళ దూరములో ఒకటి కట్టాము. కాని దీన్ని కట్టటమువల్ల నందివాడకు అడ్డము రావడము లేదు. ఈ రెండు ప్రాజెక్టులు select చేస్తున్నప్పుడు, Chief Engineer కూడా చీపురుపల్లితాలూకా, శ్రీకాకుళం తాలూకా యీ రెండు తాలూకాలకు గూడ నీరు పారుదల అవుతుందని చెప్పినప్పుడు నేను సంతోషించాను. శ్రీకాకుళం జిల్లాలోకి, చీపురుపల్లి తాలూకాచాలా bad taluk. శ్రీకాకుళం జిల్లాలో అన్ని తాలూకాలు చూచాను. నూర్లకొలది గ్రామాలు చూచాను. ఇటు చీపురుపల్లి అటు యిచ్ఛాపురం యీ రెండు తాలూకాలు వెనుకబడిన జిల్లాలలో చాలా వెనుకబడిన తాలుకాలు. ఇవి చాలా వెనుకబడిన తాలూకాలు. బాగా వెనుకబడిన ఆ జిల్లాలలోకి ముందుబడిన తాలూకా ఒక్క పాలకొండ తాలూకా మాత్రమే.

An hon. Member:—అయితే చీపురుపల్లి తాలూకాను గురించి చెప్పడం లేదన్నమాట.

The Hon. Sri N. SANJEEVA REDDI:— కానివ్వండి. రెండు తాలూకాలుగూడా కానివ్వండి. పాలకొండతాలూకా మాత్రం మంచి సారవంతమైన తాలూకా. మంచి irrigation వున్నచోటు. చాలామట్టుకు డెల్టా భూములతో సరిపోల్చ తగ్గది. అక్కడ నాగావళికి left channel పూర్వము త్రవ్వి వున్నారు. మరల దానికి ఇంకా 16, 20 లక్షలవరకు ఖర్చుపెట్టి right channel త్రవ్వటానికి ఏర్పాటు చేయబడినది, త్రవ్వుతున్నారు. ఈ channel యింకా కొంచెము శ్రీకాకుళం తాలూకాలోకి పోతుందని అనుకున్నాము. అందువల్ల నందివాడకు దీనివల్ల అభ్యంతరము వస్తుందని అనుకో నక్కరలేదు. నందివాడ ముందు చెయ్యండి అని పిటిషనుగూడా అక్కడి రైతులు పెట్టారు. నందివాడ కట్ట నారంభించకుండా నారాయణపురందే ముందు take up చేశారు అని సంజీవరెడ్డిపేరుపెట్టి నామీద పిటీషను పెట్టారు. అలాంటి పిటీషను రావడమువల్లనే అది ఒక సంవత్సరము వరకు వెనుకబడి పోయింది. మేము రాజీనామాలు ఇచ్చిన తరువాతనే ఆ విధంగా పిటిషనులు వచ్చాయి. దానివల్ల ప్రాజెక్టు కట్టకుండా నిలిపివేశారు. నేను తిరిగి ప్రభుత్వములోకి వచ్చిన తరువాత అంటే మేనెల 30 వ తేదినాడు నేను దానికి శాంక్షను ఇచ్చాను. అప్పటికి ఒక సంవత్సరము దాటిపోయిందన్నమాట. ఒక ప్రాజెక్టు కట్టిన తరువాత ఇంకొకటి కట్టించండని అడిగితే అందులో న్యాయమువుంది, అర్థము వుంది. కాని అది కట్టుతున్నారే దాన్ని ఆపివేసి ఇది కట్టించండి అని అడిగితే అది దేశానికి యెంత ఇబ్బంది కలుగజేస్తుందో, దానివల్ల ఎంత చెడు సంభవిస్తుందో అదంతా ఆలోచించకుండా పిటిషను పెట్టారు. నిజానికి ఆ పిటీషను పెట్టించింది ఎవరోగూడా నాకు బాగా తెలుసు. ఇక్కడి వారెవరు పెట్టలేదు. ఇక్కడవారికి అటువంటి ధ్యానములేదు. ఆ సంగతి నాకు తెలుసు.

తరువాత పేట బాపయ్యగారు వారి ప్రాంతంలోని స్కీములను గురించి ఏదేదో చెప్పారు. దాన్ని నేను నోటుచేసుకున్నాను. నేను చెప్పేది యేమి

టంటే నందికొండ స్కీముపల్ల తిరుపూరు తాలూకాలో గూడా అంతా సాగు అవుతుందని అనుకుంటున్నాము. కాని దానిసంగతి ఇప్పుడేదీగూడ నేను చెప్పలేను. అది వస్తుందో రాదో గూడా తెలియదు. వస్తే, ఎంత వస్తుందో, ఎక్కడెక్కడ నీరు పారుతుందో గూడా ఇప్పుడే తెలియదు. ఇటువంటివి ఎన్నో ఇబ్బందులు వుంటాయి. ఆ జిల్లాలో వున్న చిన్న చిన్న స్కీములు ముందుగా చేయటానికి వీలువుంటే, Chief Engineer కు చెప్పి అవిగూడా చూడమని నేను చెబుతాను.

తరువాత కోదండరామ రెడ్డిగారు మాట్లాడుతూ ఆరువేల క్యూసెక్కుల నీరు ఈ K. C. కెనాల్ నుంచి తీసుకొని వుపయోగించుకొమ్మన్నారు గదా, అది ఎందుకు ఇవ్వకూడదు అని అడిగారు. అదే పాయింటు మన సుందరయ్యగారు కూడా జ్ఞాపకము చేశారు. అది ఎందుకు చేయరు, అందులో మీ సంకోచమేమిటి అని గూడా అడిగారు. దానివిషయము చెప్పటానికి నాకేమి సంకోచములేదు. చెబుతాను వినండి.

తుంగభద్ర నీరును యీ ప్రాంతాలలో పారించటానికి వీలు అవుతుంది కాని కృష్ణానది నీటిని మనము ఎగువప్రాంతాలకు తీసుకొని రాలేము. తుంగభద్రనీరునే యీ ప్రాంతములో ఎక్కడికైనా తీసుకొనిరావడానికి వీలుంటుంది. అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలలో కొన్ని ప్రాంతాలలో ఎక్కడనుంచి గూడా మనము నీరు పారుదల చేయలేము. కృష్ణనీరేకాదు. ఏ నీరును కూడా ఆ మెట్టప్రాంతాలకు తీసుకొని రావటానికి వీలుండదు. అందుకనే మనము ఎగువకాలువ కావాలని అడుగుతున్నాము. ఎగువ కాలువ త్రవ్వినాగూడా, నీళ్ళులేని కారణమువల్ల, నాలుగువేల క్యూసెక్కులుకన్నా ఎక్కువ యివ్వటానికి వీలులేదని అంటున్నాను. మైసూరువారు అదిగూడ లేదని అంటున్నారు. పైగా వారు చెప్పేది యేమిటంటే, మీరు యీ కెనాల్ ఎందుకు త్రవ్వుతున్నారు, మేము ఒప్పుకోనిదే మీరు దాన్ని త్రవ్వితే ప్రయోజనము యేమిటి అని అంటున్నారు. కాని మన యింజనీర్లు చెప్పేది యేమిటంటే, తుంగభద్ర ఎగువకాలువలో బహుశా నాలుగు అయిదువేల క్యూసెక్కులు, అంటే, నాలుగు అయిదు లక్షల ఎకరాలకు మాత్రమే నీరు వుంటుందేమోనని మన యింజనీర్లు అంటున్నారు.

పోతే యీమధ్య హైదరాబాదువారు గూడా రాజోలిబండ అని 60 మైళ్ళ దూరములో ఒక ప్రాజక్టు కట్టుతున్నారు. అక్కడినుండి నీరును తీసుకోవడము తటస్థిస్తే, అక్కడనే ఆనకట్ట ఒకటి తయారుగానేవుంది. కాబట్టి యీనాటికి కాకపోయినా, మరి యేనాటికైనా తుంగభద్ర నీటిని అక్కడినుంచిగూడా ఒక 60 వేల యకరాలకు తీసుకొనిరానటానికి వీలుఅవుతుంది. తుంగభద్ర నీటిని K. C. కెనాల్ద్వారా మూడు లక్షల యకరాలకు ఇప్పుడు నీరు తీసుకుంటున్నాము. ఇవన్నీ కాకుండాఇంకొక మూడులక్షల యకరాలకు నీరు తీసుకొని, నందికొండనుంచి నీరును పారించటానికి అనుకూలమైన కావలి కనుపూరు కాలువలకు యిప్పుడు యివ్వడం, అది మంచిది

కాదేమోనని అనుకుంటున్నాను. గవర్నరుగారి స్కీములోనే యీ మూడు వేల క్యూసెక్కులు continue చేయాలని అనుకున్నాను. నేను దాన్ని సమర్థిస్తున్నాను. మూడు వేల క్యూసెక్కులనీరు మూడులక్షల యకరాలకుమాత్రమే, కె. సి. కెనాల్ కు లైనింగు వేసినాగూడా, యిప్పుడు కె. సి. కెనాల్ ద్వారా నీరును తీసుకొని పోగలుగుతాము. అంతకన్నా ఏక్కువ తీసుకొని పోవటానికి వీలులేదు. తీసుకొనిపోవడముకూడా న్యాయముకాదు అని నేను గట్టిగా నమ్ముతున్నాను. ఆ విషయము చెప్పటానికి ఏవిధమైన సంకోచములేదు. పైగా యీ K. C. Canal కు నీరు సిద్ధేశ్వరం ద్వారా యీ ప్రాంతానికి యివ్వగలిగితే యీ మూడువేల క్యూసెక్కులు మనము high level channel ద్వారా ఉపయోగించుకొని, మన సుబ్బారాయుడుగారు చెప్పినట్లు, తరువాత క్రింద వుండే ధర్మవరం, యింకా మిగిలిన తాలూకాలలో, ఆయా ప్రాంతాలకు నీరు ఇవ్వటానికి వీలువుంటుంది. ఇప్పుడు Mckenji plan ప్రకారము గండికోటకు నీరు K. C. Canal ద్వారా యిస్తున్నాము. ఇది Mckenji plan లో వున్నది. Mckenji ప్లాను ప్రకారము తుంగభద్ర నీటిని పెన్నలో వదిలి, గండికోటదగ్గర ఆనకట్టకట్టి, దానిద్వారా పులివిందల, జమ్మలమడుగు తాలూకాలకు నీరు సప్లయిచేయాలని నేను ఒక స్కీమును అనుకున్నాను. సిద్ధేశ్వరము వస్తే, గండికోటకు కృష్ణానది నీటిని సప్లయిచేసి, దాన్ని గండికోటకు తెచ్చి, అక్కడ యివ్వాలన్న వెయ్యి క్యూసెక్కులే అనంతపురం జిల్లాలోని ధర్మవరం తాలూకాకో, కదిరి తాలూకాకో, మరి యింకొక తాలూకాకో వుపయోగించుకోటానికి వీలు అవుతుంది. సుందరయ్యగారు చెప్పినట్లు, K. C. కెనాల్ లో నీరు అంత వుంటుందా లేదా అనే సమస్య తప్ప, భూమి కావాలంటే చాలా వున్నది. 15 లక్షల ఎకరాల భూమి వున్నది. కాని నీరుమాత్రం, అక్కడ వుండేది, అయిదులక్షల యకరాలకే సరిపోతుంది. అందుచేత రాజులబండ దగ్గరనుంచి వచ్చే నీటిని, గండికోటకు యింకా ఎక్కడనుంచో వచ్చే నీటిని, యీ K. C. కెనాల్ ద్వారా, సిద్ధేశ్వరముద్వారా, కృష్ణానది నీటిని యీమధ్యలో ఉపయోగించకుండా ఆ ప్రాంతాలకు పోయేటట్లు పైకి తరిమివేస్తే, అక్కడ రైతులు పైన వుపయోగించుకోటానికి వీలువుంటుంది. తరువాత కావలి-కనుపూరు కాలువకు, ఎందుకొరకైతే K. C. కెనాల్ ద్వారా నీరు సరఫరా చేయమని అన్నారో తెలియదు. యిప్పుడువున్న ప్లానునుబట్టి దానికి నందికొండద్వారా నీరు సరఫరాచేయటానికి అవకాశాలున్నవని తెలుస్తున్నది. ఈరకంగా ఒక full and integrated scheme కావాలని సుందరయ్యగారు అన్నారు. Full scheme లేకపోలేదు, వున్నది. అది యిప్పుడు తయారుచేసింది కాదు. మనకు ఆంధ్ర రాష్ట్రము వచ్చిన వెంటనే రెండు నెలల లోపలనే మన Chief Engineer వెంకటకృష్ణయ్యరుగారు, ఒక comprehensive scheme ను తయారు చేశారు కాని ఎప్పుడెప్పుడు ఏది begin చేస్తామో చెప్పలేము. కాని అందులో మొదటి stage లో ఏది, రెండవ స్టేజిలో ఏది, మూడవ స్టేజిలో ఏది అని stages ప్రకారము తయారుచేశారు. అది తయారుగానే వున్నది. దాన్ని మనము ఆంధ్రదేశములో full గా ఉపయోగించుకో గలుగుతాము. కాబట్టి అటువంటి స్కీము మనకు వున్నది, లేకపోలేదు. దాన్ని ఎప్పుడు begin

చేస్తారో చెప్పమంటే అది అంతా ఇప్పుడు చెప్పటానికి వీలులేదు. దానికి డబ్బు వ్యవహారము ఎంతో వున్నది. We are not masters of the finances. [ Interruption ] – దాన్ని ఢిల్లీ ప్రభుత్వానికి పంపించాము. దాన్ని ప్రకటించమని మీరు అంటే ప్రకటించటానికి అభ్యంతరము యేమి లేదు. అందులో వున్నది రహస్యము ఏమీ కాదు. మొదటి stage లో తుంగభద్ర ఎగువ కాలువ, వంశధార, రెండవ stage లో సిద్ధేశ్వరం ఇంకా దానికి సంబంధించిన యితర స్కీములు అమలు చేయాలి అని అనుకున్నాము. మూడవ stage లో పులిచింతల ఇంకా మిగిలిన ప్రాజెక్టులు అని అనుకున్నాము. తరువాత గోదావరి నీటిని కృష్ణానదిలోకి divert చేయాలని అనుకుంటున్నాము. అప్పుడు కృష్ణానది క్రింద ఇప్పుడు irrigate అవుతున్న భూమిలో 12, 14 లక్షల యకరాల భూమిని గోదావరి నీటితో irrigate చేస్తే, కృష్ణానది నీటిని సిద్ధేశ్వరం వద్ద యింకా ఎక్కువగా వాడుకోటానికి గూడా వీలువుంటుందని అనుకున్నాము.

ఏవి వున్నప్పటికినీ, ఇప్పుడు నేను వాటి వివరాలలోకి పోదలచుకోలేదు. కాని comprehensive గానే ఒక plan మాత్రము వున్నది. అది అంతా ఒక picture గానే వున్నది. అంటే యీ ప్రాజెక్టులన్నీ వచ్చిన తరువాత ఆంధ్రదేశము ఇరవై ఏండ్ల తరువాత ఎట్లా వుండేది, యీ నీటిని అంతా ఎట్లా వాడుకో గలుగుతాము అనేది ఒక picture లో మనకు కనబడుతుంది. 20 ఏండ్లు అయిన తరువాత యేయే జిల్లాలో ఎన్ని లక్షల ఎకరాలు మనము సాగు చేసుకో గలుగుతామో గూడా మనము ఒక picture లో చూడ గలుగుతాము. కనుక దీని కంతటికి ఒక స్కీము picture రూపములో వున్నది. లేకపోలేదు.

Sri VAVILALA GOPALAKRISHNAYYA : — "That a scheme for remodelling K. C. Canal for a discharge of 6,000 cusecs of water is practically available" అని Kunwarsen గారు రిపోర్టులో వ్రాశారు.

The Hon. Sri N. SANJEEVA REDDI:—ఈ నాడు తుంగభద్ర ఎగువ కాలవ లేదుగదా! గండికోట తయారుగా లేదుగదా! అందువల్ల ఇక్కడ సాగు చేసుకొనే భూమిలేదుగదా! తుంగభద్ర దిగువ కాలవ క్రింద సాగు అయ్యే భూమిలేదుగదా! ఆ ప్రాంతము నేను చూచి వచ్చాను. కాని దానికి అక్కడ దుష్ప్రచారము ఏ విధంగా జరుగుచున్నదంటే, డాము కట్టారుగాని వీరికి ఆనకట్టలు ఎందుకని ఇప్పుడు అక్కడ ఆనకట్ట అనవసరమని దుష్ప్రచారము సాగించారు. ఇటువంటి దుష్ప్రచారము ఎందుకు చేయాలో అర్థము కావడము లేదు. నేను గూడా ఆ ప్రాంతాలకు రెండుమూడుసార్లు వెళ్ళి చూచివచ్చాను.

(Sri N. Sanjeeva Reddi) [21st July 1955

గడచిన సంవత్సరమే మొట్టమొదటగా కాలువకు నీళ్ళు వదిలారు. పరీక్ష నిమిత్తం, ఈ కాలువలు ఏమి అవుతాయో చూద్దాము అనే వుద్దేశ్యంతో సెప్టెంబరులో నీరు వదిలారు; పంటలకు కాదు. పంటలకు సెప్టెంబరు, అక్టోబరులలో నీరు పెట్టుకోడవము అసంభవము. నీరువదలగానే కాలువలు బ్రీచి అయిపోయాయి. First time ఏ కాలువలకు అయినా సరే నీరు వదిలితే బ్రీచి అయిపోతాయి. కొంత లూజ్ గా వున్న సాయిలుకూడా వుంటుంది. అందువల్ల ట్రయల్ గా వదిలారు. ఏదైనా 1, 2 సంవత్సరములకు గాని రిపేర్సు చేసుకొని తరువాతనే గట్టిపరచుకోగలము. జూన్ నెలలో నాట్లు వేశారు. సెప్టెంబరులో నీళ్ళు వదిలారు. అప్పుడు నీరు అవసరము లేదు. కాబట్టి వారు వాడుకోలేదు. కొత్తగా మేము ప్రోత్సాహము చేసి వాడించాము. ప్రోత్సాహముకొరకు free of tax అని చెప్పాము. ఎట్లా సాగుచేస్తున్నారో చూడ్డానికి నేను ఒక పర్యాయము వెళ్ళివచ్చాను. ఎక్కువగా లక్షల ఎకరాలు సాగుచేయడము లేదు గాని, 30, 40 వేల ఎకరాలు సాగు చేస్తున్నారు. వారి ఉత్సాహాన్ని చూస్తే ఆనందము అయింది. Wet land cultivation అంటే వాళ్ళకు అసలు తెలియదు. ఆ పద్ధతిని వారు ఎప్పుడూ కూడా చూడలేదు. నీళ్ళుపెట్టి ఏమి చేయాలోగూడా తెలియదు. సిరిగుప్ప, హగరీ ప్రాంతానికి పోయి ఆ పల్లపుసాగు తెలిసిన వారిని తమకు నేర్పుట కొరకు తెచ్చుకున్నారు గవర్నమెంటు దగ్గర అప్పులు తీసుకొన్నారు. ఆ రైతులు పడుతున్న శ్రమ చూస్తే ఆనందము అయింది. ఇలాంటి పట్టుదల, దీక్ష, వుంటే వెంటనే పండకపోయినా కొంతకాలమునకు బాగా పంటలు పండుతాయి. Wet land cultivation కు గాను వారు చేలలో వేసుకొన్న గట్లు తెగిపోతున్నాయి. మొరక పల్లాలు వుంటున్నాయి. ఆ ఇబ్బందులన్నీ ఒక పర్యాయము చూస్తే గాని తెలియదు. ఢిల్లీ పార్లమెంటులో కూర్చొని మేము నీళ్ళు ఇస్తున్నాము. వాళ్ళు తీసుకోలేదు, అంటూ వుపన్యాసాలు చేసే పెద్దలకు ఈ కష్టాలు ఏమీ తెలియవు. వారు ఒక పర్యాయము ఇక్కడకు వచ్చి చూస్తేగాని కాలువలు ఎట్లా తెగిపోతున్నవో రైతులు ఎంత కష్టపడుతున్నారో తెలియదు.

ప్రాజెక్టు కాలువ ఇంకా పూర్తికాలేదు. 190 మైళ్ళ వరకు మాత్రమే ఈ కాలువ పూర్తి అయింది. ఇంకా దాదాపు 40 మైళ్ళు త్రవ్వవలసి వున్నది. కర్నూలు జిల్లా ప్రాంతానికి వచ్చేప్పటికి 'ఇంకా కాలువలు త్రవ్వలేదు, సాగు చేయలేదు' అంటారు. తుంగభద్రా ప్రాజెక్టువిషయంలో fundamental గా ఒక పొరపాటు జరిగింది. డాము కట్టుట ప్రారంభమైన నాటినుంచే ఎక్కడెక్కడకు నీళ్ళు పోతాయో, అక్కడక్కడ కాలువలు అప్పటినుంచి త్రవ్వటము ప్రారంభిస్తే డాము తయారు అయ్యేనాటికి కాలువలకు నీరు వెంటనే వదలడానికి వీలుగాయుండేది. దప్పిక అయినప్పుడు బావి త్రవ్వినట్లు, వూరు ముందరకు వచ్చి పరుగెత్తినట్లు ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన తరువాత కోట్ల రూపాయలు ఖర్చుపెట్టితే ఎంతమంది సిబ్బందితో పనిచేయించినా వెంటనే పనిచేయలేక పోతున్నాము. ఎంతోమంది కలెక్టర్లు వున్నారు. ఇంజనీర్లు వున్నారు. రివెన్యూ బోర్డుతో సహా ఇరిగేషను కమిటీ అని పెట్టాము. వారందరూ కూర్చుంటున్నారు. నేనుకూడా ఆ ప్రాంతానికి అప్పుడప్పుడూ వెళ్ళుతున్నా అక్కడ పనిచేయుచున్న సిబ్బందికి

ప్రోత్సాహ మిస్తున్నాను. చేయవలసిన పనంతా ఈనాడు ఒక్కతూరే చేయడం సాధ్యముకాని సంగతి. ఎన్ని కోట్లు ఖర్చుపెట్టినా, కొంత కాలము పడుతుంది. ఇబ్బందులు అన్నీ సర్దుకొన్నప్పుడు K. C. కెనాలుకు 3 వేల క్యూసెక్కుల నీరు పంపవచ్చును. ఇప్పుడు K. C. కెనాలులో నీళ్ళు అసలు లేవనుకొంటాను. సిద్ధేశ్వరము నిర్మించుకొని ఎప్పటికైనా మనము K. C. కెనాలులోకి నీరు తెచ్చుకోవలయునేకాని హయ్యరు రీచ్‌లో వున్న నీళ్ళను క్రిందకు తేవడము ఎందుకు? క్రిందివాళ్ళకు ఇవ్వడముఎందుకు? క్రింది రీచస్‌లోవున్న నీటిని మనము ఎప్పుడు పైకి తీసుకుపోలేము. హయ్యరు రీచస్‌లో వున్న నీటిని క్రిందకు తెచ్చి, క్రింద తక్కువ లెవెల్‌లో వున్న భూమికి సరఫరా చేసుకోవచ్చును. కన్వార్ సెన్ కమిటీ చెప్పనివ్వండి, యింకెవ్వరైనా చెప్పనివ్వండి, మనము ఈ దేశంలో పుట్టినాము కాబట్టి ఎక్కడ మిట్టప్రదేశమో, ఎక్కడ పల్లపు ప్రదేశమో మనకు తెలుసు. కన్వార్ సేన్ చెప్పింది నిజమే అవచ్చు. ఇప్పుడు తుంగభద్రఎగువకాలువకు నీళ్ళులేవని మైసూరువాళ్లుతగవుపెట్టుతున్నారు. K. C. కెనాల్‌లో 6 వేల క్యూసెక్కుల నీరు పారించుకోడానికి కావలసిన భూమి కర్నూలు జిల్లాలోనే వుందని మాకు నీరు ఇవ్వాలని మొన్న నందికొట్కూరులో మీటింగుపెట్టి మాకు చెప్పారు. సిరివేలుతాలూకాలో కూడా మీటింగు పెట్టి మాకు చెప్పారు. 6 వేలు క్యూసెక్కుల నీరు మాకు ఇవ్వండి సాగు చేసుకుంటాము అంటున్నారు. K. C. కెనాలు నీరు ఏ ప్రాంతాలలోవారు ఇంత వరకు వాడుకోలేకుండా వున్నారో, వారే ఇప్పుడు ఆ నీళ్ళు వాడుకోడానికి అలవాటుపడ్డారు. వారికిసాగుచేసుకోవాలనే ఉత్సాహము వచ్చింది. మాకు నీళ్లు ఇవ్వండి, తూర్పు కాలువ త్రవ్వండి, పడమటి కాలువ త్రవ్వండి అని conference లు పెట్టి, నేను దగ్గరలోనేవున్నానుకాబట్టి, ఒకొక్కతాలూకా వాళ్ళు నన్ను తీసుకుపోతున్నారు. ఎంతో ప్రయత్నము చేస్తున్నారు. ఈ ప్రాంతము develop కావాలంటే ఏమైనాసరే సిద్ధేశ్వరము వచ్చితీరాలని పట్టుదలతో పనిచేయాలి. అట్లా పనిచేస్తే, రెండవ పంచవర్ష ప్రణాళికలో రాకపోవచ్చును, కనీసము మూడవ పంచవర్షప్రణాళికలో నైనా sanction చేయించుకోడానికి వీలుంటుంది. తరువాత పులిచింతల వుంటుంది. పులిచింతల ఏరియా వుంటుంది. కృష్ణా జిల్లాలో సాగుచేసుకోడానికి భూమి చాలా వున్నది కాబట్టి పులిచింతల కూడా మనకు తృతీయ పంచవర్షప్రణాళికలో కావాలి.

గోదావరి ప్రాంతము విషయములో వరద నివారణకు ఒక ప్రాజెక్టు వుండి తీరాలి. అది ఇపూర్వరు అయినాసరే, లేక సుందరయ్యగారు చెప్పిన ఇచ్చంపల్లి అయినాసరే. మేము పూర్వము శబరి ప్రాజెక్టు అయితే బాగుంటుందేమో అనుకొనే వాళ్ళము. మన చీఫ్ ఇంజనీరుగారు ఇపూర్వరు దగ్గర డాము కట్టినట్లయితే చాలా తక్కువఅవుతుందన్నారు. 100 కోట్లు, 150 కోట్లు లేకుండా 80 కోట్లుతో ఆ ప్రాంతములో డాము కట్టడానికి వీలవుతుందని వారు దానికిఇన్‌వెస్టిగేటుచేస్తున్నారు. 2, 3 ప్రాంతాలలో ఇన్‌వెస్టిగేటు చేసిపెట్టుకుంటే కేంద్రప్రభుత్వఇంజనీర్లు దేనిని అమలుచేయాలి అంటే దానిని మాత్రమే తీసుకోడానికి వీలవుతుంది. నేను

రామాచారిగారికి, చల్లా సుబ్బారాయుడుగారికి చెప్పేది ఏమిటంటే, ధర్మవరము తాలూకాకు నీళ్ళు ఇవ్వకూడదని నేను అనలేదు. అది 1946 సంవత్సరములో నా నియోజకవర్గము. అనంతపురం జిల్లా చాలా poor జిల్లా. అందులో ధర్మవరము poorest తాలూకా. ఒక పర్యాయము వెంకటరావుగారు ధర్మవరము తాలూకాకు ఎన్నికల పర్యటన కొరకు వెళ్ళారు. '10 మైళ్ళు పోయినా ఈ తాలూకాలో మనిషే కనుపించలేదు. అసలు మనుషులు లేరా' అని అడిగారు. ఆ తాలూకా జనసంఖ్య 70, 80 వేలు మాత్రమే విస్తీర్ణము west గోదావరి జిల్లాలో సగం వుండేట్లు వున్నది. మనుష్యులు లేకపోతే పోయారు ఇంత దూరము పోయాము కాఫీయో, బువ్వో, కాయో ఏమియు కన్పించలేదు. పశువులకు కూడా తినడానికి ఏమీ లేదా అనే స్థితిలో ధర్మవరం తాలూకా అప్పుడువుంది. అక్కడ నీరు పారితే నేను వద్దనను.

Sri C. SUBBARAYUDU :— సిద్దేశ్వరము వచ్చేముందు K. C. కెనాలుకు సప్లయిచేసే నీరు, గండికోటకు ఇచ్చేటటువంటి నీరు, కృష్ణనీటితో పారుదల కానటువంటి ప్రాంతములలో అనంతపురం జిల్లా కానీయండి, కడపజిల్లా కానీయండి కర్నూలు జిల్లా కానీయండి ఉపయోగపెట్టుతాము అని అన్నారుగదా అప్పుడు main కాలువలోనుంచి unlined canal ఏర్పాటు చేయడానికి సమ్మతించినట్లయితే రేపు ప్రొద్దున అయినా నీరు వస్తుందనే ఆశ ఆ ప్రాంతమువారికి వుంటుంది. ఆ విధంగా చేయమని మిమ్ములను కోరుతున్నాను.

The Hon. Sri N. SANJEEVA REDDI :—అది అప్పటి పరిస్థితులను అనుసరించి తప్పకుండా చేస్తాము. మనము తీసుకోడానికి కడపవాళ్ళుకూడా ఆక్షేపించరు. ఈ నాడు మనము కావాలంటే కడప, అనంతపురం, పులివెందుల, జమ్మలమడుగు ప్రాంతాలకు కావలెను అని తగాదావస్తే రావచ్చును. కృష్ణానీళ్ళు గండికోటకు ఇవ్వగలిగి, K.C. కెనాలుకు సప్లయిచేయగల ఈ 10 వేల క్యూసెక్కులు మనము అక్కడ వాడుకుంటే ఇక్కడ ఏమి వుండదు. అయితే lining చేయాలనే ప్రశ్న వస్తుంది. నీళ్ళు వుండటమే తటస్థిస్తే unlined canal పెట్టలా లేక సైడులో ఇంకా ఛానల్సు త్రవ్వుకోవాలా అనేది ఆలోచిస్తాము. ఇది 10 యేండ్ల తరువాత మాట. నేను వెంటనే చెప్పేమాట కాదు. ఈ ప్లాను కడప జిల్లావాళ్ళకు చెప్పి వారిని తృప్తిపరచి తరువాత ఇతరులను తృప్తిపరిస్తే తుంగభద్రలో వున్న నీరంతాకూడా పైన వాడుకోడానికి వాళ్ళ ఆక్షేపణ ఏమీ లేదు. ఇక్కడ నీళ్ళు పారే సమస్యనుగురించి నేను ఏమీ చెప్పను. ధర్మవరము తాలూకాకు నీరు పోవడానికి వీలవుతుందో లేదో ఛీఫ్ ఇంజనీరుగారిని చూడమని చెబుతాము. దీన్ని ఇంతటితో బ్లాక్ చేస్తానని అనుకోకూడదు. ధర్మవరము తాలూకా పైన ఈ నాడు సుబ్బారాయుడుగారికి వున్న ప్రేమ నాకు కూడా వున్నది. ఇప్పుడు కాకపోయినా అది ఒకానొక కాలంలో అయినా నా నియోజకవర్గమే.

Sri C. SUBBARAYUDU :—ఒక్క ధర్మవరము తాలూకా మాత్రమే కాదు. తాడిపత్రి తాలూకాలోకూడా చాలా భాగము ఎగిరిపోయింది. జమ్మలమడుగు

తాలూకాలో కొంతవరకు ఎగిరిపోయింది. ఆలూరు తాలూకాలో కొంతభాగం ఎగిరి పోయింది. గుత్తి తాలూకాలోకూడా ఇంతవరకు ఇన్వెస్టిగేషను క్రిందకు రాలేదు. 15 లక్షల ఎకరాలు ఎగిరిపోయింది అని నేను చెబుతున్నాను. కాని ఒక్క ధర్మవరము తాలూకా గురించే కాదు నేను చెప్పేది.

The Hon. Sri N. SANJEEVA REDDI :– అన్ని తాలూకాల విషయములో కూడా నాకు అదే అభిమానము వున్నది. 15 లక్షల ఎకరాలు వుందని ఇప్పుడు మేము వొప్పుకున్నాముగదా ? 15 లక్షల ఎకరాలు వ్యవసాయానుకూలమైన భూమి వుందని సుందరయ్యగారు చెప్పారు; నేనూ అంగీకరించాను. అందులో 5 లక్షల ఎకరాలు ప్రస్తుత ప్రణాళిక ప్రకారము సాగవడానికి వీలవుతుంది అని చెప్పాను. ఇంకా మిగిలింది 10 లక్షల ఎకరాలు, ధర్మవరములో అనండి, తాడిపత్రిలో అనండి, గుత్తిలో అనండి, ఎక్కడఅయినా గాని ఈ 10 లక్షల ఎకరాలు వుంది. మనము తుంగభద్రా నీటిని అక్కడే వాడుకోడానికి వీలవుతుంది. కడప, అనంతపురం, కర్నూలు friends అంతా కలిసి ఎక్కడ ఏమిచేస్తే బాగుంటుందో ఒక సూచన యిస్తే ఆ విధంగాచేస్తాను. అభారము అంతా కూడా వారిపైననే వేస్తున్నాను. ఒకరు ఇల్లా పారించండి, మరొకరు అల్లా పారించండి అని బాధపడేదానికన్నా అందరూకూడా దానికి జవాబుదారీ పుచ్చుకొని, ఈ మూడు జిల్లాలవాళ్ళు సమావేశముఅయి, ఈ కాలువ ఎక్కడ ఎల్లా యుండేది తెలియజేయండి. వెంటనే చేయవలసిన పనులు ఏమిటి ? తరువాత చేయవలసి పనులు ఏమిటని, ఈ మూడు జిల్లాల M. L. A. లు అందరూ కలిసి కొన్ని సలహాలు యిస్తే వాటిని నేను స్వీకరించడానికి సిద్ధంగా వున్నాను. వారిలో ఏదో కాన్ఫ్లిక్ట్ వచ్చి ఒకరు ఒకటి, ఇంకొకరు వొకటి చెప్పినప్పుడే నాకు బాధ వస్తోందే గాని వారందరు కలిసి ఒక స్కీము ఇస్తే నేను దానిని తప్పకుండా అంగీకరిస్తాను అని మాత్రమే చల్లా సుబ్బారాయుడు గారికి రామాచార్యులుగారికి చెబుతున్నాను.

శ్రీ సత్యనారాయణగారు ఏలేరు floods ను గురించి చెప్పారు, దానిని flood control scheme క్రింద చేర్చి investigation కు ఒక division వేశాము. ఏలేరు ప్రాజెక్టు కట్టిన చాలా లాభదాయకముగా ఉంటుంది. చాలా return వస్తుంది. కాబట్టి దానిని తొందరగా investigate చేసి flood control scheme క్రింద పంపించాలని అనుకొనుచున్నాను.

రుక్మిణమ్మగారు మడకసిరతాలూకాను గురించి చెప్పారు. దానిలో ఒకనదిగాని ప్రాజెక్టుగాని ఏమీలేదు. అసలు దానికిముఖ్యముగాకావలసినది విద్యుచ్ఛక్తి.అందువల్ల వారు విద్యుచ్ఛక్తి డిమాండుమీదమాట్లాడాలని, స్పీకరుకూడా ఆమెకు తప్పక అవకాశము ఇవ్వాలని కోరుతున్నాను. ఇంకా రామకృష్ణారెడ్డిగారు కొండయ్యగారు చెప్పిన సలహాలను నోటు చేసుకున్నాను. వాటిని ఇంజనీర్లకు చెప్పి ఆచెఱువులు రిపేరు చేయించాలని, అటువంటి చిన్న పనులగురించి మరచిపోవద్దని చెబుతాను. ప్రారంభించిన ప్రాజెక్టులు పూర్తిచేయమని చెప్పారు. వాటిని జ్ఞాపకము ఉంచుకొని తప్పక చేస్తాము. గ్రామాల ముంపును గురించి చెప్పారు. అది

erosion వల్ల మునిగి పోతుంటాయి. కాళహస్తి వెళ్ళినప్పుడు ఒక గ్రామం నాకు చూపించారు. అక్కడ స్వర్ణముఖినది గట్లను కోయుచున్నది. ఆ గ్రామము మునిగిపోతుందని చెప్పారు. నేను ఆ గ్రామములో వున్న ఇండ్లను చూచాను. అక్కడ కట్ట కడితే కొన్ని లక్షలు అవుతుందన్నారు. ఇండ్లప్రక్కన ఆ bank కట్టితే సగము ఖర్చు అవుతుంది. కాబట్టి ఈ పొజిషను చాలా ప్రికేరియస్‌గా వున్నది. అసలు ఈ పాకలు ఇక్కడ కట్టుకొని వుండటముకన్నా వేరేచోటున ఉండటము మంచిదని చెప్పాను.

కొండయ్యగారు కొన్ని గ్రామాల list చదివారు. ఒకనూరి పిటీషను కూడా పెట్టారు. వాటిని investigation కు పంపించాము. అది examine అయిన తరువాత, అది పెద్ద గ్రామమై ఎక్కువ నష్టము వస్తున్నప్పుడు, చిన్న మొత్తముతో పూర్తికాగలదని మేము అనుకొన్నప్పుడు దానివిషయము ఏమిచేయాలో ఆలోచిస్తాము.

తరువాత రామకృష్ణరాజుగారు నేను చెప్పిందే తిరిగి చెప్పారు. నందికొండ కట్టితే ఏమి లాభము? సోమసిల కట్టితే ఏమి లాభము? చిన్న చిన్న ప్రాజెక్టులు కట్టినప్పుడే ప్రజలకు లాభము వుంటుందని చెప్పారు. I am very glad to see so much of agreement. సుందరయ్యగారు కూడా అదే చెప్పారు. అందరూకూడా అదే చెప్పారు. నేనూ ఆ విషయాన్నే press చేస్తున్నాను. Medium schemes కు కొన్ని కోట్లు ఖర్చు అవుతున్నది. నేను సరియైన అంకెలను చెప్పలేను. Plan is still under discussion. I am not able to reveal it here. దాని విషయము ఇప్పుడే Parliament Members కూడా వెంకటరావుగారి దగ్గర discuss చేస్తున్నారు. తరువాత మిగిలినవాళ్ళము కూడా discuss చేస్తాము. 4, 5 రోజులలో దీనికి Special Cabinet meeting వున్నది. Medium schemes కు ఎంత అడుగుతున్నామో, మైనరు స్కీములకు ఎంత అడుగుతున్నామో మీకు తెలుసు. ఒక్క స్టేజిలో నందికొండకు 30, 40 కోట్లు కావాలని చెప్పాను. నందికొండ స్కీము sanction అయిన స్కీము. ఇది ఆంధ్రాప్లానుకు వెనుక ఉండాలి. పంజాబులో బక్రానంగలు ప్రాజెక్టు కట్టితే అది పంజాబు ప్లానులో లేదు. ఇది all India Scheme, దానిని చేర్చి 122 కోట్లు ఇక్కడపెట్టి, మనకు ఏమీ ఇవ్వకుంటే ఎట్లా? Medium స్కీములకు నాకు కొంత మొత్తం కావాలి, మైనరుస్కీములకు యింత మొత్తము కావాలని అడిగాను. Flood controlకు, ఇది large ఏరియా కాబట్టి, ఎక్కువ మొత్తము కావాలి. Percentage of return తక్కువ ఉండవచ్చు. కాని large number of people కు, large areas కు, ఉపయోగం కాబట్టి నేను దానిని చాలా particular గా insist చేస్తున్నాను. దానికి ఎక్కడా disagreement లేదు. I entirely agree with the views expressed by Mr. Ramakrishna Raju. మిగిలినవారు చెప్పినది నోటు చేసుకున్నాను.

21st July 1955] (Sri N. Sanjeeva Reddi)

ఇంకా రంగబాబుగారు special divisions గురించి చెప్పారు. సుందరయ్యగారు నీరు ముందు చిన్న రైతులకు రావాలని అన్నారు. వారి పొలము వెనకవుంటే ముందర ఎట్లా నీరు వస్తుంది? ఇక్కడ చిన్న రైతులు, పెద్దరైతులు అన్నది సమస్యకాదు. నీరు మామూలుగా క్రమప్రకారము వస్తుంది కాబట్టి అలాంటి instances వుంటే వాటిని ప్రత్యేకముగా deal చేయాలిగాని generalise చేయడానికి వీలులేదు. పోతే కరప్షను, కరప్షను అంటారు. ఎక్కడ కరప్షను వున్నదో నేను చూపించెదను అని ఇద్దరు ముగ్గురు చెప్పారు. అట్లా extreme step తీసుకొని అందరిని dissmiss చేస్తే ఆంధ్రరాష్ట్రములో ఒక్క officer కూడా వుండడేమో? అలా bitterness తో కాకుండా officers కు కూడా రక్షణ ఉండవలెను. కరప్షను లేదని నేను అనను. కాని ఉన్నదానిని లేదనుట, లేనిదానిని ఉన్నదనుట పొరపాటు. అంతా కరప్టు అంటే ఎవరూ కూడా honest గా work చేయరు. అంతా హరిశ్చంద్రుడిలాగా honest మనుష్యులు అంటే అదీ పొరపాటే అవుతుంది. కొంచెము ఎంకరేజిమెంటుకూడా వారికి ఉండాలి. నువ్వు honest గా పని చేస్తున్నావయ్యా అంటే, తప్పకుండా వారుకూడా బాగా పనిచేస్తారు. Mutual confindence ఒకరిపై ఒకరికి ఉండాలి. వారిని ప్రోత్సాహముచేసి ఉత్సాహము కల్పించాలి. వారుకూడా బాగా honest గా పని చేయాలి. ఆ రకంగానే దీనిని intergrade చేయాలని ప్రయత్నము చేస్తున్నాము.

Sri P. SUNDARAYYA :—తమ్మిలేరు వరకూ నీరు వస్తుందా ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—ప్రత్యేకముగా ప్రశ్న వేస్తే details తెప్పించి చెపుతాను. I will answer that question later.

Sri P. SUNDARAYYA :—ఈ సమస్య నా ఒక్కడికే కాదు. దానిమీద చాలా ఆందోళన జరుగుచున్నది. దానిని గురించి అనవసరమైన గందరగోళములు చాలా ఉన్నాయి. అసలు ప్రస్తుతపు పరిస్థితులు ఏమిటో వాస్తవముగా చెప్పినట్లయితే దానినిబట్టి ప్రజలు అర్థముచేసుకోవడానికి వీలువుంటుంది. నేను అడిగిన ప్రశ్న —

1. తమ్మిలేరువరకు నీరు పోతుందా ?
2. పులిచింతల ప్రాజెక్టుక్రింద పారే నీరు దీనిక్రింద పెట్టుచున్నారా ? ఇంకా వేరే ప్రాజెక్టు క్రింద మినహాయిస్తున్నారా ?
3. Alignment విషయంలో ఖోస్లా కమిటీకి దీనికి భేదము ఉన్నది. ఎందుకు ఉండవలసి వచ్చింది ?
4. అసలు ఇది రెండు ఫేజులలో పూర్తి చేస్తారన్నారు. అంటే మొత్తం స్కీము sanction చేసి వరుసగా continue చేస్తారా ? మొదటి ఫేజునుంచి రెండవ ఫేజుకు అనడంవల్ల తుంగభద్రకువలె పాట్లు పడవలెనా ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—
ఇది full స్కీము. అయితే ఎట్లా చేయడానికి వీలుంటుంది అని చూడాలి.

Phasing is only regarding work. Sanction మాత్రం complete scheme కు అయినందువల్లనే మనకు గిట్టుచున్నది. Otherwise it will not pay. కాబట్టి తుంగభద్రా ఎగువ కాలువ వలె కాక జాగ్రత్త వహిస్తాము. ఆ విషయంలో హామీ ఇస్తున్నాను. దానికి ఇక బాధలులేకుండా చేస్తూ full scheme sanction చేస్తూ ఒకే ఫేజ్ చేసేట్లు దీని విషయము జరుగుతుంది. అంటే ఒక ఫేజు అవుతూనే నీరు సరఫరాచేసి, 4, 5 యేండ్లలోనే నీటిని వాడాలి అనే పట్టుదలతో ఇండియా గవర్నమెంటు అయితేనేమి, స్టేటు గవర్నమెంటు అయితేనేమి ఈ ఫేజులను మొదట పూర్తి చేయాలి. కాల్వలు త్రవ్వడము వగైరా కార్యక్రమాలు అన్నీ ఇప్పట్నుంచే ప్రారంభిస్తున్నాము. Simultaneousగా పని జరిగితే అది తొందరగా పూర్తి అవుతుంది.

Sri P. SUNDARAYYA :—నా పాయింటు ఏమిటంటే, ఇది అంతా ఒకే స్కీము అయితే ఇప్పుడు సోమశిల దగ్గర త్రవ్వవలసిన కాలువలు, బారేజీలు దీనిక్రింద తీసుకొనవచ్చును. అక్కడ స్థానికంగా వున్నవారినుంచి తీసుకున్న డబ్బుతోనూ ఇతర రకంగా ఆరంభించ వచ్చును. అదేరకంగా తిరుపూరు, తమ్మిలేరు ప్రాంతములలో కూడా కొంత డబ్బు వేసుకొని కాలువలు త్రవ్వుకునే దానికి అక్కడి ప్రజలు ఆరంభించ వచ్చును.

The Hon. Sri N. SANJEEVA REDDI:—రెండవ స్టేజిలోనో, మూడవ స్టేజిలోనో వచ్చేది మీరు చెబుతున్నారు. తిరుపూరు వరకు కాలువలు వచ్చేందుకు 9 ఏండ్లు అవుతుందని మీరే చెప్పారు. అది నేను కూడా అంగీకరిస్తున్నాను. అందరూ కూడా అంగీకరించిందే. అక్కడకు వచ్చేప్పటికి ఆలస్యము అవుతుందనే నా ఉద్దేశ్యము. తమ్మిలేరు ఎప్పుడు వస్తుందో తెలియదు. ఈ విషయములో జ్యోతిష శాస్త్రిలు కూడా తెలియాలి. అయినా యింకా details ఎప్పుడు ఏ స్టేజిలో ఎక్కడ చేస్తారు అనేది, ప్రస్తుతము చెప్పటానికి వీలు లేదు.

రైళ్ళు సెంట్రల్ గవర్నమెంటువి. మేము పర్మిటు ఇచ్చినాకూడా వాళ్ళు టిక్కెట్లు వసూలు చేస్తారు. మా పర్మిషనుతో మీరు టిక్కెట్టు కొనుక్కొని పోయి అన్నీ చూడవచ్చును.

రామకృష్ణరాజుగారు ప్రతి జిల్లాకు ఎందుకు ఇవ్వకూడదు అన్నారు. I think it is wrong in principle. '120 కోట్లు ఖర్చు పెడుతున్నామంటారు. ఏమి ఇస్తారు ?' అంటారు. గడచిన సంవత్సరము ఒక శ్రీకాకుళం జిల్లాలోనే ఒక కోటి రూపాయలు ఖర్చుపెట్టాము. ఎందువల్లనంటే Backward area కాబట్టి ఖర్చు పెట్టాము; అనంతపురంలో 13 లక్షలు ఖర్చు పెట్టుట ఎందుకు? శ్రీకాకుళములో కోటి రూపాయలు ఖర్చు పెట్టినాము ఎందుకు? అంటే అక్కడ స్కీములన్నీ ready గా వున్నాయి. అంతేకాని అనంతపురం మీద విరోధమనిగాని, అభిమానము తక్కువని కాదు. అనంతపురంలో 13 లక్షలు ఖర్చు అయ్యేవి రెండు చిన్న ప్రాజెక్టులు మాత్రమే దొరికాయి.

21st July 1955]

Sri P. NARASIMHAPPA RAO:— ఖర్చుపెట్టే డబ్బు ఎస్టిమేట్ చేసి వుంటారు, కాని ఖర్చుపెట్టిన డబ్బు తక్కువని మనవి చేయుచుంటిని.

The Hon. Sri N. SANJEEVA REDDI :— ప్రాజెక్టులు అవుచున్నవని చెప్పానుగా. ఒక్క నారాయణవరంలో మాత్రం extend అవుతోంది. ఆ ప్రాజెక్టులను మీరు పోయిచూచి వుండరు. ఇంటివద్దనే వుంటారు. అందువల్ల మీకే తెలియదు. అదే అక్కడ వచ్చినచిక్కు. ఒక్క తూరి మీరు అక్కడకుపోయి వచ్చి మళ్ళీ అసెంబ్లీలో ఆ మాట చెబితే నేను నమ్ముతాను. మీరు ఎప్పుడైనా సాలూరుకు గాని, శీతానగరానికి గాని పోయివచ్చారా? పోకపోయినట్లయితే నేను వెళ్ళుతాను అప్పుడు నావెంటరండి.

Sri P. GUNNAYYA :— జంఝావతిని గురించి మంత్రిగారు ఏమీచెప్ప లేదు. అక్కడ ప్రజలు ఇప్పటికే చాలా ఆందోళన చెందుతున్నారు.

The Hon. Sri N. SANJEEVA REDDI :— దీనిని గురించి చాలా సార్లు చెప్పారు. దానిని నేను నోటు చేసుకున్నాను. తగు శ్రద్ధ తీసుకుంటాము.

శ్రీకాకుళం సభ్యులు దురభిప్రాయంలో వున్నారు. మీలో ఎవరైనా చూసి వచ్చినవారు ఆ అభిప్రాయం చెపితే అంగీకరించడానికి నేను సిద్ధంగా వున్నాను. ఒక నారాయణవరం ఆనకట్ట ఆలస్యం కావడానికి కారణంచెప్పాను. నేను వచ్చి మే 30 వ తేదీన sanction ఇచ్చాను అని చెప్పాను. మే 30 నుంచి ఇంతవరకు లక్షలు ఖర్చు అవడానికి సాధ్యమా? మిగిలిన ప్రాజెక్టులు sanction అయినాయి, ఖర్చు అవుతోంది. ఆరు నెలలలో - మార్చినాటికి - మీకు నీళ్ళు ఇస్తాను అని చెబుతున్నాను. ఖర్చు కాలేదు అంటున్నారు; ఖర్చు అయిపోయింది; మీరు వెళ్లి చూడాలి. క్రిందటి సంవత్సరం శ్రీకాకుళం జిల్లాలో కోటి రూపాయలు ఖర్చుచేస్తే, అనంతపురం జిల్లాలో 15, 16 లక్షలు మాత్రమే ఖర్చు అయినది. కారణం ఏమిటంటే, investigate అయిన స్కీములు వుండాలి; రాయిగాని, రప్పగాని ఎక్కడో పారేస్తాము అనడం మంచిది కాదు. చిత్తూరు జిల్లాలో 40, 50 లక్షలు ఖర్చు అయినది, మరొక area లో ఈసారి తీసుకుంటాము. కుళసలికి కట్టిస్తాము. ఇవన్నీ కట్టడం జరిగితే కొంత ఖర్చు అవుతుంది. ప్రతి జిల్లాకు ఒక కోటి రూపాయలు ఇవ్వాలనడం మంచి principle కాదు అనుకుంటాను. The principle is not good అని నా అభిప్రాయం, ఒక జిల్లాలో ఎక్కువ అవుతుంది, మరొక జిల్లాలో తక్కువ అవుతుంది. కడప జిల్లాలో maximum ఖర్చు అయినది; అక్కడ రెండే ప్రాజెక్టులు ఉన్నాయి. సాగిలేరు ప్రాజెక్టుకు 50 లక్షలు; పింఛానదికి 30 లక్షలు ఖర్చుఅయినది. చిత్తూరుజిల్లాలో 4 ప్రాజెక్టులు కట్టినా 40 లక్షలు ఖర్చుకాలేదు.

Sri B. SANKARAYYA :— Alignment సంగతి చెప్పలేదు.

The Hon. Sri N. SANJEEVA REDDI :— Alignment సంగతి ఇంకా చెప్పడం బాగావుండదు. అవసరమయితే మరొక brochure మాసంలో వేసి పంచిపెడతాను. కాని ఇప్పుడు చెప్పడం బాగాలేదు. Still I have to consider it. మరొకసారి I will give you a clearer picture. కాలువల alignments మారుతుంటాయి. Final గా త్రవ్వేవరకు మారు తుంటాయి. చివరివరకు మారుతూనే వుంటాయి. ఏ ప్రాజెక్టుఅయినా అంతే. Details వెంటనే తయారుచేయాలని చెబుతాను. ఎప్పుడు మాకు clearer picture వస్తుందో, ఆ information మీకు ఇస్తాను. అంతా confusedగా వున్నది. Don't press further. I will certainly give you the information when it is available. విశాఖపట్నం జిల్లాలోని ప్రాజెక్టులు గురించి investigate చేయిస్తున్నాము. చాలా శ్రద్ధ తీసుకుంటున్నాము. Special division ఒకటి ఏర్పాటు చేశాము. రెండవ పంచవర్ష ప్రణాళిక ప్రాజెక్టులలో విశాఖపట్నం జిల్లా ప్రాజెక్టులకు equal weight ఇచ్చాము. మీరందరు అభినందన పూర్వకంగా బలపరచినందుకు అందరికి నా వందనాలు అర్పిస్తున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU :—నందికొండ ప్రాజెక్టు ఎప్పుడో వస్తుందనే కారణంగా, మరమ్మతులు ప్రారంభించిన చెరువుల విషయములో కూడా కొన్నిచోట్ల మరమ్మతులు మానివేశారు. దానిని గురించి కొంచెం వివరిస్తారా ?

The Hon. Sri N. SANJEEVA REDDI :— చిన్న చెరువుల మరమ్మతుల విషయమయితే మీతో నేను agree అవుతాను. అటువంటి మరమ్మతులు ఎప్పుడో నందికొండ వస్తుందని మానవక్కరలేదు. It depends upon the cost. ఎంత ఖర్చుఅవుతోంది, ఎంత irrigate అవుతోందనేది ముఖ్యం. లక్షా, రెండు లక్షలు ఖర్చుచేసి, సాగు అయేది 30, 40 ఎకరాలయితే లాభంలేదు. Individual cases examine చేస్తారు. Useful work వుంటే తప్పకుండా తీసుకొంటాము. శ్రీకాకుళంజిల్లా ప్రాజెక్టుల గురించి వ్రాసారు. ఒక్కొక్క దానిని గురించి చెప్పేదానికన్న వీటి అన్నింటినీ investigate చేయిస్తున్నాం అనిచెపితే సరిపోతుంది. Allotment వచ్చినాక ఏరకంగా ప్రాజెక్టులు చేర్చుకోవాలో ఆలోచించి అన్నిజిల్లాలను సమానంగా చూడటానికి ప్రయత్నిస్తాము.

Sri P. NARASIMHAPPA RAO :—ముఖ్యంగా శాయనఘట్ట గురించి immediate గా మనవిచేయాలని కోరుతున్నాను.

The Hon. Sri N. SANJEEVA REDDI :— శాయనఘట్ట గురించి మీరు చెప్పారు. మిగిలిన శ్రీకాకుళం మిత్రులుకూడ చెప్పారు. డిపార్టుమెంటుకు పంపాను. నేను శ్రీకాకుళం వచ్చాను. కాని ఇది ఎక్కడవున్నదో నాకు గుర్తు లేకుండా వున్నది. డిపార్టుమెంటువారు examine చేసినాక, Executive Engineer కు instructions ఇస్తారు.

21st July 1955] (Sri N. Sanjeeva Reddi)

ఎక్కువ ఖర్చు అయితే, it will have to take its own course. Financial గా examine చేసి percentage of return అంతా చూడాలి. ఎవరు డబ్బు ఇస్తారని వెంకట్రామాజుగారు అడిగారు. ఇక్కడ డబ్బులేదు. అంతా Government of India వారు ఇవ్వాలి. డబ్బువస్తేనే ఇవన్నీ జరిగేది. పుస్తకాల్లో చేర్చలేదని కొందరు అడిగారు. పోయినసారి 5 కోట్లు వస్తే కట్టుకున్నాం. పేర్లు లేకపోతే ప్రారంభించకూడదని లేదు. పేర్లు వుంటే తొందరగా వస్తాయి అని, లేకపోతే రావు అని అనుకోవడం పొరపాటు. కేంద్ర ప్రభుత్వం వారు అప్పుగా ఇస్తారు కాని grant కాదు. మనం, మనపిల్లలు తీర్చాలి, మీరు ఇచ్చిన సలహాలను తప్పకుండా జ్ఞాపకంవుంచుకొని ఇందులో అందరూ కలిసి ఎక్కువ ఉత్సాహపూరితంగా less corrupt గా పూర్తిచేస్తాము. ఇటువంటి సహకారం ఇకముందు పొందగలనని ఆశిస్తూ మీరందరూ amendments withdraw చేసి సంపూర్ణంగా బలపరచాలని కోరుతున్నాను.

*All the cut-motions were by leave of the House withdrawn.*

Mr. SPEAKER :—The question is :

"That Government be granted a sum not exceeding Rs. 1,34,91,300 under Demand No. VIII–Irrigation."

The motion was carried, and the Grant made.

Mr. SPEAKER :—I now adjourn the House to meet again at 11 a. m. to-morrow.

The House then adjourned.

# *APPENDIX*

[Vide answer to question No. 199 at page 16]

## FINANCIAL POSITION OF DISTRICT BOARDS.

| Name of Board | Opening Balance | Receipts | Expenditure | Revenue surplus or deficit | Closing balance |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |

(In lakhs of rupees.)

1. SRIKAKULAM—

| Name of Board | Opening Balance | Receipts | Expenditure | Revenue surplus or deficit | Closing balance |
|---|---|---|---|---|---|
| 1952–53 (Actuals) ... | 12.04 | 13.46 | 12.89 | +0.57 | *+11.93 |
| 1953–54 (Actuals) ... | 11.93 | 15.64 | 16.77 | – 1.13 | + 9.95 |
| 1954–55 (Revised Estimate) | 9.95 | 14.43 | 15.47 | – 1.04 | + 8.91 |

* Due to capital expenditure of Rs. 0.68.

2. VISAKHAPATNAM—

| Name of Board | Opening Balance | Receipts | Expenditure | Revenue surplus or deficit | Closing balance |
|---|---|---|---|---|---|
| 1952–53 (Actuals) ... | 1.40 | 6.73 | 11.14 | – 4.41 | – 3.50 |
| 1953–54 (Actuals) ... | 3.50 | 8.09 | 11.13 | – 3.04 | – 5.54 |
| 1954–55 (Revised Estimate) | 5.54 | 10.05 | 10.01 | + 0.04 | – 1.68* |

*Due to diversion of Rs. 2.9 lakhs from Railway cess fund.

3. EAST GODAVARI—

| Name of Board | Opening Balance | Receipts | Expenditure | Revenue surplus or deficit | Closing balance |
|---|---|---|---|---|---|
| 1952–53 (Actuals) ... | 0.62 | 26.49 | 23.57 | + 2.92 | +2.15 |
| 1953–54 (Actuals) ... | 2.15 | 21.62 | 21·56 | + 00.6 | +0·58* |
| 1954–55 (Revised Estimate) | 0.59 | 27.55 | 27.53 | + 0.02 | +0.61 |

* Due to capital expenditure of Rs. 1·63 lakhs.

4. WEST GODAVARI—

| Name of Board | Opening Balance | Receipts | Expenditure | Revenue surplus or deficit | Closing balance |
|---|---|---|---|---|---|
| 1952–53 (Actuals) ... | – 6·69 | 18·05 | 19·84 | – 1·79 | – 8·46 |
| 1953–54 (Actuals) ... | – 8·46 | 18·46 | 20·80 | – 2·34 | – 3·11* |
| 1954–55 (Revised Estimate) | – 2·54 | 31·06 | 25·50 | – 5·56 | – 3·02 |

* Due to diversion of 7·09 lakhs from earmarked funds.

5. KRISHNA—

| Name of Board | Opening Balance | Receipts | Expenditure | Revenue surplus or deficit | Closing balance |
|---|---|---|---|---|---|
| 1952–53 (Actuals) ... | 8·48 | 30·22 | 27·16 | 3·06 | 4·98* |
| 1953–54 (Actuals) ... | 4·98 | 36·27 | 33·38 | 2·89 | 2·82† |
| 1954–55 (Revised Estimate) | 2·82 | 30·94 | 33·96 | – 3·02 | – 0·20 |

* Due to diversion of Rs. 6·56 lakhs for capital expenditure.

† Due to diversion of Rs. 5·65 lakhs for capital expenditure.

6. GUNTUR—

| Name of Board | Opening Balance | Receipts | Expenditure | Revenue surplus or deficit | Closing balance |
|---|---|---|---|---|---|
| 1952–53 (Actuals) ... | 0·38 | 23·60 | 26·39 | – 2·79 | – 4·99 |
| 1953–54 (Actuals) ... | – 4·99 | 23·94 | 21·15 | + 2·70 | – 7·34 |
| 1954–55 (Revised Estimate) | –6.24 | [illegible] | 28·01 | + 1·64 | – 4·60 |

| Name of Board | Opening Balance | Receipts | Expenditure | Revenue surplus or deficit | Closing balance |
|---|---|---|---|---|---|
| | 2 | 3 | 4 | 5 | 6 |
| | [In lakhs of rupees]. | | | | |
| 7. NELLORE— | | | | | |
| 1952–53 (Actuals) ... | – 4·96 | 12·16 | 15·56 | – 3·40 | – 5·92 |
| 1953–54 (Actuals) ... | – 6·92 | 13·84 | 14·07 | – 0·23 | – 4·57 |
| 1954–55 (Revised Estimate) | – 4.57 | 14·31 | 14·43 | – 0·12 | – 0·92* |

*Due to diversion from Railway Cess Fund of Rs. 1·84 lakhs in 1953–54 and Rs. 1·90 lakhs in 1954–55.

| Name of Board | Opening Balance | Receipts | Expenditure | Revenue surplus or deficit | Closing balance |
|---|---|---|---|---|---|
| 8. CUDDAPAH— | | | | | |
| 1952–53 (Actuals) ... | 4·70 | 7·99 | 10·90 | – 2·91 | 1·79 |
| 1953–54 (Actuals) ... | 1·79 | 11·49 | 11·44 | + 0·05 | 1·84 |
| 1954–55 (Revised Estimate) | 1·84 | 8·64 | 9·85 | – 1·21 | 0·63 |
| 9. KURNOOL— | | | | | |
| 1952–53 [Actuals] ... | 2·02 | 10·42 | 11·54 | – 1·12 | 0·90 |
| 1953–54 [Actuls] ... | 0·90 | 11·44 | 13·16 | – 1·72 | 0·82 |
| 1954–55 [Revised Estimate] | 0·43 | 13·82 | 15.45 | – 1·63 | – 3·48* |

* Due to 1·42 capital expenditure.

| Name of Board | Opening Balance | Receipts | Expenditure | Revenue surplus or deficit | Closing balance |
|---|---|---|---|---|---|
| 10. ANANTAPUR— | | | | | |
| 1952–53 [Actuals] ... | – 3·27 | 7·58 | 10·48 | – 2·90 | – 5·17 |
| 1953–54 [Actuals] ... | – 5·17 | 8·56 | 9·10 | – 0·54 | 2·51* |
| 1954–55 [Revised Estimate] | 2·51 | 9·72 | 11.68 | – 1·96 | – 0.14 † |

* Due to grant of 7·5 lakhs advance and Rs. 1·55 lakhs Dearness Allowance grant.

† Due to capital expenditure of Rs. 0·69 lakhs.

| Name of Board | Opening Balance | Receipts | Expenditure | Revenue surplus or deficit | Closing balance |
|---|---|---|---|---|---|
| 11. CHITTOOR— | | | | | |
| 1952–53 (Actuals) ... | – 1.20 | 15.23 | 14.59 | 0.64 | – 2.06* |
| 1953–54 (Actuals) ... | – 2.06 | 17.06 | 14.40 | 3. 2 | – 0.49 † |
| 1954–55 (Revised Estimate) | – 0.49 | 12.37 | 12.73 | – 0.36 | 0.90 |

* Due to capital expenditure of Rs. 1·50 lakhs.

† Due to capital expenditure of Rs. 1·09 lakhs.

---

*Note* :—There are slight variations in opening and closing balance of some years which need reconciliation of figures in District Boards.